

నవల :

రసమయి

రచన :

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

ముఖచిత్రం :

గోపి

సంచిక :

మార్చి 1980




సచిత్ర మాసపత్రిక

విజయవాడ-520 002.

# రసమయి

కోటయ్య చాలా అందగాడనడానికి మల్లమ్మయే ప్రత్యక్ష సాక్ష్యం. కోటయ్య చాలా బలవంతుడనడానికి కండలు తిరిగిన అతని శరీరమే ఉదాహరణ. కోటయ్య చాలా మంచివాడనడానికి విశాలమైన అతని నేత్రాలు ప్రత్యక్ష ప్రమాణం. కోటయ్య అదృష్ట వంతుడనడానికి పొగాకుపండిన అతని పొలాలు తార్కాణాలు. కర్లపాలెంలోని రైతుకుటుంబాలలో కోటయ్య కుటుంబానికి అనువంశికంగా ఎంతో మంచిపేరువుంది.

సాయంత్రం పొలంపని ముగించుకొని కోటయ్య ఇంటికి వచ్చాడు. మల్లమ్మ అప్పటికే షోకుచేసుకొని ఉషతోసహా సిద్ధంగా వుంది. మల్లమ్మ ముఖంచూడగానే ఆ సాయంత్రం సినిమా ప్రోగ్రాం పెట్టుకున్న విషయం చటుక్కున గుర్తుకువచ్చింది.

"ఇంకానయం ఆ పొలంలోనే కాసేపు కూర్చొని పొద్దు పోయాక వచ్చానుకాను. మల్లమ్మతో మాటపడవలసి వచ్చేది." అనుకున్నాడు కోటయ్య.

"ఏమయ్యా వెళ్ళేటప్పుడు చిలకకు చెప్పినట్లు చెప్తే ఇంత ఆలస్యంచేశావు? మనం మంగళగిరి చేరేదెప్పుడు సినిమా అందేదెపుడ్పు" అన్నది మల్లమ్మ.

"ఇదిగో ఐదు నిమిషాలలో తెములుతున్నా. నువు బండి కట్టించు" అంటూ కోటయ్య నీళ్ళ గాబు దగ్గరికి వెళ్ళాడు. రెండు చెంబులు గబగబా పోసుకొని మల్లెపూల సబ్బుతో తోముకొని బయటపడ్డాడు. మల్లమ్మ పాలేరును పిలిచి ఈలోగా బండి కట్టించింది.

"సినిమాలట సినిమాలు మా కాలంలో ఈ చిత్రాలెరుగుదుమా? చోద్యాలెరుగుదుమా. దోసెడు జొన్నలు పెడితే తెల్లవార్లూ వీధి భాగోతం ఆడిపోయేవారు. ఏం సినిమాత్రాలా? వెర్రి వెర్రి అంటే వేలంవెర్రి అన్నట్లుంది." కోటయ్య తల్లి కోటమ్మ సణుగుతున్నది. మల్లమ్మ అదేమీ పట్టించుకోవడం లేదు. జంతికలు, చేగోడీలు మూటలు కట్టి ఎడ్లబండిలో పెట్టడంలో నిమగ్నమైంది.

"నాయనమ్మా నాకీ మల్లెపూలదండ పెట్టవే" ఉష కోటమ్మ దగ్గరకు వెళ్ళింది. కోటమ్మకు ఉష అంటే పంచ ప్రాణాలు. దవనం కనకాంబరాలు కలిపి మల్లెపూలతో కట్టిన ఆ దండను ఉష తలలో అందగా పెట్టి ఉష బుగ్గల్ని చిదిమి ముద్దుపెట్టుకుంది కోటమ్మ.

"రావే నీ షోకులు తరువాత. సినిమాకు టైమైపోతున్నది" మల్లమ్మ కూతురిని కసురుకున్నది.

"షోకులుట షోకులు. ఈ షోకులు పెద్దవాళ్ళకేనా ఏమిటి. పిల్లదానికి పనికిరావా? మల్లు పంచె కట్టుకొని పూలరంగడులా వాడు. టెర్లిన్ చీర కట్టుకొని వన్నెలాడిలా ఈమె. వీళ్ళకే కాటోలు ఈ షోకులన్నీ. మా కాలంలో ఈ టెర్లిన్‌లెరుగుదుమా? నైలాన్‌లు ఎరుగుదుమా? ఒకజత ఖద్దరు చీరలుంటే పదేళ్ళు గడచిపోయేవి. ఏం మాయదారి కాలమో? ఏమో?"

"అమ్మా నువ్వూరుకోవే. తమ్ముడొస్తే వాడినొకసారి నిత్యానందంగారింటికిపోయి ఎరువులొచ్చాయేమో అడిగి రమ్మను - మేము వచ్చేటప్పటికి అర్ధరాత్రి అవుతుంది" అంటూ కోటయ్య

బండెక్కి కూర్చున్నాడు. అప్పటికే గూడుబండిలో మల్లమ్మ, ఉష ఎక్కి కూర్చున్నారు.

"బండి పోనివ్వరా" పాలేరును కేకవేశాడు కోటయ్య.

"ఏమయ్యో! పోతూ లక్ష్మివాళ్ళ వాకిట్లో ఆపు. లక్ష్మి కూడా నాతోపాటే సినిమాకు వస్తానంది."

"సినిమాకు పోయేటప్పుడుకూడా దాన్ని వదలవా ఏమిటే"?

"స్నేహమంటే స్నేహమే" మల్లమ్మ నవ్వింది.

నిజమే: బండి లక్ష్మివాళ్ళ వాకిట్లోకి వెళ్ళేసరికే ఆ పిల్ల ముస్తాబై వీధి అరుగుమీద బండికోసం ఎదురుతెన్నులు చూస్తూ కూర్చొనివుంది. బండి ఆగగానే లక్ష్మి అని పిలవబడే లక్ష్మి నరసమ్మ ఎగిరి గంతేసి బండెక్కింది.

"ఇంత అలస్యంచేశారేం అక్కాయ్? సినిమా అందుతుందా?"

"ఆ మూట ఏమిటి లక్ష్మీ"? కోటయ్య అడిగాడు.

"ఇదా ఇది మినపసున్ని, ఇవి సగ్గుబియ్యం వడియాలు,"

కోటయ్య మూట విప్పబోయాడు. అందులోంచి ఓ పుస్తకం వచ్చింది. "ఏం పుస్తకమే ఇది?" కోటయ్య ప్రశ్నించాడు.

"ఇదా. ఇది మనం చూడబోయే సినిమా పాటల పద్యాల పుస్తకం. "కలవరమాయే మదిలో నా మదిలో కన్నులలోన కలలే ఆయే మనసే పూల మండపమాయే" లక్ష్మి పాడుతూ మల్లమ్మ ఏం తెచ్చిందో మూటలు విప్పి చూస్తున్నది. కోటయ్య లక్ష్మి తెచ్చిన మినపసున్ని అప్పుడే తినటం మొదలుపెట్టాడు. గజ్జెలు ఘల్లు ఘల్లు మంటుంటే పాలేరు

"హే హై. హెహేయ్" అనే అదలింపులు లయబద్ధంగా వినపడుతుంటె బండి పంట పొలాల పక్కన దొంకబాటగుండా ముందుకు సాగింది.

ఈ యాత్ర ఒక్క కోటయ్య కుటుంబానిదే కాదు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జరిగిన మహత్తర పరివర్తనలో కర్లపాలెం గ్రామస్తులందరిలోనూ జరిగిన మార్పులలో ఇదొకటి. కర్లపాలెం నుండి మంగళగిరికి నాలుగుమైళ్ళ దూరం. మంగళగిరిలో టూరింగు టాకీసు వెలసిన తరువాత పాటక జనానికి అదొక

తీర్థ స్థలి అయ్యింది. మరీ బలిసిన మోతుబరి రైతులు ఇటు గుంటూరుగానీ అటు విజయవాడ గానీ వెళ్ళి సినిమాలు చూసి వస్తారు. కానీ కర్లపాలెం వంటి అనేక సమీప గ్రామాలకు మంగళగిరి టూరింగు టాకీసే ఏకైక శరణ్యం. సినిమా వచ్చినట్లు ఒకడప్పుల బండి ఈ గ్రామాలలోకి వచ్చి తిరిగి పోతుంది. అక్కడినుండి వేలం వెర్రి మొదలౌతుంది. ఇక జనం ఆ సినిమాను గూర్చే ముచ్చట్లు చెప్పుకోవడం మొదలుపెడతారు. లక్ష్మిలాంటి వాళ్ళైతే ఆ పాటలు పద్యాలు ముందే తెప్పించుకొని బట్టీపడతారు. అక్కడి నుండి ఆ సినిమా గూర్చి పలవరింతలు కలవరింపులు ప్రారంభ మౌతాయి. కుర్రకారు పిల్లలు, గొడ్లకాడ బుడ్డోళ్ళు సినిమా వాల్ పోస్టర్స్‌ను చించి తీసుకు వస్తారు. వాటిని అందిన వాళ్ళు అంది నట్లు పదిలంగా దాచుకుంటారు. వాటితోపాటు సినిమా పత్రికల పుస్తకం ఒకటి ఏ లక్ష్మి వంటి వాళ్ళో ఊళ్ళోకి తెప్పిస్తారు. ఇక దానికి డిమాండు మొదలౌతుంది. అది అక్షరాస్యులైన అందరి ఇళ్ళూ తిరుగుతుంది. భారత భాగవత రామాయణాల్లా దానిని పారాయణ చేస్తారు. మగవాళ్ళు అంజలి బొమ్మను, సావిత్రి బొమ్మను చించి తలుపులకు అంటిస్తారు. ఆడవాళ్ళు నాగేశ్వరరావు బొమ్మను, రామారావు బొమ్మను చింపి దాచుకుంటారు. ఇక ప్రారంభమౌతుంది సినిమాసందడి. వేరుశెనగపప్పు, మినపసున్ని, జంతికలు, చక్రాలు అన్నీ ఓ వ్రతానికి సిద్ధం చేసినట్లు చేసుకొని మూటలు కట్టుకొని ఎడ్లబండి ఎక్కుతారు. బండిలో అలా వెళ్ళ డమూ సినిమా చూడటమూ ఇంటికి రావడమూ అంతా అదొక పెద్ద సంబరం.పాటకజనం ఐతే చేసుకున్న కూలీలో ఓపావలామిగుల్చు కొనినడచిపోయి సినిమాచూసి డొంకల్లోనేపడి నడిచివస్తారు.అదొక మహోద్రేకం- మహోద్వేగం - మహోత్సాహం- పరమానందం.

కోటయ్య బండి చెంగు చెంగున పోతున్నది. కోటయ్యకు చదువురాదు. మల్లమ్మ మాత్రం ఐదోక్లాసువరకూ చదువుకుంది. లక్ష్మికొన్నాళ్ళు గుంటూరులోవుండివచ్చింది. అందుకనిఆఅమ్మాయి ఏడోక్లాసువరకూ చదువుకుంది. లక్ష్మి బస్తీలోవుండి రావడమూ అక్షరజ్ఞానంకలిగివుండడమూకూడా లక్ష్మి ఎడల మల్లమ్మ ఆకర్షణ పెంచుకోవడానికిగల కారణాలలో కొన్ని. మల్లమ్మ చాలా ఉత్సా

హంగావుంది. లక్ష్మి తను పాటల పద్యాల పుస్తకంలో చదివిన సినిమా కథ వివరించి చెపుతున్నది.

"ఏమయ్యా నువు రాజకుమారుడు. నేను రాజకుమారి ఐపోతే బాగుండు" అంది మల్లమ్మ.

"అనుకోగానే ఐపోతాములే?" అన్నాడు కోటయ్య.

"ఎందుకు కాలేము? కావాలని ప్రయత్నిస్తే ఐపోవచ్చు. ఈ సినిమా కథలో తోటరాముడు రాజకుమారుడు కాలేదా ఏమిటి?"

"నీ మొహం. అవి సినిమాలే" అంటూ జంతికలు తిన సాగాడు కోటయ్య.

ఉసుళ్ళను ఆకర్షించడంకోసం పొలాలలో అక్కడక్కడా మంటలు వేస్తున్నారు. ఎదురుగావస్తున్న గొర్రెల గుంపు చీకటిలో కలిసిపోయి వాటి కళ్ళుమాత్రం పచ్చగా మెరుస్తూ వేయి కళ్ళతో దేవేంద్రుడు తూర్పునుంచి దిగివచ్చినట్లుంది.

"తొందరగా పోనీరా చీకటిపడిపోయింది."

"ఫరవాలేదండీ ఎనిమిదైతేగానీ అక్షరాలు వెయ్యరు" అన్నాడు పాలేరు తనకున్న జ్ఞానంతో.

"ఈ బాధంతా ఎందుకు. హాయిగా మీరు బస్తీలోవుంటే సరిపోలే రోజూ సినిమాలే చూడవచ్చు. అక్కడ పెసరట్లు ఎలా వుంటాయనుకున్నావ్? మన వూళ్ళో రంగమ్మపోసే అట్లు వున్నట్లు వుంటాయనుకుంటున్నారా? ఏమిటి అక్కాయ్. వాటి రుచే వేరు. పచ్చిమిరపకాయలు, అల్లం ముక్కలు వేసి సన్నగా ఉల్లిపాయలు తరగి చల్లివేసిన పేపరు పెసరట్టు తింటుంటే స్వర్గం బెత్తెడు దూరంలా వుంటుంది" లక్ష్మి గుటకలు మింగు తున్నది.

కోటయ్య నోట్లో నీరూరి రెండు చేగోడీలు కొరికాడు.

"మా ముఖానికి అంత అదృష్టమా లక్ష్మి యీ పల్లెటూళ్ళో సమాధి కావలసిందే" అంటూ కారప్పూస మూట విప్పింది. బండి మంగళగిరి చేరింది. అక్కడ ఇసుకవేస్తే రాలనంతజనం. పాలేరు బండిని టూరింగ్ టాకీసు పక్కన వేపచెట్టుకింద నిలిపి ఎడ్లకు మేత వేసి జనంలోకి పోయాడు. హాస్య నటుడు శివరావు కారులో

విజయవాడ పోతున్నాడు. ఎవరో పసిగట్టి "శివరావు శివరావు" అని అరిచారు. జనం గుమిగూడారు. కారు స్లో చేయబడింది. ఇంకేం తండోప తండాలుగా జనం పోగైనారు. శివరావు సినిమాలలో చెప్పిన డైలాగులన్నీ పల్లిస్తూ జనం కారుకు అడ్డంపడ్డారు. శివరావు బయటికి వచ్చి అందరికీ నమస్కారం పెట్టి "బాబూ నేను తొందరగా పోవాలి దారి ఇవ్వండి" అని అన్నాడు.

అంత త్వరగా దారి ఇస్తే వాళ్ళ సిని అభిమానం ఎట్లా వ్యక్తమౌతుంది. ఒకడు పెట్రోమాక్సు లైటు స్టూలు పీటాతెచ్చి శివరావుకు దగ్గరగా పెట్టాడు. మరొకడు పూలదండ వేశాడు, మిఠాయి దుకాణంవాళ్ళు స్వీట్లు తెచ్చారు. 'శివరావు జిందాబాద్' అనే కేకలు మిన్నుముట్టాయి. పాలేరు ఈ కబురుతెచ్చి కోటయ్యకిచ్చాడు.

"ఎట్లా ఎట్లా? శివరావే వచ్చాడా? ఆయనకు మినపసున్ని అంటే ఇష్టం. నే చేసింది తీసుకెళ్ళి ఇస్తాను" అన్నది లక్ష్మి.

"నువ్వూరుకోవే. మరీను. ఆ సినిమా యాక్టరువచ్చి నీతో చెప్పాడా ఏమిటి. "లక్ష్మీ నీచేతి మినపసున్నుండలు నాకెంతో ఇష్టం" అని "నువ్వా గుంపులోకి పోయినావంటే ప్రాణంతో బయటికి రాలేవు" అన్నాడు కోటయ్య.

మల్లమ్మకు శివమెత్తినట్లు అయ్యింది.

"ఏమయ్యా నన్నెట్లాగైనా కారు దగ్గరికి తీసుకుపోవయ్యా సినిమా యాక్టరును దగ్గరినుంచి చూస్తాను" అన్నది మల్లమ్మ.

కోటయ్య మల్లమ్మవైపు సాభిప్రాయంగా చూశాడు. ఉష ఎగిరెగిరి పడుతూ "నాయనా నీవెటుదిరిగీ సినిమా యాక్టరువుగాదు కనీసం సినిమా యాక్టరునన్నా చూపించవే" అన్నది.

"మీ ఆడంగులు నోరుమూసుకుంటారా?" కోటయ్య గదమాయించాడు. జనంలో వేలంవెర్రి పెరిగిపోతున్నది. కారుకు దగ్గరగా అందుబాటులోవున్న ఆడవాళ్ళు శివరావుకు షేక్‌హ్యాండ్ ఇస్తున్నారు. కొందరు తలల్లోని పూలదండలుతీసి విసురుతున్నారు.

"హేయ్ హేయ్ దైవాధీనం"అంటూ జనంగెంతుతున్నారు. ప్రతివాడూ ఒక శివరావులాగా ఎగురుతున్నాడు. అతి కష్టం మీద ఆ సినిమా యాక్టరు వాళ్ళను తప్పించుకొని కారు నడుపు

తుంటూ విజయవాడ రోడ్డు పట్టేసరికి ప్రాణాంతకమైంది. అప్పటికి రాత్రి పదిగంటలయింది. అప్పుడు సినిమా మొదలుపెట్టారు సినిమా వదిలేసరికి ఒంటిగంటయింది. సినిమా కాగానే పాలేరు మళ్ళీ బండికట్టాడు. రాత్రి చీకటిలో బండి కర్లపాలెం దోవ పట్టింది. ఉష నిద్రపోయింది. లక్ష్మి తూగుతున్నది- మల్లమ్మ మాత్రం ఊహాలోకాల్లో విహరిస్తూంది. రాజకుమారి స్థానంలోతనని వూహించుకుంటున్నది- ఎన్.టి. రామారావుకు బదులు కోటయ్య 'ఓహో అదొక భూతల స్వర్గం' సినిమాలలోవలె బ్రతికితే ఎంత ఆనందంగా వుంటుందో.

"మద్రాసుపోతే అంజలి, నాగేశ్వరరావు, భానుమతి అంతా కనపడతారు" అని లక్ష్మి ఇంతకుముందుచెప్పిన మాట మల్లమ్మ చెవుల్లో రింగుమంటున్నది. లక్ష్మికోటయ్యాకూడాగూడు బండికి ఆనుకొని నిద్రపోతున్నారు. పాలేరు ఎద్లుమాత్రం మెలుకువతోసాగిపోతున్నాయి. మల్లమ్మ అనుకున్నది

"ఏమైనా సరే.బస్తీకిపోవాలి. అక్కడ కాపురంపెట్టాలిఅని.

"అదెలా సాధ్యం?" మల్లమ్మ మనస్సు ప్రశ్నించింది.

"దానికేం కోరికేఉండాలికానీ కోటిఉపాయాలు లేవా?" మల్లమ్మ తనకుతానే సమాధానంచెప్పుకుంది.

బండి చేల మధ్యగా సాగిపోతున్నది. కందిచేలమీదుగా వస్తూన్న చల్లని గాలులు నిశ్శబ్ద నీరవ సంగీతాన్ని వినిపిస్తున్నాయి. చేల గట్లమీద పూచిన గడ్డిపూలు సుగంధ మాధుర్యాన్ని చవిచూపిస్తున్నాయి. బండి మువ్వలశబ్దం ఒంటరిగా ఏకాంతాన్ని చీల్చుకుంటూ ముందుకు పోతూన్నది.

పొలాలు పక్కన పాము కుబుసం విప్పుతున్న వాసన పాలేరు పసిగట్టాడు. తుమ్మ చెట్ల మీద గిజిగాళ్ళూ, కొంగలు ప్రశాంతంగా నిద్రపోతున్నాయి.బండి కర్లపాలెం చేరింది.పాలేరుఎద్దుల్ని విప్పి కట్టేసి మేతవేశాడు. కోటయ్య మల్లమ్మ మంచాలపై మేనులు వాల్చారు. "అర్థరాత్రి అపరరాత్రి సినిమాలుట సినిమాలు. అందుకే దీనిని కలికాలం అన్నారు. ఆడవాళ్ళకు బుద్ధులు లేవు సరే. మగవాళ్ళ బుద్ధి ఏమైనట్లు?" కోటమ్మ మగత నిద్రలో గొణుగుతున్నది. మల్లమ్మ చికాకు పడుతూ నిద్రపోయింది.

## 2

మల్లమ్మకు లక్ష్మి అంటే చాలా యిష్టం. నిజానికి వీరిద్దరూ ఒకే వయసు కలవారు కాదు. కానీ లక్ష్మి మాటల్లో ఏదో మత్తు వుంది. సమ్మోహన శక్తి వుంది. దానిచేత మల్లమ్మ ఆకర్షింపబడుతున్నది. లక్ష్మి గ్రామానికి సంబంధించిన ఎన్నో సంగతులు చెపుతుంది. ఎన్నో ఏళ్ళనుంచి వూళ్ళో వున్నా అవన్నీ తనకు తెలియవు. ఇన్ని సంగతులు లక్ష్మి ఎలా సేకరిస్తున్నది? లక్ష్మి చెప్పేవి అబద్ధమేమోనని మొదట మల్లమ్మ అనుమాన పడింది.కానీ విచారిస్తే అవన్నీ నిజాలేనని తేలింది. లక్ష్మి చెప్పే కబుర్లలో ముఖ్యమైనది బుచ్చిబాబు కథ. బుచ్చిబాబు చాలా పోకిరీగా ప్రవర్తిస్తున్నాడు. ముఖ్యంగా లక్ష్మిని చూచినప్పుడు అల్లరిచిల్లరిగా వ్యవహరిస్తున్నాడు.

"మొన్న నేను కోమటి గురవయ్య దుకాణానికి వెళ్ళాను. మా అమ్మ అల్లం, వెల్లుల్లి కొనుక్కొని రమ్మన్నది. గురవయ్యతో బేరమాడుతూండగా నా వెనుక ఎవరో నిలబడినట్లు అనిపించింది.వెనక్కితిరిగి చూద్దును. బుచ్చిబాబు నిలబడి వున్నాడు" "గురవయ్యా ఓ గోల్డుఫ్లేక్ సిగరెట్ ప్యాకెట్టియ్యి."

"అయిపోయినాయండీ."

"పోనీ త్రీ క్యాజిల్స్."

"తెప్పించడంలేదండీ."

"సరే చార్మినార్ తగలెయ్యి."

"సిజర్స్ ఇస్తాను మీరే తగలేసుకోండి బాబూ" అని గురవయ్య ఒక జోక్ వేశాడు.

అల్లం వెల్లుల్లి పొట్లాలుకట్టి నాకిచ్చాడు.

"ఔనయ్యా నీకు ఆడవాళ్ళు ఎప్తేసరి ఇంకెవరూ కనపడరు" అన్నాడు బుచ్చిబాబు.

"అదెట్లాగండీ ముందొచ్చినవాళ్ళకు ముందివ్వాలి. లేకుంటే దెబ్బలాడుతారు."

"నాకా ముందువెనకలు లేవయ్యా అంతా సమానమే" అన్నాడు బుచ్చిబాబు కొంటెగా నావైపుచూసి నవ్వుతూ.

నేను సిగ్గుతో తలవంచుకొని ఓరగా బుచ్చిబాబువైపు చూస్తూ వెళ్ళిపోయాను.

"ఈ అమ్మాయి పెద్దబ్బాయిగారి లక్ష్మిలాగుందే" అంటు న్నాడు బుచ్చిబాబు.

"ఊళ్ళో ఆడపిల్లల ముచ్చట మీకెందుకండీ. మీ సిగరెట్లు అగ్గిపెట్టె కొనుక్కొని మీ దోవన మీరు పోక" అన్నాడు గుర వయ్య నవ్వుతూ.

"ఓరోరి గురవయ్యా నీవూ నాకు నీతులు చెప్పేవాడివి అయినావా? నేనిప్పుడేమన్నాను? ఆ పిల్ల చేయి పట్టుకున్నానా? బుగ్గ గిల్లానా? ఫలానా వాళ్ళ అమ్మాయా అని అడిగాను. అదీ తప్పేనుటయ్యా?" అని బుచ్చిబాబు అనడం నాకు వినిపించింది"

"బుద్ధిలేకపోతే సరి వెంటనే వాడి చెంప ఛెళ్ళుమనిపించ వలసింది" అన్నది మల్లమ్మ.

"నిజం చెప్పొద్దూ బుచ్చిబాబు అలా అంటుంటే నాకేదో జిల్ జిల్ మనిపించిందక్కాయ్.

"ఓసి. పోవే మొద్దు మొహమా. మగవాళ్ళకేం నోటికొచ్చి నట్లల్లా అంటుంటారు. మనమే జాగ్రత్తగా వుండాలి."

ఆ తరువాత లక్ష్మి ఊళ్ళో మల్లమ్మకు తెలియని ఎన్నో ప్రేమ పురాణాలు చెపుతుంది.

"నీ బుద్ధి బుగ్గలై పోను. నీకు వేరే పనేం లేదా? ఎప్పుడూ ఈ ముదనష్టపు కబుర్లే" అని మల్లమ్మ విసుక్కునేది మొదట. కానీ కొంతకాల మయ్యేసరికి లక్ష్మి చెప్పే ముచ్చట్లు వినడంలో మల్లమ్మకేదో మత్తు కనిపించింది. అందులోనూ లక్ష్మి చాలా చమ త్కారంగా రసవత్తరంగా ఈ కథలను చెపుతుంది. ఇంటికిపోతే నిరంతరం ముసలమ్మతో దెబ్బలాట అందుకని మల్లమ్మకు క్రమంగా లక్ష్మితో కూర్చున్న కాసేపే స్వర్గంగా అనిపిస్తున్నది.

ఒకనాడు ఒక విచిత్రం జరిగింది. ఆ రోజు కర్లపాలెం రైతులు సామూహికంగా ఎలుకల నిర్మూలనం కార్యక్రమం తలపెట్టారు. కోటయ్యతోపాటు మల్లమ్మ కూడా పొలానికి వెళ్ళింది. ఎలుకలు పచ్చని పైరులను కొరికి తమ బొరియలలోకి తీసుకొని పోతాయి. అందుకని రైతుకు ఎలుక, మిడత ముఖ్య శత్రువులు.

ఎలుకలు ఒక పొలంలో నిర్మూలింపబడితే లాభంలేదు. పక్క పొలంలోవి మళ్ళీ వస్తాయి లేదా మందు పెట్టారని పసిగట్టగానే అవి ఈ పొలంలో నుండి పక్క పొలంలోకి పారిపోతాయి. కాబట్టి అన్ని పొలాలలోనూ ఒకేసారి అనుకొని రైతులు ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. క్రితం రోజు అన్నీ బొరియలకు రైతులు కాగితాలు అడ్డంపెట్టి వెళ్ళారు. కొన్ని బొరియలలో ఎలుకలుండవు పాములుంటాయి. అందువల్ల ఆ బొరియలలో మందువేయడం వ్యర్థం. ఎలుక వున్న బొరియకు పెట్టిన కాగితం తెల్లవారే సరికి కొరికివేయబడి వుంటుంది. అదే గుర్తు. కోటయ్య మిగిలిన రైతులు ముందుగా సజ్జపిండిని, గోధుమ పిండిని బెల్లపు ముట్టితో కలిపి పెట్టారు. ఎలుకలు వాటిని తిని మచ్చిక పడ్డాయి. ఆ తరువాత ఎరకలిపిన ఆహారం పెట్టారు. సుమారు 97 గ్రాముల బియ్యపు పిండికి 2 గ్రాముల జింకు సల్ఫేటు కలిపారు. కొంచెం నూనె బెల్లపు ముట్టీ కలిపి వాటిని చిన్న చిన్న పొట్లాలుగా కట్టారు. ఈ పొట్లాలను బొరియలలో పడేశారు. కొన్ని బొరియలలో సుమారు 6 గ్రాముల బరువుగల అల్యూమినియం ఫాస్ఫేట్ బిళ్ళలు రెండేసి చొప్పున వేశారు. కోటయ్య అధ్వర్యం వహించి కార్యక్రమం అంతా నిర్వహిస్తున్నాడు.

"ఈ హడావుడంతా ఎందుకంట?" మల్లమ్మ ప్రశ్నించింది.

"ఎందుకేమిటే వెర్రిమొహమా. పంటను రక్షించుకోవటానికే" అన్నాడు కోటయ్య. మల్లమ్మ పంట చేనులా నవ్వింది.

"చాల్లేవయ్యా. మిడతల్ని, పురుగులని ఎలుకలు చంపుతాయి. ఎలుకల్ని పాములు తింటాయి. పాముల్ని ముంగిసలు చంపుతాయి. మనం వేటినీ చంపనక్కరలేదు. భగవంతుడే అంతా ఏర్పాటు చేశాడు. నీకీ పాపం ఎందుకంట?"

"పో పోవే – ఇంటికి పోయి పప్పుచారేసుకొని అన్నం తిని లక్ష్మితో కబుర్లు చెప్పుకుంటూ కూర్చో. నీ మాటలు వింటుంటే ఇక పంట చేతికొచ్చినట్లే. అధికోత్పత్తికి ఇంతకంటే మార్గంలేదు. అంత భూతదయ గలిగిన దానివి పోయి తపస్సు చేసుకో."

"తపస్సంటే గుర్తుకువచ్చింది నేనొక కథ విన్నాను. పొలం

దున్నితే నాగలి క్రొరుకు పురుగులుతగిలి చస్తాయని వ్యవసాయం మానుకొని జీవులని రక్షించాలని చెప్పారు."

"అయితే వాళ్ళు అన్నం తినరా?"

"లేదు వ్యాపారం చేసుకుంటారు. ఆ డబ్బుతో భోంచేస్తారు."

"వెర్రి మొహమా. వ్యాపారానికి గింజలు కావాలిగా. వాటి నెవరు పండిస్తారు? కాబట్టి ఎలుకలని చంపటం పంటలు పండించడం హింసకాదు. కావాలంటే పోయి పురాణం శాస్త్రిలుగారి నడుగు."

పురాణం శాస్త్రిలు అనేసరికి మల్లమ్మకు లక్ష్మి గుర్తుకు వచ్చింది మొన్న లక్ష్మి పురాణం జరుగుతున్నప్పుడు గుడికి వెళ్ళిందిట. అందులో మేనక అనే అప్సరస విశ్వామిత్రుడి తపస్సు చెడగొట్టడమూ వాళ్ళకు శకుంతల అనే అమ్మాయి పుట్టడమూ ఆమెను దుష్యంతుడనే రాజు ప్రేమించడం చెపుతున్నాడట. దుష్యంతుడు శకుంతల పమిట పట్టుకొని లాగాడు అని చెపుతూండగా లక్ష్మి వెనకకు తిరిగి చూసింది. అక్కడ బుచ్చిబాబు నిలబడివున్నాడు. బుచ్చిబాబే దుష్యంతుడైనట్లు, తానే శకుంతల అయినట్లు లక్ష్మి ఊహించుకున్నానని చెప్పింది. మల్లమ్మకిప్పుడిది గుర్తుకువచ్చింది. కోటయ్య దుష్యంతుడైనట్లు తాను శకుంతలయినట్లు ఒక్కసారి ఊహించుకుంది చేను పక్కన ఈతచెట్లకు దట్టంగా కానరతీగలు అల్లుకున్నాయి. సుమారు రెండుమూడు అంగుళాలు మాత్రమే ఉండే ఈ కానరకాయలు వేపుడుచేస్తే చాలా బాగుంటాయి. మల్లమ్మ పొలానికి రావటానికి ఒక కారణం ఈ కానరకాయలు కోసుకోవడము. శకుంతల పూలుకోస్తున్నదని చెప్పిన దృశ్యాన్నిగుర్తుచేసుకుంటూ ఒడినిండా కానరకాయలుకోసుకున్నది అలాఊహల్లో కరిగిపోతూ మల్లమ్మ ఇంటికి పోయేసరికి అక్కడొక విచిత్రంజరిగింది కోటమ్మ అప్పటికే బస్తాలు కాటా వేయించింది. వేరుశెనగకాయల బస్తాలలో ఒక బస్తా సగమేవుంది. ఇంతలో మల్లమ్మ కనపడింది.

"ఏమే బస్తాలో వేరు శెనగకాయలు ఏమైనాయి."

"ఏమౌతాయి ఎలుకలు తినుంటాయి. ఎలుకలు - జింకు ఫాస్పేటు."

"నేను శెనక్కాయలేవే అంటే నీవు ఎలుకలు జింకలు

అంటావేమే? తల తిరుగుతున్నదా? బస్తా బస్తా తీరునేవున్నది లోపల కాయలు మాయమయినాయి."

మల్లమ్మ ఇవేవీ పట్టించుకోకుండా వంటగదిలోకి వెళ్ళింది. కాసరకాయలు తరగటం మొదలుపెట్టింది.

"అందుకే అన్నారు ఇంటిదొంగను ఈశ్వరుడైనా పట్టలేడని" ముసలమ్మ అన్న ఈ మాటలు మల్లమ్మకు ములికివలె సోకింది కత్తిపీట విసిరి అవతల పడేసి కోపంగా ముందుగదిలోకి వచ్చి.

"ఏమిటమ్మా వాగుతున్నావ్? ఎవరుట దొంగలు?" అన్నది.

"కనపడితే దొంగ కనపడకుంటే దొర."

"ఎవరి నమ్మా పాలేరునా అంటున్నావు?"

"పాలేరుకు అంత సాహసమెక్కడిదే?"

"అయితే ఇంకెవరు? నువ్వా? నేనా?"

"ముసలి ముండను నాకు వేరుశెనక్కాయలెందుకు నాకేం స్నోలా? పౌడర్లా? సినిమాలా? చిత్రాలా?"

కోపంతో మల్లమ్మ వణికిపోయింది. ఆమె ముఖం ఎర్ర మందారంలా మారింది. సుడిగాలికి ఊగుతున్న వరిమొక్కలాగా మల్లమ్మ కదిలిపోయింది.

"అంటే ఏమిటి? నా సొమ్ము నేనే అమ్ముకుంటున్నానా దొంగతనంగా?"

"ఏమో నాకేం తెలుసు?"

"ఏం తెలియకపోతే అంతలావు మాటలు ఎట్లాగన్నా వమ్మా?"

"ఏమన్నాను? నేనేమన్నాను? వేరుశెనక్కాయలు తగ్గినై అన్నాను. అనకూడదా?"

"నీవంతే అన్నావా? స్నోలకు, పౌడర్లకు నేను వేరు శెనక్కాయలు అమ్ముకున్నానని అనలేదా?"

"ఆ మాట నేననలేదు. నీకా అర్థం వచ్చిందేమో, గుమ్మడి కాయల దొంగలెవరంటే భుజాలెందుకు తడుముకుంటావు?"

"ఏమమ్మా మరీ మితిమీరి పోతున్నావు? నేనే దొంగనై నా భుజాలు తడుముకుంటున్నానా? కోపంతో మల్లమ్మ రెచ్చిపో

యింది. అలాగే కోపంతో వాకిట్లోకి పరుగెత్తి పాలేరును కేక వేసింది. వణుకుతూ పాలేరు వచ్చాడు.

"ఒరే లగెత్తుకునిపోయి కోమటి గురవయ్యను వున్నపాళాన పిలుచుకురా"

పాలేరు పరిగెత్తాడు. ముసలమ్మ కంట తడిపెట్టుకొని ముక్కు చీదుకుంటూ, "ఈ కోడలు సంసారాన్ని బజారుకెక్కిస్తున్నది, ఇంటి గుట్టు లంకకు చేటు అని కుటుంబ రహస్యాలు రచ్చబండ మీద పంచాయతి పెడుతున్నది. నేనిప్పుడేమన్నానని కోమటి గురవయ్య సాక్ష్యాలు"

"నీవు నోరు మూసుకోవమ్మా చేసిందంతా చేసి ముంగిలా మూల కూర్చున్నావు. ఇన్ని మాటలంటే ఎవరూరుకుంటారు? ఇన్నాళ్ళనుంచి సంసారం చేస్తున్నాను నాకే దొంగతనమంట గడతావా?"

కోమటి గురవయ్య చేతులు కట్టుకొని వచ్చాడు.

"ఏం గురవయ్యా - వచ్చావు నీకేం పనీపాటా లేదా?" అన్నది కోటమ్మ విసుగ్గా.'

"అదేమిటమ్మా పనీపాటా మానుకొని దుకాణం మీద బుడ్డోడిని కూర్చోపెట్టి లగెత్తుకుంటూ వచ్చినాను. మీరు కబురు పెట్టారంటే" అన్నాడు గురవయ్య తల గోక్కుంటూ నిలబడి.

"గురవయ్యా నిన్న స్నో, పౌడర్, బొట్టు సీసా మా కోసం పంపించావా?" మల్లమ్మ అడిగింది సూటిగా చూస్తూ.

"నేనా అండి, మీ కోసమా అండి, పంపించటమా అండి" గురవయ్య నసుగుతున్నాడు.

"ఏమిటి గురవయ్యా నీ గుణం పోనిచ్చుకున్నావుగాదు. అయితే అవునని చెప్పు లేకుంటే కాదని చెప్పు. అంతేకాని ఇట్లా నానుస్తావెందుకు." అన్నది ముసలమ్మ.

"పంపించినానండి అయితే అవి మీ ఇంటికో ఇంకెవరింటికో తెలియదు" అన్నాడు గురవయ్య.

"భయంలేదు గురవయ్యా నిజం చెప్పు. నా కోసమే నేనే పాలేరును పంపించాను వాడికి ఏవేవి ఎంతెంతిచ్చావో చెప్పు." అన్నది మల్లమ్మ.

గురవయ్య చాలా తెలివైనవాడు. పల్లెటూళ్ళలో బేరాలు చాలా తమాషాగా ఉంటాయి. కొందరు రొఖ్ఖంఇచ్చి కొనుక్కుపోతారు. కొందరు అరువు పెడతారు. మరికొందరు బార్టర్ సిస్టమ్ వాడతారు. బియ్యము, వడ్లు, జొన్నలువంటి ధాన్యాలు గురవయ్యకి కొలిచి కావలసిన వస్తువులు తీసుకుపోతారు. ఈ అరువులు వసూలు చేసుకోవడం ధాన్యాన్ని బేరమాడుకొని సరసమైన ధరలకు వస్తువులివ్వడం చాలా తెలివిగా చేయవలసినపనులు. ఇవి ఇలా ఉండగా కొందరు కొన్ని వస్తువులు మూడోకంటివాడికి తెలియకుండా కొనుక్కుపోతూ వుంటారు. అత్తలకి తెలియకుండా కోడళ్ళు స్నో పౌడర్లు తెప్పించుకోవడాలు, మొగుడుకి తెలియకుండా భార్య బెల్లం వేరుశెనగపప్పు తెప్పించుకొని పాకంపట్టి ఉండలు చేసుకొని తినడాలు ఇలాంటివన్నీ జరుగుతుంటాయి. వీటికన్నా ఇంకొక ప్రమాదకరమైనదికూడా జరుగుతూంటుంది. ధాన్యం మిర్చినంటి తమ వస్తువుల్నే తాము కుటుంబ సభ్యులకి తెలియకుండా అమ్ముకోవడాలు జరుగుతుంటాయి. వీటిని చాలా గుప్తంగా ఉంచాలి. లేకుంటే ఆఅమ్మినవాళ్ళతోపాటు కొన్నవాడు కూడా ఒక్కొక్కప్పుడు అల్లరిపాలు కావచ్చు. అందుకే గురవయ్య ఎప్పుడూ దేనికీ ఔననీ కాదనీ అనడు. మల్లమ్మ ధైర్యమిచ్చేసరికి గురవయ్య నిజం చెప్పాడు.

"అయితే పాలేరు కొనుక్కుపోయింది మీ కోసమేనేమో నాకు తెలియదమ్మా."

"నా కోసమే గురవయ్యా పాలేరు నీ కేమిచ్చాడు?"

"ఏ మిచ్చాడా? నే నప్పుడు దుకాణం మీద ఉన్నానా? లేక మా బుడ్డోడు ఉన్నాడా?"అంటూ ఆలోచన మొదలు పెట్టాడు.

"నీవే ఉన్నావు. పదిరూపాయలిస్తే అప్పుడు చిల్లర లేదని అన్నావుట"

గురవయ్యకు ఇప్పుడు పూర్తిగా ధైర్యంవచ్చేసింది. కాబట్టి ఇక నటనమాని నిజం చెప్పాడు.

"ఔనండమ్మా గుర్తుకు వచ్చింది. మీ పాలేరు పది రూపాయల నోటు పట్టుకొచ్చాడు. అప్పుడు నేనే దుకాణంమీద ఉన్నాను. స్నో పౌడరు బొట్టుసీసా ఇచ్చిపంపాను. చిల్లరకుమళ్ళీరమ్మన్నాను."

మల్లమ్మ మునలమ్మవైపు కోపంగా చూచి "ఆ పది రూపా యల నోటు నీ కోడుకు నాకిచ్చినది. కావాలంటే ఆ యన నడుగు" అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

మునలమ్మ వెంటనే ఓ ట్రిక్కు వేసింది. అందులో గుర వయ్య పడిపోయాడు. మునలమ్మ గొంతు తగ్గించి గురవయ్యను దగ్గరికి పిలిచి "ఇదిగో నేను పంపించిన వేరుశెనక్కాయలు అందాయా? అని అడిగింది.

"మీరా అమ్మా? వేరుశెనక్కాయలా అమ్మా? పంపడమా అమ్మా?" అన్నాడు గురవయ్య.

"ఔనయ్యా ఆ పంపింది నేనే నీ విచ్చిన డబ్బుకూడా ముట్టింది తూకానికి ఎన్నొచ్చినయేమిటి?" అన్నది.

"తూకానికా అమ్మా? డబ్బా అమ్మా?" కనుక్కొని చెపు తానమ్మా"

"అదేమిటయ్యా నీచేతికే కాయలిచ్చానని మావాడు చెప్పాడు నువు తక్కువ డబ్బులు చేతిలో పెట్టావనికూడా చెప్పాడు" ఈ వల్లలో గురవయ్య పడిపోయాడు.

"మీరు నిన్నంత దగాకోరుగా అనడం ఏం బాగాలేదమ్మా ఇన్నేళ్ళుగా వ్యాపారం చేస్తున్నాను నా బుద్ధి మీకు తెలియదా? కావాలంటే సూర్యంబాబుని పిలిచి అడగండి. మార్కెట్ రేటే లెక్కకట్టి ఇచ్చాను. దొంగసొమ్ము అని నేనేం తక్కువచేసి చేతిలో పెట్టలేదు."

"చాల్లే నువు రహస్యం చెపితే పది ఊళ్ళకు వినపడు తుంది. ఇక వెళ్ళు" అన్నది కోటమ్మ.

గురవయ్య నసుగుతూ వెళ్ళాడు.

సూర్యం కోటయ్య తమ్ముడు. కోటమ్మ చిన్న కొడుకు. వాడు వేరుశెనగ కాయలు దొంగిలించి అమ్మాడన్నా వార్త మల్లమ్మ విన్నదేమోనని కోటమ్మ గజ గజ లాడిపోయింది. ఇంట్లో ఇలాంటిది ఏదో జరుగుతున్నదని తెలుసుగానీ అందుకు కారణం సూర్యం అని కోటమ్మకి తెలియదు. సూర్యం అంటే కోటమ్మకు ఆరో ప్రాణం. ఉష అన్నాకూడా కోటమ్మకు ముద్దే. కోడలంటేనే మంట. కోడల్ని సాధించుదామని తాను చేసిన ప్రయత్నం ఎదురు

తిరిగింది. ఆర్రాత్రి కోటమ్మ ఎంగిలి పడలేదు. మల్లమ్మ కూడా మంచినీళ్ళు ముట్టలేదు. తలనొప్పికి మాత్రలు మింగి అమృతాంజనం పట్టించి తలకట్టుతో పడుకుంది మల్లమ్మ.

# 3

కోటయ్య ఉత్సాహవంతుడే కాదు. కార్య శూరుడుకూడా. ఎండా కాలంలోనే పొలానికి పశువుల ఎరువు తోలిస్తాడు. భాస్వరం నత్రజని సకాలంలో ఎంత ఖరీదైనా కొని వాడుతాడు. విత్యానందం అమ్మకపోతే విజయవాడపోయి అయినా తెస్తాడు. ఎలుకల సామూహిక నివారణ,కలుపు నివారణ,అగ్గితెగులు నివారణ కాండంతొలిచే పురుగుల నివారణవంటివన్నీచాలా సమర్థవంతంగా దగ్గరుండి చేయిస్తాడు.ఒక్కొక్కప్పుడు పొలాన్ని వదిలిపెట్టి ఇంటికికూడా రాడు. పొలమే అతనికితల్లి.పొలమే అతనికిభార్య.పొలమేఅతనికికూతురు.

మల్లమ్మకిది ఇష్టంలేదు. మొగుడితోకలిసి గుంటూరు విజయవాడ తిరగాలని. సర్కసులు. సినిమాలు చూడాలని ఆమెకోరిక. మరీ గత్యంతరంలేకపోతే తప్ప కోటయ్య సామాన్యంగా ఇలాంటి వాటికి రాడు. అయితే మొన్న దొంగతనం నేరం అత్తమోపిన నాటినుండి మల్లమ్మ పట్టినపట్టు విడువలేదు. ఇంట్లో ఏం జరిగిందో తెలియకపోయినా, మొత్తానికి అత్తా కోడళ్ళమధ్య ఏదో భయంకరమైన పోట్లాట వచ్చిందని కోటయ్య గ్రహించాడు.

"నీకా ముసలిదాంతో ఎందుకే? పెద్దతనంవల్ల మతి స్థిమితం తప్పింది. నువ్వసలు పట్టించుకోమోకు" అని అన్నాడు కోటయ్య.

"చాల్లేవయ్యా నువు తల్లిని వెనకేసుకొని రాకపోతే ఏం చేస్తావు? ఇవాళ దొంగతనమన్నది రేపు లంజతనమంటుంది. ఆమె నోటికి హద్దులేకుండాపోయింది. నేనింక ఈ కొంపలో బ్రతకలేను." అన్నది మల్లమ్మ కన్నీళ్ళుపెట్టుకొని.

కన్నీళ్ళనే రామ బాణం మల్లమ్మ ప్రయోగించే సరికి కోటయ్య బేజారెత్తిపోయాడు. మల్లమ్మనెలాగైనసరే ఊ ఊళ్ళుతిప్పి ఉల్లాసం కలిగించాలనుకున్నాడు. వెంటనే మల్లమ్మను ఉషను తీసుకొని హైదరాబాదు ప్రయాణంకట్టాడు. కోటయ్య మేనత్త

కొడుకు పరబ్రహ్మం హైదరాబాదులో పొగాకు వ్యాపారం చేస్తున్నాడు. అందుకని పరబ్రహ్మం మంగళగిరి కర్లపాలెం వస్తూంటాడు. ఈ గొడవ జరిగిన వారంలోనే పరబ్రహ్మం కర్లపాలెం వచ్చాడు.

"ఒరే పరబ్రహ్మం మల్లమ్మకు మీ హైదరాబాదు చూపించరా."

"అదేమిటి బావా అంతా కలిసిరండి నాతోపాటే. పోదాం. దగ్గరుండి చూపిస్తాను" అన్నాడు పరబ్రహ్మం.

వెంటనే కోటయ్య మల్లమ్మను పిలిచి "పట్నం చూడటానికి పరబ్రహ్మం రమ్మంటున్నాడు పోదామా?" అన్నాడు.

"నా మొహానికి అదొక్కటే తక్కువ. పేడ పిసుకుతూ కుడితిపోస్తూ ఈ పనులుచేసుకుంటూ బ్రతకడానికే నేను పుట్టాను" ఈ మాటలు కోటయ్యమీద ఇంకా బాగా పనిచేశాయి.

ఐదొందలు మూట కట్టుకొని కోటయ్య మల్లమ్మతోసహా హైదరాబాదుకు బయలుదేరాడు. కోటమ్మ కోపానికి పగ్గాలులేవు. తనను వాళ్ళు మాటమాత్రం రమ్మనక పోగా టింగురంగామంటూ విహారయాత్రలకు ఐదొందలతో బయలుదేరారు.

"మీపోకిళ్ళు నాకుగిట్టవు మీతిరుగుళ్ళేవో మీరేతిరగండి. ఆ పిల్లను కూడా పాడు చేయడమెందుకు రెండుపూటలా బడిమానుకోవడమెందుకు." అన్నది కోటమ్మ.

"నేనూ పోతానే." ఉషమారాంపెట్టింది.

"ఒద్దమ్మా నిన్ను మంగళగిరి తిరనాళ్ళకి పంపిస్తాను. గాజులు రిబ్బన్లు పీచుమిఠాయి, బొమ్మలు అన్ని కొనుక్కుందువు.

కోటమ్మ చూపిన ఆకర్షణలకు ఉష లొంగిపోయింది.

ఉషను వెళ్ళకుండా చేయడంలో కోటమ్మకు కొడుకు కోడలు పై పగదీర్చుకోవడం ప్రధాన లక్ష్యమని అనలేము. ఉషను వదలి కోటమ్మ ఒక్కరోజు కూడా ఉండలేదు. ఆచిన్న పిల్లలో ఈ ముసలి ప్రాణం అలాంటిఅనుబంధాన్ని పెంచుకున్నది. మొత్తానికి ఉషను వదిలి కోటయ్య మల్లమ్మలు మాత్రమే బస్తీకి వెళ్ళడానికి నిశ్చయమైంది. మల్లమ్మ ఈ వార్తను లక్ష్మికి వెళ్ళి చెప్పింది. లక్ష్మి ఎగిరి గంతేసింది.

"అక్కాయ్. అక్కాయ్ అదృష్టవంతురాలివే. హైదరాబాదుకు బదులు చెన్నపట్నమైతే ఇంకా బాగుండేది, పోనీలే, ఏదో ఒకటి. వచ్చిన ఛాన్సు పోగొట్టుకోకు."

"నామీద ప్రేమ ఉండీ ఏం తీసుకెళ్ళడంలేదు. ఆ పరబ్రహ్మంతో ఏడో పొగాకు బేరముండి బయలుదేరాడీ పెద్దమనిషి. ఏడో ఏడుస్తున్నానని నన్నూ రమ్మన్నాడు. అదీ సంగతి."

"ఎందుకక్కాయ్ బావనట్లా అడిపోసుకుంటావ్? అయన చాలా మంచివాడు సుమా."

"నీకంతా మంచివాళ్ళలాగే కనిపిస్తారు."

"ఎవరినైనా అనుగానీ, మా బావను మాత్రం అనకు. ఆయన దేవుడిలాంటివాడు." అంటూ లక్ష్మి లోపలినుంచి రెండు పుస్తకాలు తెచ్చింది. అందులో ఒకటి సినిమా బొమ్మల పుస్తకం. ఇంకోటి ఏదో నవల. లక్ష్మి మల్లమ్మకు సినిమా బొమ్మలన్నీ చూపి క్రింద పేర్లు చదివి చెప్పింది.

"ఆ నవలేమిటే?"

"బాగుందక్కాయ్. మంచి సెక్సు నవల."

"అదేమిటే?"

"ఒక పిల్ల, పిల్లవాడు ప్రేమించుకుంటారు. వాళ్ళ పెద్దవాళ్ళు పెళ్ళికి యిష్టపడరు. దాంతో వాళ్ళిద్దరూ లేచిపోవాలనుకుంటారు."

"ఊఁ తరువాత?"

"అంతే. ఇప్పటికి లేచిపోయేవరకు వచ్చానక్కాయ్."

మల్లమ్మ నవ్వి "ఎవరితోనే?" అన్నది.

"బుచ్చిబాబుతో,"

"అదేమిటే?" మల్లమ్మ నివ్వెరబోయి అడిగింది.

"ఔనక్కాయ్" అని లక్ష్మి జరిగింది చెప్పింది.

వాళ్ళమ్మతోటకు పోయి గోగాకు కాకర కాయలు తీసుకు రమ్మన్నది' లక్ష్మి సంచినిండా అకు కాయలూ కోసుకొని రెడ్డిగారి గడ్డి వాములవరకూ వచ్చింది. అక్కడంతా నిర్మానుష్యంగా ఉంది, అక్కడ బుచ్చిబాబు కూర్చొని సిగరెట్ కాలుస్తున్నాడు, లక్ష్మి వళ్ళు ఝల్లు మన్నది.

"ఏమిటా సంచి?" బుచ్చిబాబు మాటకలిపాడు.

"కూరగాయలు."

"ఎక్కడినుంచి తెస్తున్నావ్?"

"కనపడ్డంలే. మా తోటనుండి కోసుకొచ్చుకుంటున్నాను."

"ఒక్కతివే వెళ్ళినట్లున్నావ్ వెంట ఎవరూ లేరే?"

"ఏం బాడీ గార్డులు కావాలాఏమిటి? ఐనా నువ్వున్నావుగా?"

"నేనా?"

"ఆఁ అతీరాలా నువ్వే"

"అబ్బెబ్బే అలాంటిదేం లేదే?"

"ఎందుకు లేదు. తోటకు బయలుదేరానని తెలిసే నీవు కాపున్నావు."

"పోనీ అలాగే అనుకో. నీవంటే నా కెంత ఇష్టమో తెలిసిందిగా" అంటూ బుచ్చిబాబు దారికి అడ్డం నిలబడ్డాడు.

"అడ్డంలే. వెళ్ళనీ నన్ను. ఎవరైనా చూస్తారు."

"అంటే ఎవరైనా చూడకపోతే నీ కిష్టమే నన్నమాట" అంటూ బుచ్చిబాబు లక్ష్మిని గట్టిగా కౌగలించుకున్నాడు. బుచ్చిబాబు కౌగిలిలో లక్ష్మి నలిగిపోయింది. లక్ష్మి చర్మంలో బుచ్చిబాబు స్పర్శతో ఒక విద్యుత్ ప్రవహించింది. బుచ్చిబాబు గట్టిగా లక్ష్మి క్రింద పెదవిని కొరికాడు, పెదవిమీద గాటుపడింది. బుచ్చిబాబు లక్ష్మిని బలంగా తన గుండెలకు హత్తుకున్నాడు.

"వదులు నన్ను వదులు."

"అంటే నేను వదులుగా పట్టుకున్నానా" అంటూ ఇంకా బిగియారా కౌగిలించుకున్నాడు బుచ్చిబాబు.

లక్ష్మి ఎలాగో తప్పించుకొని కూరగాయల సంచీతో ఇంటికి చేరుకుంది. ఆ మరునాటినుంచి బుచ్చిబాబును చూడకూడదని అనుకుంది. కానీ ఆ ఆకర్షణకు లోబడిపోయింది. మరునాడు తల్లి వద్దన్నా సంచితో తానే తోటకు బయలుదేరింది,

"ఎందుకు బయలుదేరావు?" లక్ష్మిని మనసు ప్రశ్నించింది.

"ఎందుకా? ఈసారి బుచ్చిబాబు కనపడనీ బుద్ధిచెపుతాను."

"ఓసి అమాయకురాలా ఇవన్నీ నిన్ను నీవు మోసగించుకునేందుకు నీవే అనుకుంటున్న మాటలు."

"ఏం లేదు" అనుకుంటూ లక్ష్మి తోటవైపు సాగిపోయింది. వెళ్ళేటప్పుడు త్రోవలో రెడ్డిగారి గడ్డివాము అడ్డమొచ్చింది. ఆగడ్డి వామును చూచేసరికి లక్ష్మి గెండె ఝల్లుమన్నది. ఎక్కడైనా బుచ్చిబాబు దాక్కొని ఉంటాడేమోనని బెరుకు బెరుకుగా చూసింది అయితే బుచ్చిబాబు అక్కడలేడు. దాంతో లక్ష్మికి కొంచెంధైర్యం వచ్చింది. "కనపడనీ కడిగేస్తాను. తప్పించుకున్నాడు ఇవాళటికి" అనుకుంటూ ముందుకి సాగిపోయింది.

గడ్డివాము నుంచి దూరమౌతున్నకొద్దీ లక్ష్మి కాళ్ళలో నిరుత్సాహం వ్యాపించింది. ఆమెకు గోంగూర కోయాలనే కోరిక క్రమంగా తగ్గిపోయింది,

"ఏమ్ దొంగ మనస్సా తెలిసిందా. ఇప్పుడు నీ వెందుకు వచ్చావో" లక్ష్మిని, మనస్సు ఎత్తిపొడిచింది.

లక్ష్మి ముందుకు పోయి, కాసిని బెండకాయలు, కాకర కాయలు కోసుకుంది. నిరుత్సాహంగా అడుగులు వేసుకుంటూ తిరుగుముఖం పట్టింది.

"గడ్డివాము దగ్గర బుచ్చిబాబుంటే ఎంత బాగుంటుందో" అనుకుంది లక్ష్మి క్షణ కాలం, దాంతో లక్ష్మి గబగబా నడవ సాగింది. గడ్డివాము వచ్చింది. అయితే అక్కడ బుచ్చిబాబులేడు. లక్ష్మి నీరసంగా కూలబడిపోయింది. ఆమెకు క్రితం రోజు సంఘ టన గుర్తుకు వచ్చి వళ్ళు పులకరించింది. లక్ష్మి పరవశంతో అర మోడ్పు కన్నులతో ఆలోచనలో పడివుండగా వెనుకనుంచి ఎవరో వచ్చి కన్నులు మూశారు. లక్ష్మి త్రుళ్ళిపడింది.

"నేను రమ్మనట్లే వచ్చావే? కృతజ్ఞుడిని" అన్నాడు బుచ్చిబాబు.

"నీవా?" అన్నది లక్ష్మి.

"ఔను నేనే నీవు వస్తావని తెలిసి గడ్డివాము వెనుక కాచుకు కూర్చున్నాను.

"నేను వస్తానని నీకెలా తెలుసు?"

"ఆ మాత్రం తెలుసుకోలేకపోతె ఈ బుచ్చిబాబు ఎందుకు" అంటూ లక్ష్మిని కౌగలించుకున్నాడు.

బుచ్చిబాబు బిగికౌగిలిలో లక్ష్మి నలిగిపోయింది..........

మల్లమ్మ కింతవరకు చెప్పి లక్ష్మి పరవశంతో, ఉద్వేగంతో ఆగిపోయింది—మల్లమ్మ భుజాలపై రెండుచేతులూ వేసి,

"ఆ తరువాత?"

"ఆ తరువాత ఇంకేముందక్కాయ్. ఆయనకు నేను మనస్సు అర్పించాను. ఈ సినిమా పుస్తకాలు, సెక్సు నవలలు, స్నోలు, పౌడర్లు, హేర్ ఆయిల్ బాటిల్ అన్నీ ఆయనే ఇచ్చారు."

"లక్ష్మీ! నీవు అచ్చం సినిమా హీరోయిన్‌లా ఉన్నావు. నాతోపాటు మద్రాసు రా.... నిన్ను పెద్దతారను చేస్తాను అన్నాడు బుచ్చిబాబు."

మల్లమ్మ నిట్టూర్చి, "ఈ చాటుమాటు వ్యవహారమెందుకే. హాయిగా పెళ్ళిచేసుకోండి" అన్నది.

"వాళ్ళ నాన్న ఒప్పుకోడక్కాయ్. చండప్రచండుః . లేచి పోవటం తప్ప మార్గంలేదు" అన్నది లక్ష్మి.

మల్లమ్మ మనస్సు అదోలా ఐపోయింది.

కొంపదీసి ఈ పిచ్చిపిల్ల వాడితో పారిపోయేటట్లుంది. మల్లమ్మ లక్ష్మికి ఎన్నోవిధాల నచ్చచెప్ప జూచింది. కానీ లక్ష్మి పరలోకంలో ఉంది. మల్లమ్మ ఇంటికి వెళ్ళిపోయింది.

ఇంట్లో వంట చేస్తున్నది. పిల్లను సముదాయిస్తున్నది. ప్రయాణానికి బట్టలు సర్దుకుంటున్నది. కాని ఆమె మనసుమాత్రం లక్ష్మిని గురించే ఆలోచిస్తున్నది. ప్రయాణంరోజు దగ్గర పడ్డది. పరబ్రహ్మంతో మల్లమ్మ, కోటయ్య హైదరాబాదు బయలుదేరారు. బయల్దేరబోతూ తాను ఊరికి పోతున్నట్లు లక్ష్మికి చెప్పింది.

"లక్ష్మి నువు చాలా జాగ్రత్తగా ఉండాలి. తొందర పడ వద్దు. ఏ అఘాయిత్యం చేస్తావో అని నాకు అనుమానంగా ఉంది. నీవు నాకు జాగ్రత్తగా ఉంటానని మాటియ్యకపోతే మీ అమ్మకు చెపుతాను."

"అలా చేశావంటే నేను ఆత్మహత్య చేసుకుంటాను"

మల్లమ్మ మాట్లాడకుండా ఇంటికి వెళ్ళిపోయింది.

"వస్తూ నా కేమైనా బహుమతులు పట్టుకురావాలి." అంటూ లక్ష్మి కేకవేసింది.

"వచ్చేదాకా ఇది కర్లపాలెంలో ఉంటుందా?" అనుకుందిమల్లమ్మ.

# 4

పరబ్రహ్మం వెంట కోటయ్య మల్లమ్మ హైదరాబాదు వెళ్ళారు. హైదరాబాదు చాలా విశాలమైన నగరం. ఎటుచూసినా పదిమైళ్ళ పొడవుంటుంది. గోల్కొండ నవాబుల కాలంలో దీని వైభవం ఇంకా చాలా గొప్పగా ఉండేదిట. పోలీస్ యాక్షన్ తరువాత దీని స్వరూపం మారిపోయింది. కోటయ్య మల్లమ్మ ఒక మహానగరాన్ని చూడటంఇదేమొదలు. ముగ్గురు నాంపల్లి స్టేషన్‌లో దిగగానే పరబ్రహ్మం రెండు రిక్షాలు మాట్లాడాడు.

"ఏమిటీ సవారీ అంటున్నావు?"అనడిగింది మల్లమ్మ.

"సవారీ మనిషి బండి నెక్కటం" అన్నాడు పరబ్రహ్మం.

"అదేమిటి ఏడుకట్ల సవారీఅంటే చచ్చినవాడిని మోసుకొని పోవటం అని మా ఊళ్ళో అర్థం. మీ బస్తీలో బ్రతికున్నవాళ్ళకు కూడా సవారీ కడతారన్నమాట" అన్నాడు కోటయ్య.

"ఏమయ్యా మనం పెద్ద పట్నానికి వచ్చాము ఇక్కడ ఎట్లా బడితే అట్లా మాట్లాడకూడదట నాకు లక్ష్మి చెప్పింది."అన్నది మల్లమ్మ.

"నిజమా? మాట్లాడకూడదా?" అని అడిగాడు కోటయ్య.

ఔను మాట్లాడకూడదు"అన్నాడు చిరునవ్వుతో పరబ్రహ్మం.

"బస్తీలలో పక్కవాడితో మాట్లాడితే అమర్యాద పక్కవాటాలో కిరాయికున్నవాళ్ళంఇంట్లో ఎవరైనా చచ్చినాసరే ఇవతలి వాటావాళ్ళు కన్నెత్తి చూడరు. దారి తప్పి ఇంటినెంబరడిగితే ఎవ్వడూ చెప్పడు. తీరా వెతికితే మనం అడిగినవాడి ఇంటిపక్కనే వుంటుంది" అన్నాడు పరబ్రహ్మం.

"ఇదేం ఊరా? అడవా? మా ఊళ్ళో కోటయ్యగారి ఇల్లెక్కడ అంటే రచ్చబండదగ్గరినుంచి కుక్కకూడా దారి చూపిస్తుంది." "ఏమయ్యా ఇది బస్తీ ఇక్కడ కుక్కలు నక్కలు అనకూడదు" అన్నది మల్లమ్మ.

రాక రాక వచ్చినందుకు పరబ్రహ్మం మల్లమ్మకు కోటయ్యకు మంచి మర్యాదలు చేశాడు. పరబ్రహ్మం భార్య అలివేలు మంగ రుచికరమైన వంటకాలు వండిపెట్టింది.

"ఎట్లా వుంది వదినా మా బస్తీ జీవితం?" అని అడిగింది అలివేలు మంగ.

"ఇదేమిటమ్మా మీ ఇంట్లో గాలే రావటంలేదు" అన్నాడు కోటయ్య.

"ఇంకా సంతోషించు అన్నయ్యా, ఇల్లు దొరికింది. చాలా మంది బస్తీలలో రోడ్ల మీదే కాపురాలు చేస్తుంటారు."

"మరి వాళ్ళకి గాలీ వెలుతురు, ఇల్లూ ఏం ఉండవా?"

"ఉండవ్. రోడ్డుమీదఉండేవాడికి సూర్యచంద్రులే దీపాలు. గదులు దొరికితే అవి అక్కరలేదు."

"మరెందుకయ్యా జనం బస్తీకి వస్తారు? గాలీ, నీరూ, వెలుతురు అన్నీ పోగొట్టుకుని పనిలేకనా?"

"ఔనన్నయ్యా, పని ఎగగొడదామనే. మీ పల్లెలో చూడు, పేడ పిసుక్కుంటూ వదినె జీవితమంతా గడుపుతూ ఉంటుంది. ఆమెకు ముక్తీలేదు, మోక్షంలేదు. నీ సంగతే చూసుకో-తెల్లవారు జామున కోడికూతకుముందు లేస్తావు. రాత్రి పదిదాకా రెక్కలు ముక్కలు చేసుకుంటావు. అయినా ఏమిటి ప్రయోజనం. గొర్రె తోక బెత్తెడే అన్నట్టు ఉంటుంది నీ జీవితం. బస్తీలో చూడు-వీళ్ళు పనిచేయరు. ఆఫీసులకు పోతారు. పానులు నములుతారు. చాయ్ తాగుతారు. కబుర్లు చెపుతారు. పైరవీలు చేస్తారు, పైసలు సంపాదించుకుంటారు."

"ఈ పైరవీ అంటే ఏమిటి?"

వివరించింది అలివేలు మంగ. ఎలా కాగితాలు కదిలించాలో, ఎలా అధికారులను పట్టాలో, ఎలా బల్లల క్రింద చేతులు పెట్టాలో, బల్లలమీద బరువులు ఎలా పెట్టాలో నేర్పే శాస్త్రంపేరే పైరవీ విద్య. బస్తీలో వాళ్ళకి ఈ విద్య మాత్రమే వచ్చు బాగా."

దీని అవ్వ ఇదీ ఒక విద్యేనా? మనుషులను మోసగించడం కూడా ఓ విద్యేనా? మనిషి నోరుకొట్టి మనిషి బ్రతకడం మానవత్వమనిపించుకుంటుందా? మా పొలంలో పంటలు తిని ఎలుకలు. ఎలుకలు తిని పాములు, పాములు తిని ముంగిసలు బ్రతుకుతుంటాయి. అవి జంతువులు. జంతువులు చేయవలసిన పని అది"

"అయ్యో అయ్యో అట్లా అనవాకయ్యా. ఇక్కడంతా పెద్ద పెద్ద ఆఫీసర్లుంటారు. మనం నోరు పారేసుకో కూడదు"

"ఆఫీసర్లా వీళ్ళేంచేస్తారు ?" కోటయ్య అడిగాడు.

"వీళ్ళంతా ప్లానింగ్ వేస్తారు"

"ఏం ప్లానింగు ?"

"దేశాన్ని ఎలా వుద్ధరించాలి అన్న ప్లానింగ్. ప్రణాళికలు, డాములు, నిర్మాణాలు అన్నీ వీళ్ళ మేధాశక్తిని ఉపయోగించి సాధిస్తారు"

"ఏం ప్రణాళికలయ్యా, మా ఊరికి రోడ్డులేదు. కరెంటు లేదు. బస్సులేదు. పోస్టాఫీసు లేదు. మనుషుల ఆస్పత్రి లేదు. పశువుల అస్పత్రిలేదు. మంచి బడికూడా లేదు. బందెల దొడ్డిలాంటి ఓ వీధి బడి తప్ప"

"కనీసం ఓ టూరింగు టాకీసన్నాలేదు" అన్నది మల్లమ్మ.

"మీ ఊళ్ళో లేకపోతేనేం అవన్నీ మా ఊళ్ళో వున్నాయిగా దేశాభివృద్ధి అంటే బస్తీల అభివృద్ధి అని అర్థం. ఆర్థిక ప్రగతి అంటే పదవులలో వున్నవాళ్ళు వాళ్ళ బావమరుదులు వాళ్ళ కొడుకులు మేడలు కట్టుకోవడం అని అర్థం. అందుకే జనం పల్లెలు వదిలి బస్తీలకు పారిపోతున్నారు" అని వివరించాడు పరబ్రహ్మం. కోటయ్య గుడ్లప్పగించి వింటున్నాడు.

"సరేలే ఈ బస్తీముచ్చట్లకేం సంవత్సరాలు చెప్పుకున్నా తరగవు. ఊరు చూద్దాం పదండి" అన్నది అలివేలుమంగ.

చిక్కడపల్లినుంచి అంతా రోడ్డుమీదికివచ్చారు. "కాఫీ తాగి యాత్ర మొదలుపెడదాం" అన్నది అలివేలుమంగ.

"నాకు చద్ది అన్నం తినే అలవాటు. ఆవకాయ ముక్క, ఊరిన మిరపకాయలు వేసుకొని పొద్దున్నే తరువాణీ అన్నంతింటే తప్ప నాకు పనిచెయ్య బుద్ధిపుట్టదు" అన్నాడు కోటయ్య.

"నువ్వూ నీ పల్లెటూరిబుద్ధులు. ఇక్కడ అలాంటి మాటలు మాట్లాడకూడదు. అంతా ఆఫీసర్లుంటారు" అన్నది మల్లమ్మ.

"ఏమాఫీసర్లే ఇక్కడ ఒక్కడి మొహంలోనూ కళ లేదు. అంతా ఎండిపోయిన జొన్నరొట్టెలాగా మొహాలేసుకొని ఉన్నారు. నేనుచూడు ఎట్లా ఉన్నానో" అని బబ్బచరిచాడు కోటయ్య.

T. S. ఎ. కృష్ణ.

"ఇదిగో బావా బస్తీలలో ఇలా జబ్బ చరచకూడదు. రోడ్డు మీది వాళ్ళు 'ఈయనెవరో కోస్తాజిల్లానుంచి పహిల్వానువచ్చాడు' అనుకుంటారు. మీ బలంముందు మే మెంత. భీమడిముందు అప్ప డాలలాగా" అన్నాడు పరబ్రహ్మం.

"ఆ మా వాళ్ళు అట్లాగే ఏడుస్తున్నారు లేవయ్యా సద్ది కూడుమాని కాఫీలు మొదలు పెట్టారు. ఇంక సత్తువ ఎక్కడి నుంచి వస్తుంది" అన్నాడు కోటయ్య.

అంతా ఒక హోటల్‌కి పోయారు.

పరబ్రహ్మం ఇడ్లీలకి ఆర్డర్ ఇచ్చాడు. ఇడ్లీలు వచ్చాయి. అలివేలుమంగ చిన్నచిన్న ముక్కలుచేసి ఇడ్లీలను చట్నీలోనంచు కుంటూ తింటున్నది. కోటయ్య ఇడ్లీని సాంబారులోముంచి అమాం తంగా నోటిలో పెట్టుకున్నాడు. అది ఒక పంటిక్రిందకి రాలేదు.

"బస్తీలో ఇట్లా తినకూడదయ్యా. అంతా ఎగతాళిచేస్తారు" అన్నది మల్లమ్మ.

"ఇదేమిటే ఈ రెండు ఇడ్డెన్లు కలిసికూడా ఓ ఆవకాయ ముద్దంతలేవు" అన్నాడు కోటయ్య.

"అలా తినటం ఇక్కడ ఫ్యాషన్‌కాదు" అన్నది అలివేలు మంగ నవ్వుతూ.

"ఈ ఫ్యాషన్ అనేదేదో బలహీనులకోసం పుట్టినట్టుంది" అన్నాడు కోటయ్య.

సర్వరు నాలుగు మసాలాదోశలు తెచ్చాడు. అందులో స్పూన్లు ఫోర్కులు ఉన్నాయి.

"ఈ కత్తులు కటార్లు ఎందుకంట?" అడిగాడు కోటయ్య.

"దోశ కోసుకొని తినటానికి"

"తుమ్మమొద్దును రంపంతో కోసినట్లు కొయ్యాలా ఏమిటి ఈ దోశను? అంత గట్టిగా వండుతారా?"

"లేదయ్యా అది ఫ్యాషను అట్లా అడగకూడదు."

"దీనమ్మ ఇదేం ఫ్యాషన్‌రోయ్ ముళ్ళకత్తులు గొంతులో గుచ్చుకుంటే పేగులు బయటికివచ్చి ఫ్యాషన్ గీషన్ తెలుస్తుంది. చేతితో వంటకాలు తాకితే చస్తాడుకాబట్టి ఆ తెల్లవాడు ఈ కత్తులు

కలార్లు కనిపెట్టాడు. వాడిలాగా కత్తులు పెట్టుకొని టేబిలుమీద తినడమేనా ఫ్యాషన్."

"బావా బస్తీలో అట్లా అనకూడదు. ఈ మాటలు వింటే ఫో ఫోవోయ్ పల్లెటూరి బైతు, ఆవకాయ డొక్కు" అంటారు వీళ్ళు."

"ఔనులే, ఎవడి పిచ్చి వాడికి ఆనందం" అంటూ కోటయ్య దోశెను రెండుముక్కలు చేసి మడిచి నోట్లో పెట్టుకున్నాడు. కోటయ్య సంగతి ముందేతెలిసి పరబ్రహ్మం మరో రెండు దోశెలు ముందే తెప్పించాడు.

అంతా బస్ స్టాండుకు వచ్చారు. "మన మిప్పుడు చార్మినార్, సాలార్‌జంగ్ మ్యూజియం చూసేందుకు వెళదాం"అన్నాడు పరబ్రహ్మం.

కాసేపటికి బస్సు వచ్చింది. అది స్టాపువద్ద ఆగకుండా ముందుకుపోయి ఆగింది. స్టాపులో నిలబడ్డవాళ్ళు బస్సువెనక పరిగెత్తారు. వీళ్ళు బస్సు దగ్గరికి చేరేసరికి బస్సు వెళ్ళిపోయింది. వాళ్ళు మళ్ళీ బస్‌స్టాప్ చేరారు.

"ఇదేమిటి బస్సు ఆగలేదు?" అన్నాడు కోటయ్య.

"ఈ ఊళ్ళో ఇంతే బావా. నగరాలన్నింటిలోనూ అంతే. బస్సులు మనుషులతో పరుగెత్తే ఆట ఆడుకుంటాయి. అందీ అందకుండా జారిపోతుంటాయి. అయితే ఇదీ ఒకందుకులాభమే. మీపల్లెల్లోలాగా ఇక్కడ కష్టించి చేయవలసిన పనేమీ ఉండదు. కనీసం ఇలా బస్సుల వెనకైనా పరుగెత్తుతూఉంటే కాస్త ఎక్సర్‌సైజు. రక్తశుద్ధి బి. పి. తగ్గుతుంది."

ఇంతలో ఫుల్‌సూటు మీద ఒకాయన పరబ్రహ్మం దగ్గరికి వచ్చాడు. ఇంగ్లీషులో ఏదో టక టక మాట్లాడాడు. పరబ్రహ్మం ఏదో సమాధానం చెప్పాడు. సూటువాలా వినలేదు. పరబ్రహ్మం జేబులోంచి రూపాయి తీసి ఇచ్చాడు. దానిని సూటువాలా పరబ్రహ్మం మొహాన గిరాటువేసి వెళ్ళిపోయాడు. చూస్తున్నవాళ్ళంతా బస్‌స్టాపులో నవ్వారు.

"ఈయనెవరు?"

"బావా మీ పల్లెల్లో బుడబుక్కలవాళ్ళు కోతులని ఆడించు

కునేవాళ్ళు గంగిరెద్దులవాళ్ళు రంగు రంగుల గుడ్డలు వేసుకొని అడుక్కోడానికి వస్తూంటారు చూచావా, అట్లాగే ఈ బస్తీలలో సూటు బూటు వేసుకొని టెర్లిన్ గుడ్డలతో అడుక్కోటానికి వస్తూంటారు. "నేను బొంబాయి పోతున్నాను, పర్సు ఎవడో కొట్టేశాడు టిక్కెట్టుకు యాభై తక్కువైంది తలా పది ఇవ్వండి" అంటూ వస్తాడు. ఇప్పుడొచ్చిన పెద్దమనిషి ఏదో పెద్ద ఆఫీసర్‌ట పెట్రోలుకు డబ్బులేక కారు బాకారాంలో ఆగిపోయిందట.ఎవరైనా పదిరూపాయలిస్తే పెట్రోలు పోయించుకొని కారు నడుపుకుంటూ వచ్చి మన పదిరూపాయలూ తీర్చి వెళతానన్నాడు.

"పాపం ఎంత పెద్ద ఆఫీసరో ఏమో."

"ఆఫీసరు గాదు, గాడిద గుడ్డూ కాదు. ఇదంతా కూడా అడుక్కోవడంలో భాగమే. నేను రూపాయి ఇచ్చాను. విసిరి ముఖాన కొట్టాడు"

"అయ్యో నలుగురిలో అవమానం. జనం నవ్వారు"

"నవ్వినా నా కొడుకెవడూ చిల్లుకాని ఇవ్వడు. ఈ బస్తీ మొహాలకు చేతనైంది బస్ స్టాపులలో నవ్వడమే."

"అదేమిటయ్యా తిడుతున్నావు? వాళ్ళకు కోపం వస్తుంది"

"మీ పల్లెటూళ్ళోళ్ళలాగా మా వాళ్ళకు తేలికగా కోపంవచ్చి తన్నుకోరు. సాచి లెంపకాయకొట్టి 'సారీ' అంటే'దట్సాల్ రైట్' అంటాడు. అయితే ఎక్కడో పరోక్షంగా దెబ్బకొడతాడు. మావి అన్నీ తేనె పూసిన కత్తులు. ఇంతలో మరో బస్సు వచ్చింది. అది ఎక్కి చార్మినార్ వైపు బయలుదేరారు.

"చూచావుటయ్యా, ఆమె ఎవరో సెంటు రాసుకుంటే బస్సంతా ఘుమ ఘుమ లాడుతున్నది. నీవెన్నడన్నా నాకు ఓ అత్తరు సీసా కొనిచ్చిన పాపాన పోయినావా?" అన్నదిమల్లమ్మ.

అది విని పరబ్రహ్మం నవ్వి, "ఈ ఊళ్ళో మనుషులు స్నానాలు చేయరు. అందుకని సెంటు రాసుకుంటారు" అన్నాడు. బస్సు దిగి చార్మినారు, సాలార్‌జంగ్ మ్యూజియం, నయాపూల్, ఉస్మానియా జనరల్ హాస్పిటల్ చూచారు. చార్మినార్ దగ్గర మంగళగిరికి చెందిన గోపయ్య కనపడ్డాడు. గోపయ్య కోటయ్యకు బాగా తెలుసు.

"ఏయ్ గోపయ్యా ఏహేయ్ గోపయ్యా, ఇదిగో ఇటు ఇటు నేను-కోటయ్యను"

గోపయ్య కోటయ్యను చూసి సంతోషంగా దగ్గరికివచ్చాడు. గోపయ్య వేషం కూడా మారిపోయింది. పూర్వం ఖద్దరుపంచె కట్టుకొని అరచేతుల చొక్కా వేసుకునేవాడు. ఇప్పుడు ప్యాంటు టెర్లిన్ షర్టు తొడిగాడు. గోపయ్య వేషం మల్లమ్మకు బాగా నచ్చింది. గోపయ్య స్థానంలో కోటయ్యను ఊహించుకొని గోపయ్య గుడ్డలు కోటయ్య వేసుకుంటే ఎలా వుంటాడో మనో నేత్రంతో బొమ్మ గీచుకుంది.

"దా - దా. చాయ్ తాగుదాం" అన్నాడు గోపయ్య.

"వద్దు మేమింకా చూడవలసినవి చాలా వున్నాయ్ నువ్వేం చేస్తున్నావిక్కడ ?"

"కమిషన్ వ్యాపారం. చాలా తేలికైనపని. గదిలో కూర్చొని ఫోనుమీదనే సరుకులు బుక్‌చేస్తాం. ఫోన్‌మీదనే మళ్ళీ అమ్మేస్తాం. గదిలోంచి కదిలే పనిలేదు. లక్షలమీద బిజినెస్."

"మరి పొలాలో ?" కోటయ్య అడిగాడు.

"మంగళగిరి, పెనుమాక పొలాలు అమ్మేశాను. చిన్నోణ్ణి కూడా ఇక్కడే చదువులో చేర్పించాను. పంజాగుట్టలో ఇల్లు కట్టు కున్నాను." అన్నాడు గోపయ్య.

"ఎంతపనిచేశావు గోపయ్యా. నీవు బస్తీకిచేరావు నీ కొడు కును బళ్ళోకి తోలావు గొడ్డుపోయిన మేకను కసాయివాడు కబే ళాకు తోలితే నీవు పంటపొలాలనే అమ్మేశావు. పాపం ఆ పొలాలు నోరుతెరచి 'గోపయ్యా' అని నిన్ను పిలుస్తూవుంటాయి. పొలాలు పగిలి పడిన నెర్రెలు ఏమిటనుకున్నావ్ ? భూమాత నోరు తెరచి నీలాంటి వాళ్ళను పిలుస్తున్నదని అర్థం, హాయిగా పంటచేలలో పాలపిట్టలా తిరిగే పిల్లగాడిని చదువుపేర పలకా పుస్తకాలతో నాలుగు గోడలమధ్యా బంధించివేశావు గోపయ్యా. అంతా భూ మాతను వదిలి బస్తీలకు పారిపోతే ఆమె గతేంకావాలి ?"

కోటయ్య మాటలు విని పరబ్రహ్మం నివ్వెరపోయాడు.
"అరెరే కవిత్వం చెప్పావు కోటయ్యబావా" అన్నాడు.

"అంటే ఏమిటి ?"

"అదే కవులు వర్ణిస్తారుచూడు నువు ఇంద్రుడివి చంద్రుడివి అని రాస్తుంటారే అది."

కోటయ్య మామూలుగా అన్నమాటలకు గోపయ్య షాక్ తిన్నాడు. తానేదో తప్పు చేసినట్లు ఫీలయ్యాడు.

"వస్తాను కోటయ్యా. ఇంకా చాలా విశేషాలున్నాయి చూడు" అంటూ జారుకున్నాడు గోపయ్య.

నలుగురూ కలిసి సాయంత్రానికి పబ్లిక్‌గార్డెన్స్ చేరుకున్నారు. మధ్యాన్నం తిన్న తిండి కోటయ్యకు బొత్తిగా నచ్చలేదు. ఒక ప్లేటుతో పలావు, ఇంకో ప్లేటుతో కుర్మా చార్మినార్ దగ్గర తిన్నాడు. బస్తీలలో హోటళ్ళలో మంచి తిండి, మంచి నెయ్యి దొరకడం కష్టమని పరబ్రహ్మం చెప్పాడు.

"మంచి గాలిలేక, వెలుతురులేక, ఇల్లులేక, నీళ్ళలేక, తిండిలేక, నెయ్యిలేక ఏం బావుకుందామని పల్లెపట్టును వదులుకుని ఈ బస్తీలకు ఎగబడ్డారు చిలకపిట్టలు" అన్నాడు కోటయ్య. పరబ్రహ్మం కాసేపు ఏం సమాధానం చెప్పాలో ఆలోచించాడు. మల్లమ్మ అందుకొని,

"చాల్లేవయ్యా - నువ్వూ, నీ పాతకాలపు బుద్ధులూనూ, పల్లెల్లో చస్తే గొంతులోకి మందుపోసే దిక్కులేదు. మహా ఐతే మంగళగిరిలో పశువులకు, మనుషులకూ ఒకే డాక్టరు. బస్తీలలో అన్నీ అందుబాటులో ఉంటాయి. సన్నకారు జనానికి చేతినిండా పనులు దొరుకుతాయి. బస్తీ జీవితం చాలా బాగుంటుందయ్యా" అన్నది.

"బస్తీలకు పరుగెత్తి పాలు త్రాగేకన్నా - పల్లెల్లో నిలబడి నీరు త్రాగడం మంచిది. బస్తీలో ఉద్యోగంచేస్తే నెలకు వంద రూపాయలు రావచ్చు. కానీ మనిషి రూపాయి బిళ్ళలు నమిలి తింటాడా? ఇక్కడ ముళ్ళకత్తులతో తిన్న దోశెలు, చార్మినార్ దగ్గర తిన్న పలావ్ కూర్మాలు అన్నీ కలిపి మా యింట్లో గోంగూర పచ్చడి కొరివి కారంతో తిన్న ఒక్కముద్ద విలువ చేయవయ్యా. ఆ గుత్తి వంకాయ కూరలు, గేదె పెరుగులు గుమ్మపాలు, జున్ను జున్ను మీగడలు, ఆవు నెయ్యి మీ బస్తీలో కలల్లోకూడా రావు."

పరబ్రహ్మం అది విని, "ఇదిగో కోటయ్య బావా, పల్లె

గొప్పదా పట్నం గొప్పదా అని ఎవరైనా పోటీపెడితే నీ కందులో ఫస్టు ప్రైజ్ వచ్చేటట్లుంది. దేని కష్టసుఖాలు దానికున్నాయి పద. ఈ పబ్లిక్ గార్డెన్స్‌లో రకరకాల జంతువులుంటాయి చూద్దాం" అంటూ జనాన్ని మెల్లగా లోపలికి కదిలించాడు.

అంతా పరబ్రహ్మం వెంట లోపలికి వెళ్ళారు.

మెట్ట తామరలు, నీటితామరలు, ఎత్తైనవృక్షాలు ఏనుగులు పంచరంగుల చిలకలు నెమళ్ళతో కూడుకొని పబ్లిక్ గార్డెన్స్ ఎంతో ఆహ్లాదకరంగా వుంది. పగలంతా పీరువడ్డ శ్రమను క్షణంలో మరిపించి వేసింది. కోటయ్యకూడా కాసేపు పేద దీర్చుకున్నాడు. అంతా కాఫీలు తాగి పల్లీలు కొనుక్కొని తిన్నారు. కోటయ్యే డబ్బులిచ్చాడు. పరబ్రహ్మం పంతొమ్మిదొందల నలభై ఎనిమిది ఉద్యమాన్ని గూర్చి పోలీసు చర్యగూర్చి కథచెప్పినట్లు చెప్పాడు.

"ఇక్కడ హాలీ, కల్దార్ అని డబ్బు వుండేది. ఈ నిజాం నాణాలతో మన నాణాలకు మారకం చేసేవారు...." అని అనాటి చరిత్రనంతా వివరించాడు.

మల్లమ్మ కోటయ్య ఒక తామరకొలను దగ్గరికి వెళ్ళి బాతులను చూస్తున్నారు.

"ఏమయ్యా నాదో కోరిక ఉంది తీరుస్తావా?"

"కోరుకో మహతల్లీ కానీ సీతరాముడిని కోరినట్లు దొరకని బంగారు లేడిని మాత్రం కోరకు"

"చాల్లేవయ్యా నువ్వెప్పుడూ ముందరికాళ్ళకు బంధాలు వేస్తావు. నేను చెప్పేది శ్రద్ధగా విను. ఏదో ఉబుసుపోకకు చెబుతున్నానని అనుకోవద్దు. నీ కెటుదిరిగీ చదువు లేదు నాకు సరేసరి. కనీసం ఉషనైనా బస్తీలో పెట్టి మంచిగా చదువూ సంస్కారమూ నేర్పిద్దామయ్యా"

"చాల్చాలు పోవే నువ్వూ నీ గొంతెమ్మ కోరికలు మన ఊళ్ళో దాని సంస్కారానికి ఏం తక్కువే. సంక్రాంతి పండగొస్తే దాని ఉషారు చూడు. ముంగిలంతా ముగ్గుపెట్టి, ముగ్గులో గొబ్బెమ్మలు పెట్టి గుమ్మడి పూలతో వాటిని అలంకరించి రేగిపళ్ళు కలకండ నైవేద్యం పెడుతుంటే ఊరు ఊరూ కోటయ్యగారి ఇంటిముందు వేసిన రథం ముగ్గును చూడటానికి పొర్లబడు

తున్నారే: అంతకంటే, ఇంకేం కావాలే? ఇదంతా సంస్కారం కాదా?"

"నా మొహం సంస్కారం పేక ముద్దలు చేయటం కూడా సంస్కారమేనా? ఆటా పాటా, అల్లికా కుట్టు చదువు డిగ్రీ, ఇవన్నీ కావాలి ఉషకి. నువ్వేం చేస్తావో చేసుకో- నేను కర్లపాలెం పోగానే ఉషను తీసుకొని చెన్నపట్నం పోతున్నాను."

"ఎందుకే ఇద్దరూ కలిసి సినిమాలలో చేరతారా. రాజ కుమారి వెనుక పళ్ళాలు పట్టుకునే వేషం నువ్వెయ్యి. పనిమనిషి వేషం అదేస్తుంది. సరిపోతుంది."

మల్లమ్మకు బాగా కోపం వచ్చింది. ఆమె కళ్ళు ఎర్రబడ్డాయి. "పొలాల్లో జింకు ఫాస్ఫేటు బిళ్ళలతో ఎలుకలను చంపుకుంటూ కూర్చునే నీకు ఇంతకంటే మంచి ఆలోచనలు ఎట్లావస్తాయి. నువ్వేంచేసుకుంటావో చేసుకో నేనుమాత్రం ఉషను బస్తీకి తీసుకుపోతున్నాను."

"బంగారు జింక" బంగారు జింకా" అన్నాడు కోటయ్య'

"అంటే ఏమిటి? నేనట్లా కోరరాని కోరిక కోరుతున్నానా?"

నీ ఇష్టం వచ్చినట్లు అనుకో నాకేం ఫరవాలేదు. నేను మాత్రం ఉషను కాన్వెంటులో చేర్పిస్తున్నాను. నిన్ను రమ్మని నేనేం అడగడంలేదు. ఎండ్రిను మలాథియాను గొర్రెపెంట నత్రజని అనుకుంటూ పాముల్ని, ఎలుకల్ని, కప్పల్ని చంపుకుంటూ నువ్వా పొలంలోనే కూర్చో. నేను బస్తీలో కాపురం పెడుతున్నాను. కట్టుకుపోయేంత డబ్బుంది. కాస్త అనుభవించాలని నేననుకోవడంలో తప్పేంలేదుగా?"

కోటయ్యకి ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. మల్లమ్మకిబాగా బస్తీ మోజు తలకెక్కిందని గ్రహించాడు.

"ఏమయ్యా ఏం మాట్లాడవు, బెల్లంకొట్టిన రాయిలాగా కూర్చున్నావు?

"చూడు మల్లమ్మా మనం ఊరుగాని ఊరు వచ్చాం. అవతల బంధువులున్నారు. కొత్త చోట దెబ్బలాడుకుంటే గౌరవంగా ఉండదు. బస్తీలో చూడవలసిన విశేషాలన్నీ సరదాగా చూసి

ఇంటికి పద. ఇల్లూ పొలమూ ముసలమ్మా మన సమస్యలన్నీ మనం తీరిగ్గా కర్లపాలెంలో ఆలోచించుకోవచ్చు"

మల్లమ్మ రుసరుసలాడింది. అలివేలుమంగ, పరబ్రహ్మం వచ్చేసరికి గత్యంతరంలేక సంభాషణ ఆపివేసింది. ఆ రాత్రి మల్లమ్మకి బాగా తలనొప్పి పట్టుకుంది. టాబ్లెట్లు మింగి, అమృతాంజనం పట్టించినా తగ్గలేదు. అలివేలుమంగ మల్లమ్మకు ఒక నిద్ర మాత్ర ఇచ్చింది.

# 5

బహుమతులతో కోటయ్యా, మల్లమ్మ తిరిగి వచ్చారు. మల్లమ్మ ఇంటికి కూడా పోకుండా దోవలోనే బహుమతులతో లక్ష్మి ఇంటి దగ్గర దిగింది.

"అత్తా! లక్ష్మి ఏం చేస్తున్నది?" అంటూ మల్లమ్మ లోపలికి వెళ్ళింది. సీతమ్మత్త ఇంట్లో ఉన్నట్లులేదు. ఇల్లంతా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా ఉంది. మల్లమ్మ నేరుగా దొడ్లోకి వెళ్ళి చూచి ఎవ్వరూ కనపడకపోయేసరికి వెనక్కి తిరిగింది. ఇంతలో పడక గదిలోనుంచి సన్నగా మూలుగు వినిపించింది. మల్లమ్మ పడక గదివద్దకు వెళ్ళి చూచింది. అక్కడ ఎవరో ముసుగు పెట్టుకొని పడుకొని వున్నారు.

ఏం లక్ష్మీ వంట్లో బాగా లేదా?" అంటూ లోపలికి పోయింది.

కానీ మంచంమీద వున్నది లక్ష్మి కాదు. సీతమ్మత్త. మల్లమ్మ గొంతు వినిపించగానే సీతమ్మత్త ముసుగుతీసి మల్లమ్మ వైపు చూచి ఒక్కసారి భోరున ఏడ్చింది.

"ఏమిటి సీతమ్మత్తా ఏమైంది?" మల్లమ్మ అదుర్దాగా ప్రశ్నించింది.

సీతమ్మత్త మల్లమ్మను గట్టిగా కౌగిలించుకుంది.

"ఏమిటత్తా ఏమైంది?"

"అమ్మా- లక్ష్మి...."

"ఆఁ లక్ష్మి?"

"సీతమ్మత్త చేతులు రెండు వెల్లికిలా ఊపుతూ మళ్ళీ ఏడ్చింది.

"లక్ష్మికి ఏమైంది ? అదుర్దాగా మల్లమ్మ ప్రశ్నించింది.

"లక్ష్మి పోయిందమ్మా" డగ్గుత్తుకతో సీతమ్మత్త అంది.

మల్లమ్మకు కాళ్ళు చల్లబడ్డాయి.

"అయ్యో అయ్యో ఏమైపోయింది? ఎంత దుర్వార్త?"

సీతమ్మ యేడుస్తున్నది.

"బస్తీనుంచి బహుమతులు కూడా తీసుకొని వచ్చాను. యేమైందత్తా లక్ష్మికి ? యెట్లా పోయింది ?"

"ఎట్లాగేముందమ్మా రైలెక్కి పోయింది.... లేచిపోయింది"

మల్లమ్మ నివ్వెరపోయింది. సంగతేమిటో అర్థమైంది.

లక్ష్మి బ్రతికే ఉందని తెలిసి మల్లమ్మకు కొంచెం ధైర్యం వచ్చింది. ఇక మిగిలిన విషయాలు సీతమ్మనడగడం ఇష్టంలేక ఆ ఇంట్లోనుంచి బయటికి నడిచింది. ఇంటికి వెళ్ళేసరికి కోటయ్య ఉషకు, కోటమ్మకు, తెచ్చిన బహుమతులు ఇచ్చి వాళ్ళతో ముచ్చటిస్తున్నాడు. మల్లమ్మ ఇంటికి వచ్చి మంచం మీదపడింది. ఆ:దటం, పడటం ఓ నాలుగు రోజులు విశ్రాంతి తీసుకుంటే తప్ప బడలిక తీరలేదు. ఈ లోపల క్రమంగా అన్ని విషయాలు తెలిశాయి.

లక్ష్మి ఉన్నట్టుండి ఒక రాత్రి మాయమైంది మర్నాడు వుదయం లక్ష్మి కనిపించకపోయే సరికి అంతా పొలాలు, గట్లు వెతికారు. చెరువులు బావులు చూచారు. ఫలితం లేక పోయింది. ఒకటి రెండు రోజులయ్యేసరికి బుచ్చిబాబు లక్ష్మిని ఎక్కడికో లేవదీసుకొని పోయాడన్న పుకారు ఊరంతా వ్యాపించింది. ఒకడు లక్ష్మి బుచ్చిబాబులను మంగళగిరిలో కాఫీ హోటల్లో చూశానని చెప్పాడు. ఇంకొకడు వాళ్ళిద్దరూ విజయవాడ రైల్వే స్టేషన్‌లో కనబడ్డారని చెప్పాడు. అంతే సీతమ్మత్త స్పృహ తప్పి పడిపోయింది. నలుగురూపట్టి మంచం ఎక్కించారు. అంతే మళ్ళీ మంచం దిగలేదు. మల్లమ్మ ఈ కబుర్లన్నీ విన్నది. మల్లమ్మ మనస్సుఅదోలాఅయిపోయింది. లక్ష్మితనుకలిసిఅనుకున్న మాటలు, ఆడుకున్న ఆట:పాడుకున్నపాటలుఒక్కొక్కటేగుర్తుకు రాసాగాయి. తాను హైదరాబాదు వెళ్ళటానికి ముందు లక్ష్మి ఓ

నవలలో కథ చెప్పింది, "ఎంతవరకు వచ్చింది?" అని అంటే "లేచి పోయే వరకు" అన్నది లక్ష్మి. లక్ష్మికి నిజంగా ఎంత సాహసం మల్లమ్మ అలా ఆలోచిస్తూ కొన్నాళ్ళు గడిపింది. కోటయ్యమాత్రం ఇవేవీ పట్టించుకోలేదు. తను తన పొలం పనులలో లీనమైపోయినాడు. నిత్యానందం దగ్గర ఎరువులు దొరకడం లేదు. వాడు సరుకును విజయవాడ గోడౌన్‌లో దాచివేసి కొంచెం కొంచెం తెప్పించి బ్లాక్‌లో అమ్ముతున్నాడు. కొంతమంది రైతులు కక్కుర్తి పడ్డారు కానీ తరువాత నిత్యానందానికి బుద్ధిచెప్పాలన్న ఉద్దేశ్యంతో రైతులందరూ నిత్యానందం దుకాణాన్ని 'బాయ్‌కాట్' చేయాలని నిర్ణయించుకున్నారు.

విత్తనాలు శుద్ధి చేయడానికి గాధ గంధకికామ్లం కావాలి. ఒక హెక్టారుకు కనీసం పదిహేను టన్నుల పశువుల ఎరువు వేయాలి. తొంభైనుండి నూట ఇరవై కిలోల నత్రజనిని ఇచ్చే ఎరువును వాడాలి. ఎంత లేదన్నా ముప్పైకిలోల భాస్వరం పొటాష్ ఇచ్చే మందులు వాడాలి. ఇ.డోసల్ఫాన్. మలాధియాన్ కార్బరిన్ వంటి క్రిమి సంహారక ఔషధాలు తగిన అదనులో సిద్ధంగా ఉండాలి.

కోటయ్య తాను సృష్టించుకున్న లోకంలో తాను మునిగి పోయాడు. కానీ మల్లమ్మకు అలాంటి సౌకర్యం లభించలేదు. కోటమ్మ సతాయింపు ఎక్కువైంది. కోటమ్మకు ఉషమీద ఉన్న ప్రేమలో సగంకూడా మల్లమ్మమీద లేదు. కోటమ్మ దృష్టిలో ఉష కోటయ్యకూతురు. మల్లమ్మ కూతురుకాదు. ఉషకు జడ వేయడం, మీగడ పెరుగువేసి అన్నం పెట్టడం. ఫలహారాలు కొని పెట్టడం. ఇవన్నీ కోటమ్మకు సరదాలు. ఒకవిధంగా ఆలోచిస్తే చిన్నకొడుకు సూర్యం మీదికన్నా ఉషమీదనే ఎక్కువ ప్రేమ అని చెప్పవచ్చు. ఇది మల్లమ్మకు ఎక్కువ కోప కారణమైంది.

"ఈ ముసలిదానికి నా బిడ్డ కావాలిటగానీ నేను వద్దుట. ఏం చేస్తాం మానవజాతి అలాంటిది. మనిషి కుక్కను ప్రేమిస్తాడు. కుక్క మనిషిని ప్రేమిస్తుంది. కానీ కుక్కకు కుక్కంటే ద్వేషం మనిషికి మనిషంటే అసహ్యం" అన్నది మల్లమ్మ ఎవరితోనో.

ఈ మాట కోటమ్మ విన్నది. అక్కడినుంచి ఇంట్లో అగ్ని రగులు కొన్నది.

"ఎట్లెట్లా ? నన్ను కుక్కలతో, నక్కలతో పోలుస్తుందా మోజుపడి తెచ్చుకున్నందుకు మంచి శాస్తే అయ్యింది నాకు. ఈ ఇంట్లో అదన్నా ఉండాలి నేనన్నా ఉండాలి" అంటూ కంగాళీ చేసింది కోటమ్మ.

మంగళగిరి తిరనాళ్ళు వచ్చాయి.

"ఏమయ్యా పోయి తిరనాళ్ళు చూసొద్దామా ?" అన్నది మల్లమ్మ.

"ఉండవే పొలంలో మందులు వేస్తున్నాం. ఇప్పుడు తిర నాళ్ళకు తమాషాలకు తిరిగే సమయంకాదు." అని విసుక్కున్నాడు కోటయ్య. దాంతో ఉష ఏడుపుకి దిగింది. అదిచూచి కోటమ్మ కొడుకుతో "పిల్లది అంతలా ఏడుస్తుంటే ఒకపూట, తీసుకుపోతే నీ సొమ్మేం పోయింది ? ఈ పొలం పనులకేం ఎప్పుడూ ఉండే వేగా ?" అన్నది.

తల్లిమాట కాదనలేక కోటయ్యనసుగుతూ అంగీకరించాడు. దాంతో మల్లమ్మకి చిర్రెత్తుకొచ్చింది.

"ఈ యింటి కోడలికి బొడ్డూడని గుంటపిల్ల కున్నపాటి గౌరవం కూడా లేదు. ఈయనకి తల్లంటే బెల్లం పెళ్ళామంటే అల్లం. అంత పెళ్ళామంటే ఇష్టంలేనివాడు పెళ్ళెందుకు చేసు కున్నట్లు" అంటూ చిర్రుబుర్రు లాడింది.

తల్లి భార్యలమధ్య కోటయ్య నలిగిపోయాడు. కోటమ్మకు కోపంవచ్చింది.

"నేనేం అన్నాను ? పిల్లది అడుగుతుంటే తీసుకుపోరా ఎప్పుడూ ఉండే పొలం పనులే కదా అన్నాను. పిల్ల అంటే నా దృష్టిలో కోడలుపిల్ల."

"ఓ యబ్బ ఓయబ్బ సంబడం. ఇంత ప్రేమ ఎప్పటినుంచి కారి పోతున్నదమ్మా నీకు నా మీద. అబద్ధం చెప్పినా అతికి నట్లుండాలి."

దీంతో మళ్ళీ గొడవ రేగింది. ఈ అల్లరికి తట్టుకోలేక

కోటయ్య బండి కట్టించి ఉషను, మల్లమ్మను, సూర్యాన్ని బండి లోకి తోసి మంగళగిరి తిరనాళ్ళకు బయలుదేరాడు.

బండి పంటచేల మధ్య వెళుతూంటే మల్లమ్మకు తాను లక్ష్మితో కలిసి సాగించిన ప్రయాణపు స్మృతులు ఒక్కొక్కటే గుర్తుకు రాసాగాయి. లక్ష్మి ఎంత పిచ్చిపని చేసింది? కావాలంటే నలుగురూ కలిసి గుళ్ళో పెళ్ళిచేసినా గౌరవంగా ఉండేది. లక్ష్మి ఎక్కడ ఉందో ఏమో అనాటి పేరుశెనగకాయలు, మినప సున్ని, చక్రాలు, సినిమా యాక్టరు శివరావు వరుసగా గుర్తుకు రాసాగారు. మల్లమ్మ మనస్సు బాధగా లోలోపల మూల్గింది. కనులుతడిశాయి.

"ఏడవకే ఇల్లొదిలి వచ్చాం కదా. బండిలో కూడా మీ దెబ్బలాట ముచ్చట్లేనా? ఇక్కడ అమ్మలేదు గదా."

"నేను మీ అమ్మకోసం ఏడవడంలేదు."

"మరి?"

"లక్ష్మి గుర్తుకు వచ్చింది."

కోటయ్య చిన్నగా చిరునవ్వు నవ్వాడు. దాంతో మల్లమ్మ పెద్దగా ఏడవడం మొదలుపెట్టింది.

"ఇదేమిటే శృతిమించి రాగాన పడింది."

"ముసలి తల్లికంటే లేచిపోయిన లక్ష్మి నీ కెక్కువైంది అన్నట్లుగా నీవు నవ్వావు గదా, చేసినవన్నీ చేసి ఈ సంగినాచి తుంగబుర్ర కబుర్లెందుకు?"

"ఓసోసి ఎక్కడిది చావొచ్చి పడిందే! మాట్లాడితే ఆ మాటల కర్థాలు మాట్లాడకపోతే దానికి అపార్థాలు నవ్వే తప్పైతే నవ్వడం మానేస్తాను. చూడడం తప్పైతే చూపే మానేస్తాను."

"ఆ గతి ఎటు తిరిగీ తప్పదులే. నీవేదో ఇప్పుడు పెద్ద ముద్దు ముచ్చట్లతో వైభోగంలో మంచి తేలుస్తున్నట్లు. నవ్వనూ వద్దు చూడనూ వద్దు."

"ఇదిగో పోయినంతదూరం బండిలో నసపెట్టావంటే నే నిక్కడే బండిదూకి పొలాల్లోకి పారిపోతాను, మనుషుల కంటే ఆ చెట్లే నయం. అప్పుడప్పుడూ చిరునవ్వుతో పలకరిస్తాయి. వరి కుప్పల్ని నేలకేసి కొడుతూంటే దెబ్బలన్నీతింటూ మనకు ధాన్యంఇచ్చి బ్రతికిస్తాయి."

మల్లమ్మ దీంతో నోరుమూసుకుంది.

మంగళగిరిలో వున్న దైవంపేరు పానకాల లక్ష్మీ నరసింహస్వామి. ఆయన నోట్లో ఎన్ని బిందెల పానకంపోసినా సగే తాగేస్తాడు. బెల్లం అంత ఎక్కువగా అక్కడవాడుతున్నా ఒక్క ఈగవాలదు. ఒక్క చీమ తిరగదు.

బండి మంగళగిరి చేరింది. తిరునాళ్ళ వైభవోపేతంగా సాగుతున్నది. ఎక్కడచూసినా మిఠాయి అంగళ్ళే. బొమ్మల దుకాణాలే. లాటరీలే. ఇసుకవేస్తే రాలనంతగా జనం తిరుగుతున్నారు. కోటయ్య పిల్లలకు చెక్కర చిలకలు, జిలేబి కొనిపెట్టాడు. మల్లమ్మకు కారప్పూస పకోడాపొట్లం, కారప్పుబూందీ కొనిపెట్టాడు. ఓ చెట్టుక్రింద వో లాటరీ నడుస్తున్నది. లాటరీవాడు పెద్ద పట్టాగుడ్డమీద అంకెలు వేసి పెట్టాడు. ఒక చిన్న డబ్బాలో చతుర్భుజ ఘనాకారంలో ఉన్న కొయ్యముక్క ఉంది. దానికి ఆరు వైపులా ఆరు సంఖ్యల చుక్కలు ఉన్నాయి యాత్రికులు ఈ అంకెల మీద కాచుకుంటారు. లాటరీవాడు డబ్బా బోర్లిస్తాడు, ఏ అంకె వస్తే ఆ అంకెమీద కాచుకున్న వాళ్ళకు కాచుకున్నదానికి రెట్టింపు ఇస్తారు. కోటయ్య రెండు అంకెమీద రెట్టింపు కాచాడు. రెండురూపాయలొచ్చాయి. మళ్ళీ రెండు రూపాయలు కాచాడు. నాలుగు రూపాయలొచ్చాయి. ఈ సారి ఐదు రూపాయలుకాచాడు. పోయింది. కనీసం పోయిన ఐదన్నా సంపాదించుకోవాలని మళ్ళీ కాచాడు. మళ్ళీ పోయింది.

"పోవడం మొదలు పెట్టాక ఆటమానెయ్యాలి" సూర్యం సలహా చెప్పాడు.

"నీకెట్లా తెలుసురా,"

సూర్యం నాలిక కొరుక్కున్నాడు.

"లాటరీలుకూడా నేర్చుకుంటున్నావన్న మాట."

"అంతేకాదు నాన్నా మొన్న మన పొట్లకాయల పందిరి లేదూ. దాని చాటున కూర్చొని బాబాయి సిగరెట్టు తాగుతున్నాడు."

సూర్యం ఉషను కొట్టబోయాడు. కోటయ్య అడ్డం వచ్చాడు. మల్లమ్మకు కోపం వచ్చింది.

"మనంవచ్చింది తిరునాళ్ళు చూడటానికా, జాతర చేయ

టానికా? నీ దోవన నువ్వు జూదం మొదలుపెట్టావు వాడి దోవన వాడు సిగరెట్లుతాగి చిన్నపిల్లను కొడుతున్నాడు. బాగుందయ్యా మీ కోటమ్మగారి సంతానం.

కోటయ్య ఓర్చుకున్నాడు. లాటరీ దగ్గరినుంచి బయట పడ్డాడు.

"లాటరి లాటరి లాటరి జీవితమే ఒక లాటరీ"అని మైకు లోంచి పెద్దగా వినపడుతున్నది. ఉష బొమ్మలు కొనిపించుకుంది. మొత్తంమీద తిరనాళ్ళను కోటయ్య కుటుంబం బాగా ఎంజాయ్ చేసింది. తిరునాళ్ళ కబుర్లు చెప్పుకుంటూ తిరుగుప్రయాణంకట్టారు. కోటయ్య అన్నాడు

"తిరునాళ్ళవల్ల ఎన్నో లాభాలున్నాయి. జనమంతా ఒక చోటకలిసి ఆనందంగా గడుపుతారు. పంది జను కూడటంతో వారిలో ఐక్యత పెరుగుతుంది. దైవ విశ్వాసం వల్ల పాపాలు తగ్గుతాయి. వీటితోపాటు ఎన్నో దుకాణాలు. ఎంతో వ్యాపారం అమ్మేవారికీ కొనేవారికీ కూడా ఎన్నో విధాల ఉపయోగాలు."

"సరేగానీ మనం బస్తీపోయే సంగతేంచేశావు?" మల్లిమ్మ ప్రశ్నించింది.

"ఊఁ"

"ఊఁగాదు ఏకో తేల్చిచెప్పు. తిరునాళ్ళను పొగుడుకుంటూ కూర్చుంటే లాభంలేదు. ఇంట్లో జతర బౌతుంది."

"నీ కన్నిటికీ తొందరేనే. ఏదైనా బాగా ఆలోచించి చేయాలి."

"ఇందులో అలోచించేదేమీలేదు. బస్తీలో ఉండడానికి నేను నిశ్చయించుకున్నాను. నీవు ఒప్పుకోవడమే ఇంక ఆలస్యం."

"సర్లే ఇంటికిపోయి ఆలోచిద్దాం"

పసిడిపొలాలమధ్య గంటలు గణగణమని మ్రోగుతుండగా నందీశ్వరునికి సహోదరులా అన్నట్లున్న వృషభాలు చెంగు చెంగున పరుగులేస్తూ కర్లపాలెం వైపుకు సాగిపోయినై. ఇంటికి పోయేసరికి ముసలవ్వ సణుగుడు మళ్ళీ మొదలైంది.

"తిరునాళ్ళ సరదాలు సరదాలేకానీ ఈ ముసలిదాని సంగతి ఎవ్వరూ పట్టించుకోరు."

"నిన్నెవరు రావద్దన్నారమ్మా."

"బాగుంది నీ పిలుపు. వెనకటికి నీలాటిదే అన్నదట మొగుడితో, 'ఏమండీ అత్తగారికి నేనేమిచ్చినా వద్దంటుంది మీరేమో నేనామెను సరిగ్గా చూసుకోవటం లేదనుకుంటన్నారు. కావాలంటే చూడండి' అని అవతలి గదిలోవున్న బోడెవ్మ దగ్గరికివెళ్ళి మెల్లగా 'అత్తా బొట్టు పెట్టుకుంటావా?' అన్నదట అత్త పెద్దగా రాగాలు తీస్తూ 'అయ్యో నా బ్రతుక్కి అదికూడానా. నాకెందుకే తల్లీ' అన్నదట. కాసేపాగి మళ్ళీ మెల్లగా 'అత్తా కాటుక పెట్టుకుంటావా?' అన్నదట. అత్త మళ్ళీ 'అయ్యో నా మొహానికి అదే తక్కువ. నాకేం వద్దమ్మా'అని ఏడవ సాగిందట. ఆ మాయల మరాఠి కోడలు బయటికివచ్చి మొగుడితో 'చూచారా చూచారా నేను పళ్ళిచ్చినా, పాలిచ్చినా, ఫలహారాలిచ్చినా సేవలు చేసినా వద్దంటే వద్దంటుంది. మీ చెవులతో మీరే విన్నారుగా మీరేమో నన్నుఅత్తకుసేవచేయటంలేదని ఆడిపోసుకుంటుంటారు' అన్నదట ఆ వగలమారి వంకాయ."

"అంటే ఏమిటి? నేను వగలమారి వంకయనా. వంగనాచి తుంగ బుర్రనా? మాయల మరాఠీనా?"

దెబ్బలాట మొదలైంది. కోటయ్య పొలానికిపారిపోయాడు. నిర్విరామంగా అత్తా కోడళ్ళ ద్వంద్వ యుద్ధం యథాశక్తి సాగింది. ఆ రాత్రి మల్లమ్మ నగలపెట్టె సర్దుతుండగా ప్రధానపు ఉంగరం కనిపించలేదు. బట్టల మడతలన్నీ దులిపింది. పెట్టెలన్నీ వెతికింది, పోపు సామాన్ల డబ్బాలు, ముంతలు అన్నీ చూసింది. ఫలితం కనిపించలేదు. మల్లమ్మ ఆదుర్దాగా "ఉంగరం ఎవరైనా చూచారా? ఉంగరం ఎవరైనా చూచారా?" అని అడగడం మొదలు పెట్టింది.

ఉష "ఏం ఉంగరమమ్మా?" అని అడిగింది.

"అదే ప్రధానపు ఉంగరమే. ఇలా వంకరగా ఉంటుంది."

"ఓహో అదా అమ్మా ఎర్రరాళ్ళ ఉంగరం."

"అదే అదే" అన్నది మల్లమ్మ ఆశగా.

"సంక్రాంతి పండగనాడు పేరంటం అప్పుడు పెట్టుకున్నావు."

"ఆఁ ఆ ఉంగరమేనే దామ్మా ఎక్కడఉంది చూపించు."

"అమ్మా నాకా ఉంగరం పెట్టవే అని అడిగితే అది నీసైజు కాదు. నీకు వేరే చేయిస్తాను" అన్నావు. ఆ ఉంగరమే కదూ"

"జానాను అదే అదే."

"అద్దైతే నే నెక్కడా చూడలేదమ్మా."

మల్లమ్మకు మండుకొచ్చి ఉషను నాలుగు వాయించింది. దీంతో ఉష యేడుపు లంకించుకుంది. అది చూచి కోటమ్మ సణగడం మొదలు పెట్టింది.

"లేచిపోయిన లక్ష్మితో సినిమా ముచ్చట్లు చెప్పుకునేశ్రద్ధలో పదోవంతు ఇంటిమీద చూపిస్తే ఇల్లు ఈ తీరున ఉండేది కాదు. ఇంట్లో వస్తువులు కనపడవు. ధాన్యం మాయమౌతుంటుంది. బంగారం పోతూంటుంది. లోగుట్టు పెరుమాళ్ళ కెరుక.

"అంటే యేమిటమ్మా నీ ఉద్దేశ్యం"

"నాకు ఉద్దేశ్యాలు దురుద్దేశ్యాలు ఏమీ లేవు. ఆ ఉంగరం ఎవరింటికి చేరిందో ఆ ఇంట్లో వెతికితే దొరుకుతుంది కానీ ఆ చిన్నముండను పట్టుకొని ఉంతే ఏం లాభం."

"ఎవరింటికి చేరిందిట" మల్లమ్మ చుర చుర చూస్తూ ప్రశ్నించింది.

"ఏ కోమటింటికి చేరిందో? ఎవరి పుట్టింటికి చేరిందో?"

దీనితో అగ్ని పర్వతం బద్దలై లావా నలసలా ప్రవహించింది.

అంటే నా ఉంగరాన్ని నేనే కోమటింట్లో అమ్ముకున్నానా? నా ఉంగరాన్ని నేనే పుట్టింటికి చేరవేసి పోయిందని వెతుక్కుంటున్నానా? మనిషి మాట్లాడవలసిన మాటలేనా ఇవి."

"అంటే నేను జంతువునా?"

"యేమో నీకే తెలియాలి."

అక్కడి నుండి అగ్ని బాగా రగులుకుంది. కోటమ్మ ఇరుగు పొరుగువాళ్ళను వీధిని పోతున్నవాళ్ళను పిలిచి అల్లరి చేసింది. వింటున్న వాళ్ళంతా ముక్కుమీద వేలువేసుకొని యేదో తోచింది కామెంట్ చేసి వెళ్ళిపోవడం మల్లమ్మ చూచింది. అత్త కావాలనే తన పరువు కుటుంబం పరువు బజారు కీడుస్తున్నదని మల్లమ్మ ఊహించింది. ఆరాత్రి మల్లమ్మ పొలాలకోసం తెచ్చిన

యేదో మందును మింగింది. ఐతే అది తక్షణమే గుర్తింపబడటం వల్ల వెంటనే మల్లమ్మ ప్రాణాలని కాపాడారు.

ఆ మరునాడు కోటయ్యగారింటికి పోలీసులు వచ్చారు. పోలీసులనుచూచి కోటమ్మ బెంబేలు పడిపోయింది.

"కోటయ్య మల్లమ్మ అంటే ఎవరు?" అని పోలీసులు సూటిగా ప్రశ్నించారు.

"యేంలేదునాయనా యేదో మాటవరసకు మాటమాట అనుకున్నారంతే ఇందులో పోలీసులు జోక్యం చేసుకోవాల్సిన తప్పు యేమీ లేదు బాబు" అని కోటమ్మ అనునయంగా సర్దటానికి ప్రయత్నిస్తున్నది.

"అది సరేలేవమ్మా కోటయ్య నీకేమౌతాడు?"

"నా కొడుకే."

"మల్లమ్మ?"

కోటమ్మ జవాబు చెప్పలేదు.

"చెప్పమ్మా. ఇంట్లో పెద్దవాళ్ళని పిలు."

క్షణాలలో కోటయ్యకు కబురందింది. పొలంనుంచి పరుగెత్తుకుంటూ ఇంటికి వచ్చాడు.

"నీవేనా కోటయ్యవు?"

"ఔనండీ."

"మల్లమ్మ నీ భార్యయేనా?"

"అ....వు....ను...." కొంచెం భయపడుతూ అన్నాడు.

"ఆమెనొకసారి పిలిపించండి."

కోటయ్య భయంగా లోపలికు వెళ్ళాడు. మల్లమ్మ అర్థ నిమీలిత నేత్రాలతో మంచంమీద పడుకొని ఉంది.

"ఇదిగో నువ్వొకసారి వసారాలోకి వస్తావా?"

కళ్ళెత్తి 'ఎందుకు?' అన్నట్లు చూచింది.

"ఏమో తెలియదు. పోలీసులు వచ్చారు. మన గుమ్మం పోలీసులు త్రొక్కటం ఇదే మొదటిసారి. నువ్వు వచ్చి ఏమీ జరగలేదని చెప్పి మన కుటుంబ ప్రతిష్ఠ కాపాడాలి."

మల్లమ్మ భర్త మాటను మన్నించింది. ఆయన సహాయం పట్టగా వసారాలోకి వచ్చింది.

"మీరేనా మల్లమ్మ ?"

"ఔను."

"ఈ ఉంగరం చూడండి." పోలీసు మల్లమ్మకు ప్రధానపు ఉంగరాన్ని చూపించాడు. మల్లమ్మ నివ్వెరపోయింది.

"ఇది నాదే" నన్నది.

"ఔనమ్మా. ఈ ఉంగరం మీదేనని మాకు ఆచూకీలో తెలిసింది. విజయవాడలో ఓ దొంగల ముఠా ఉంది. వాళ్ళు దొంగ సొమ్మును కొనడం అమ్మడం స్వయంగా దొంగతనాలు చేయించడంకూడా చేస్తుంటారు. మంగళగిరిలో తిరునాళ్ళలో ఆ ముఠాకు చెందినవాడే ఓ దుకాణం తెరిచాడు. అక్కడికి మీ ఇంటినుంచి సూర్యం అనే పిల్లవాడువచ్చి ఈ ఉంగరాన్ని అమ్మాడు. మేము కాంచివుండి పట్టుకున్నాం. రెండు తగిలించేసరికి అన్నీ చెప్పాడు. ఆ బాబు ఇప్పుడు మా కస్టడీలోవున్నాడు. ఇంకా దొరికిన నగల గురించి విచారణజరుగుతున్నది. మీ ఇంట్లోమరేమైనా పోయాయా చెప్పండి."

ముసలమ్మ కోటయ్యను చాటుకుపిలిచి చెవులోఏదోచెప్పింది. కోటయ్య చాలా నిర్లిప్తంగా మారిపోయాడు. చైతన్యరహితంగా పోలీసుల ముందుకువచ్చి "మీరేమీ అనుకోకండి సూర్యం నా తమ్ముడు. నేనే ఆర్థికమైన ఇబ్బందితో పొలాలకు అర్జంటుగా ఎరువులు కావలసివచ్చి బంగారాన్ని మార్కెటుకు పంపాను." అన్నాడు. అది వింటున్న మల్లమ్మ అలాగే స్తంభానికి అనుకొని కూలబడిపోయింది. పోలీసులు ఇంకా ఏవో ప్రశ్నలు వేశారు. సంతకాలు తీసుకున్నారు. కోటయ్యను వెంటపెట్టుకొని మంగళగిరి పోయారు. మర్నాడు కోటయ్య సూర్యంతో సహా కలిసి తిరిగి వచ్చాడు. ముసలమ్మ సూర్యాన్ని కౌగలించుకొని గట్టిగా ఏడిచింది.

"ఏరా నాయనా సిన్ను పోలీసోళ్ళు ఎక్కడకొట్టారు ?" అంటూ ఒళ్ళంతా తడిమింది. కోటయ్య దిగాలు మొహంతో ఇంట్లోకి వెళ్ళాడు. మల్లమ్మ మందు ప్రభావంనుంచి బాగా తేరుకుంది. అయితే ఆమెకళ్ళు చాలా తీవ్రంగా ఉన్నాయి.

"ఉంగరం.... ఉంగరం తీసుకువచ్చాను. డబ్బుకట్టాను.

పోలీసోళ్ళకి...." కోటయ్య పొడి పొడిగా మాట్లాడుతున్నాడు. మల్లమ్మ శూన్యంలోకి చూస్తో ప్రశ్నించింది.

"మనం ఎప్పుడు ఇల్లువదిలిపెట్టి వెళుతున్నాము ?"

"మనమా ? ఏ ఊరికి ?"

"విజయవాడకు.... వెళ్ళి ఇల్లుచూది అడ్వాన్సు ఇచ్చిరా." నేనూ ఉష ఈ ఇంట్లో ఇక పచ్చిమంచినీళ్ళు తాగం. దానిని బస్తీలో కాన్వెంటు చదువులో చేర్పించి దగ్గరుండి శ్రద్ధగా చూసు కుంటాను."

"మల్లమ్మా" అన్నాడు.

"మల్లమ్మ నీకు దక్కాలంటే ఇలాగే విజయవాడకు బయ ల్దేరు. చెప్పుల్లోంచి కాళ్ళు తీయొద్దు."

కోటయ్య మారుమాట మాట్లాడలేదు.

ఒక వారంరోజులలోనే మల్లమ్మ ఉషతో సహా బస్తీలో కాపురం పెట్టింది.

## 6

మల్లమ్మ బస్తీ జీవితం మొదలైంది. దాంతో కొన్ని సమ స్యలు ఉత్పన్నమైనాయి. పల్లెటూళ్ళోవుంటూ సరదాగా బస్తీకివచ్చి ఒకటి రెండు రోజులుండి ఆనందించి వెళ్ళడం వేరు. అక్కడే శాశ్వతంగా నివాసం ఏర్పరుచుకొని ఉండటం వేరు. మల్లమ్మకు పల్లెనుంచి పట్నానికి మారిన ఈ సంధికాలంలో వచ్చిన కొత్త సమస్యలను ఎలా ఎదుర్కోవాలో తెలియలేదు. మానసికంగాకూడా ఈమె తబ్బిబ్బు కాసాగింది.

రెండొందల రూపాయలుపెట్టి మల్లమ్మకోసం కోటయ్య ఒక ఇల్లు సత్యనారాయణపురంలో తీసుకున్నాడు. పాలకు మనిషి, పనికి మనిషి ఏర్పడ్డారు. కర్లపాలెంలో మల్లమ్మ చీకటితోలేచి పాలేరు తీసిన పాలను కాగబెట్టి, వాకిట్లో ముగ్గులువేసుకొని దిన చర్య ప్రారంభించేది. ఇక్కడ పాలు పొద్దెక్కిన తరువాతవచ్చి ఒకడు పోసి పోతాడు. సైకిలుకు ఒక బిందెను కట్టుకుంటాడు. ఆ సైకిలుపై ఇల్లిల్లూ తిరిగి పాలుపోసి వస్తూంటాడు. మల్లమ్మకు ఈ బస్తీ పాలు చూచేసరికి ఆశ్చర్యంవేసింది. "ఇదేమిటయ్యో

పాలల్లో నీళ్ళుకలిపారు ?" అని అడిగింది. "బావినీళ్ళేమీకాదమ్మా కృష్ణానదీ తీర్థమే కలిపారు. పాలతోపాటు పుణ్యంకూడావస్తుంది. ఐనా మారుబేరగాడిని నేనేంచేస్తాను ?" అన్నాడు.

"ఇట్లాంటి నీళ్ళపాలని నా జన్మలో చూడలేదు. టెక్కుకుదు ములలాంటి రూపాయలు తీసుకోవడంలేదా ?"

"చూడమ్మా అందరికీ ఏవి పోస్తున్నానో మీకూ అవే పోస్తున్నాను. ఈ సత్యనారాయణపురంలో ఇరవై యేళ్ళనుంచి పోయించుకుంటున్న ఖాతాలున్నాయి. నేను ఏం పోస్తే అది పోయించుకొని వాళ్ళు నోరుమూసుకొని త్రాగుతున్నారు. మీరు వచ్చి వారం రోజులు కాలేదు. అప్పుడే నా పాలకు వంక పెడితే ఏం చేయను. ఇష్టంలేకపోతే వేరేవాళ్ళ దగ్గర పోయించుకోండి" అన్నాడు ఖండితంగా.

"వాడు మానేస్తే ఈ బజారులో ఈ మాత్రం పాలుకూడా దొరకవు" అని పక్కింటివాళ్ళు చెప్పారు. దాంతో మల్లమ్మ నోరు మూతపడింది.

కర్లపాలెంలో కోటయ్యగారింట్లో అందరూ పెరుగు పోసుకొని త్రాగేవారు, ముదరకాగిన వేడిపాలలోపచ్చకర్పూరం, యాలకుల పొడివేసుకొని త్రాగడం మల్లమ్మకిష్టం. కోటయ్యగారి ఆవులు గేదెలు మాత్రమేకాకుండా ఊళ్ళో ఇతరుల గేదెలు ఈనినప్పుడుకూడా ముందు కోటయ్యగారింటికి జున్నుపాలు వస్తూండేవి. పండు మిరపకాయల కారం, గోంగూర పచ్చడి, కలుపుకొని అన్నం తడిసేటట్లు కాచిన నేయి పోసుకొని కోటయ్యగారింట్లో అంతా భోంచేస్తూవుండేవారు. ఇక్కడ సవాసేరు వంకాయలు పావలా. మిర్చి బేడా. అణా పెడితే గుప్పెడు గోంగూరకూడా రావడంలేదు. డబ్బు పెట్టి కూరలూ పాలూ కొనుక్కోవడం మల్లమ్మకేదో కొత్తగా అనిపించింది. మల్లమ్మ అద్దెకు తీసుకున్న మేడలో రెండు భాగాలున్నాయి. పక్కపోర్షనులో రమణి అనే ఆమె అద్దెకుంటున్నది మల్లమ్మతో రమణి చెప్పింది.

"బస్తీలలో రెండు వర్గాల వాళ్ళుంటారు. పల్లెల్లో భుక్తి గడవక పొట్ట చేతపట్టుకొని పనిచేసుకొని కానీ, సన్నకారు ఉద్యోగాలు చేసుకొనిగానీ బ్రతుకుదామని వచ్చినవర్గం ఒకరకం. బాగా

పులిసిపోయి ధనంతో మదించిపోయి ఆ డబ్బు నేంచేయాలో తెలియక బస్తీలలో విలాస జీవితాలు గడిపేవర్గం రెండో రకం. ఈ రెండు వర్గాలకు చెందని వాళ్ళకు బస్తీజీవితం అనవసరం. నరకం."

ఇందులో తానేవర్గానికి చెందుతుందో మల్లమ్మకు తెలియ లేదు.

"చూడండి రమణిగారూ మా ఊళ్ళో ఎప్పుడూ హాయిగా చల్లటి గాలి వస్తూవుంటుంది. ఇక్కడ సాయంత్రమైనా రాత్రైనా కూడా చల్లగాలి తిరగడంలేదు. కొళాయిల్లో నీళ్ళురావడంలేదు. మా ఊళ్లో పరిమితంగానే జనంవుండి ఎంతో విశ్రాతింగా ఉండేది. ఇక్కడ ఎటుచూచినా జనమే ఎంత రెస్టు ఎంత రెస్టు" అన్నది.

రమణి తనలో నవ్వుకున్నది. "బస్తీలో చాలా రష్‌గా ఉంటుందని మల్లమ్మ ఉద్దేశ్యం అన్నమాట. మల్లమ్మకు చదువు రాదని రమణి గ్రహించింది కానీ అవమానించలేదు, రమణి ఓ మహిళామండలికి సెక్రటరీ. విజయవాడలో అనేకమైన సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉంటుంది. ఆమె భర్త పురుషోత్తమరావు ఆబ్‌కారీ శాఖలో ఉద్యోగి మద్యాన్ని దొంగరవాణా చేస్తుంటే పట్టుకోవలసిన పురుషోత్తమరావు, బాధ్యత సక్రమంగా నిర్వహిస్తాడో లేదో గానీ వాళ్ళింట్లో మాత్రం ఎప్పుడూ మంచి ఖరీదైన సారా సీసాలు ఉంటూంటాయి. రాత్రి కొంచెం పొద్దు పోగానే పురుషోత్తమరావు పీకలదాకా పట్టించి సినిమా పాటలు మొదలుపెడతాడు. మల్లమ్మకు ఈ వాతావరణం మొదట్లో చాలా ఇబ్బందిగా అనిపించింది. నాలుగు రోజులైన తరువాత కోటయ్య వచ్చాడు. కోటయ్యనుచూచి ఎన్నో యుగాలైనట్లు అనిపించింది. ఒక్కసారి భోరున ఏడ్చింది. ఏడుస్తున్న మల్లమ్మనుచూస్తూ కోటయ్య అట్లా నిలబడిపోయాడు. మల్లమ్మ కోటయ్యను గట్టిగా కౌగలించుకుంది.

"ఎందుకే ఏడుస్తావు?" అన్నాడు.

"నాకీ వాతావరణం నచ్చలేదు."

కోటయ్య ఒక్క క్షణం ఆలోచించి, "దానికేం ఇంటికి వెళదామంటే సరే."

"వచ్చినా నేనా ఇంట్లో అడుగుపెట్టను. అర్థమైన మాట అన్నది. సతాయించింది. రాచి రంపానపెట్టింది. అయినా ఓర్చు కున్నాను. చివరికి నా ఇంట్లో నన్నే దొంగనుచేసింది. నా బంగా రాన్ని నేనే అమ్ముకొని జల్సాచేశానని అన్నది. ఇంక నేను యే ముఖం పెట్టుకొని కర్లపాలెం గడప దొక్కను."

కోటయ్య ముఖం పక్కకు తిప్పుకొని పైపంచెతో కళ్లద్దు కున్నాడు. మల్లమ్మ కోటమ్మలమధ్య తిరగలిలో రెండు రాళ్ళ మధ్య నలుగుతున్న ధాన్యంలా కోటయ్య నలిగిపోతున్నట్లు సూచిస్తూ అతని రెండు కనుకొనుకులనుండి రెండు కన్నీటిబొట్లు జారాయి.

"మంచో చెడో బస్తీకి వచ్చావు. కొన్నాళ్ళు ఇక్కడే ఉండు ఏది ఎట్లాజరగాలో అట్లాగే జరుగుతుంది. నీవిక్కడ నేన క్కడ ఈ సంసారం ఎలా కావాలో తెలియడంలేదు. పొలాలు వదిలి నేను రాలేను వచ్చి బస్తీలో ఉండడం అసంభవమే. ఇది మామూలు సమస్యకాదు. ఇక పాలు, పెరుగు కూరలు అంటావా? ఏదో సర్దుకుపోవచ్చు. రూపాయి పాలు చాలకపోతే రెండు రూపా యల పాలు కొనుక్కో. బియ్యం, పప్పులు, నెయ్యి ఇంటినుంచే వస్తాయి. మల్లమ్మ ఏదీ? అంటే కూతురి చదువుకోసం బస్తీలో కాపురం పెట్టింది అని ఊర్లో అంతా టాం టాం అయ్యింది. ఇప్పుడేంచెయ్యాలో తోచడంలేదు. నీమీద మా అమ్మకు ప్రేమ ఉన్నదో లేదో నాకు తెలియదుకానీ ఉషను వదిలి ఆమె బ్రతకలేదని నీకుకూడా తెలుసు. ఈ నాలుగురోజుల్లోనూ ముసలమ్మకు పదేళ్ళ ముసలితనం వచ్చినట్లు అయ్యింది. కూడూ నీళ్ళూ మానేసింది. పిలిస్తే పలకదు. ఏదో ఆలోచిస్తూవుంటుంది. తనలో తాను గొణు క్కుంటూ వుంటుంది. దానికి పిచ్చిపడుతుందేమో అని భయంగా ఉంది.

కోటమ్మపేరు చెప్పేసరికి మల్లమ్మకు రోషం పొడుచు కొచ్చింది.

"చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే ఏం లాభం చేసిన పన్నిచేసి ఇప్పుడెవరిమీద యేడుస్తుందట?"

"బస్తీలో నీవు ఒంటరిగా ఉండడం అన్నది ఎట్లాగాఅన్నది

మరో సమస్య. పొలాన్ని పాలేర్ల మీద వదిలితే ఇహ ఐనట్లే. యేరోజు కారోజు బిడ్డను చూచుకుంటున్నట్లు చూచుకుంటూండాల. నిన్ను ఇక్కడవదిలి ఎలా ఉండడం. నీవిక్కడ ఒక్కతివే ఎలా ఉండటం. మంచో చెడో ఇంకో ఆలోచన వచ్చింది."

"ఏమిటి?"

"సూర్యం అటు పొలానికీ ఇటు బసికి పనికిరాకుండా పోయాడు. పోసి బస్తీలో ఏ ట్యుటోరియల్ కాలేజీలోనన్నా చేరి మెట్రిక్ చదువుకుంటే బాగుపడతాడేమో; మరి."

"ఆ బాగుపడతాడు. ఈసారి నన్నుకూడా పోలీసు స్టేషన్‌కు చేరుస్తాడు."

కోటయ్య ఒక్క క్షణం యేం మాట్లాడలేదు.

"అమ్మను వదిలి సూర్యం బస్తీకి రావడం నాకూ ఇష్టం లేదు. బస్తీకివచ్చి చదువుకున్నవాళ్ళు ఉద్యోగాలు లేక ఆఫీసుల చుట్టూ తిరుగుతున్నారు. చదువుకుతగ్గ ఉద్యోగాలురావు. చిన్న ఉద్యోగాలు చేయడానికి నామోషీ. బి. ఏ. పాసైనవాడు తిరిగి పల్లె కొచ్చి నాగలిపట్టడం అంటే, జరగనిపని. చివరకు అటు ఉద్యోగం లేక ఇటు పొలానికి పనికిరాకా రెండికీ చెడిన రేవడుగా మారి చెట్టుక్రింద రచ్చబండమీద చీట్లాడుకుంటున్నాడు. ఇట్లా ఉంది పల్లెటూరివాడి సంగతి. ఈ పల్లె ప్రజల్ని ఇక భగవంతుడే రక్షించాలి. నేనువస్తాను. గవర్నరుపేటలో యూరియా దొరుకుతున్న దట, బండి మాట్లాడుకొని బస్తాలు వేయించుకొని పోవాలి."

"భోంచేసి వెళ్ళు."

మల్లమ్మ గబ గబా వంటచేసింది. ఉష ట్యూషన్‌నుంచి వచ్చింది. తండ్రినిచూసి ఎగిరి కౌగలించుకొని 'నాన్నోయ్' అని పెద్దగా ఏడ్చింది. కోటయ్యకు దుఃఖం ఆగలేదు. కూతురిని ఎత్తుకొని మూర్ధాన్ని చుంబించి గట్టిగా గుండెలకు హత్తుకున్నాడు. కొన్ని క్షణాలపాటు అలాగే వుండిపోయాడు.

"నాన్నా నేను నీతోపాటు వస్తానే. నన్ను తీసుకెళ్ళవే" అన్నది ఉష.

"అలాగేలేమ్మా తప్పకుండా తీసుకెళతాను. కొద్దిగా చదువు నేర్చుకో."

"నాకీ చదువు వద్దు నాకు నానమ్మకావాలె."

"నానమ్మ వస్తుందిలే. చదువు నేర్చుకోలేదనుకో రేపు పెళ్ళి కొడుకువచ్చి "నాకీ పల్లెటూరి పిల్ల వద్దు" అంటాడు. ఇప్పుడు బి. ఏలు ఎమ్. ఏలు డాక్టర్లు చదువుతున్న అమ్మాయిలు కావాలం టున్నారు పెళ్ళికొడుకులు" అని నవ్వాడు. మల్లమ్మ వంట సిద్ధం చేసింది. కోటయ్యకి ఉషకు వడ్డించింది. గోంగూర పులుసుకూర, కందిపచ్చడి వేసింది. కాకరకాయ వెల్లుల్లి కారంపెట్టి వండింది.

"నెయ్యివేయి" అన్నాడు.

మల్లమ్మ నేయి వడ్డించింది.

"ఇదేమిటే వాసనొస్తున్నది?"

"సత్యనారాయణపురం నేతి షాపులో ఇదే అమ్ముతారు."

"ఇది నెయ్యా - కర్లపాలెంలో కుక్కలకుపోసినా వాసన చూడవుగదే." అన్నాడు.

మల్లమ్మ మాట్లాడలేదు.

"మల్లమ్మా కర్లపాలెంనుంచి నేయి పట్టుకొస్తానుండు." పెరుగు పట్రా.

మల్లమ్మ నీళ్ళ మజ్జిగ తీసుకొచ్చింది.

కోటయ్య మజ్జిగవైపొకసారి చూసి చెయ్యి కడుక్కున్నాడు.

"సరే నే వొస్తాను" అన్నాడు.

"వెళుదువులే. నువ్వు నీ యూరియాఎప్పుడూ ఉండేవేగా. నీతో కొంచెం మాట్లాడాలి. రాత్రికి ఉండు."

కోటయ్య ఉండిపోయాడు.

ఆ రాత్రి మల్లమ్మ రంభలా అలంకరించుకుంది. తలనిండా ఆబగా మల్లెపూలు కనకాంబరాలు పెట్టుకుంది. శరీరమంతా కన పడే ఉల్లిపొర చీర కట్టుకుంది. బ్రాలోపలి వక్షోజాలు రవిక బిగువును సవాలుచేస్తూండగా మల్లమ్మ పడకగదిలోకి వచ్చింది. అప్పటికే ఉష నిద్రపోయింది. మల్లమ్మ పాలల్లో పంచదార యాలకులపొడి,, పచ్చకర్పూరంవేసి కోటయ్య కిచ్చింది. కోటయ్య పాలు కొంచెం చప్పరించాడు. మల్లమ్మ మంచంమీద కూర్చున్నది, కిటికీ తలుపులు మూసివేసి ఫ్యాను వేసింది. చల్ల

గాలికి గది మొత్తం జిల్లుమంది. కోటయ్య ఖద్దరుపంచె, లాల్చీ లేసుకున్నాడు.

"యీ అత్తరు వాసనేమిటే ?" అని అడిగాడు.

"ఇది మన ప్రక్కవాటాలోని ఆఫీసరుగారి భార్య ఇచ్చింది. వాళ్ళు చాలా నాజూకు మనుషులు. మనకన్నా ఎన్నో విషయాలు వాళ్ళకు తెలుసు" అంటూ పరుపుక్రిందనుంచి ఓ పుస్తకంతీసి కోటయ్య చేతికిచ్చింది. కోటయ్య దాని పేజీలు తిప్పాడు. అది 'కొక్కోకకం' సచిత్ర కామశాస్త్రం.

"ఏమిటే ఈ పుస్తకం ?"

"రమణిగారు ఇచ్చారు."

"రమణియా ?"

"అదే మన పక్కపోర్షన్ అప్కారీ ఆఫీసరు భార్య రమ ణమ్మగారు. మోటుగావుందని రమణిగా మార్చుకుంది. నా పేరు కూడా మార్చింది. నా పేరు మల్లమ్మకాదు. మధుమతి" అంటూ కోటయ్య వళ్ళో తల పెట్టుకుంది. కోటయ్య మధుమతి బుగ్గలను గట్టిగా కొరికాడు. మధుమతి తప్పించుకొని లేడిలా పక్కకు గెంతబోయింది. కోటయ్య మధుమతిని గట్టిగా పట్టుకొన్నాడు. మధు మతి పక్కమీదకు దొర్లింది. కోటయ్య ఆకలిగొన్న పులిలా మధుమతి మీదికి దూకాడు.

"ఇదిగో మల్లమ్మా నిన్నొదిలిపెట్టి నేను బ్రతకలేను."

మధుమతి, "ఇదిగో కోటేశ్వరరావుగారూ మీరా పొలాలు యూరియాసంచులు జింకుఫాస్ఫేటు బిళ్ళలు ఇక వదిలిపెట్టండి. పొలాలను ఎవరికైనా కౌలు కిచ్చేసి బస్తీలో కొంతకాలం సుఖపడ దాం" అన్నది.

కోటయ్య మధుమతి పెదవిని గట్టిగా కొరికాడు. దొండ పండును చప్పరించినట్లు చప్పరించాడు. "కోటేశ్వరరావు- తమా షాగా ఉందే నాపేరు" అన్నాడు.

"జానపురి అంతా మోడరీను మోడరీను" అన్నది.

"మోడరీను అంటే ?"

"మోడరీను అంటే బస్తీపద్ధతిట. రమణిగారు చెప్పారు. వాళ్ళాయన ఒక్క రాత్రికూడా ఆవిడను వదిలిపెట్టడట. ఏమయ్యా

నువు నన్ను వదిలి పల్లెటూళ్ళో ఎట్లా వుంటావు. నువ్విక్కడికి వచ్చేయవయ్యా-"

"ఎట్లాగే. పొలము గొడ్డు, గోదా, తల్లి పిల్లా మేకా పాలేరులు నౌకర్లు వాళ్ళను ఎవరు చూసుకుంటారు ? నీకున్న సాహసం నాకు లేదు మల్లమ్మా."

మల్లమ్మ నిట్టూర్చింది. కోటయ్య లైటార్పాడు. గట్టిగా మల్లమ్మ మెడను కౌగలించుకున్నాడు. తెల్లవార్లు రెండు వాటాలలోనూ గాజుల గలగలలు వినిపిస్తూనే వున్నాయి.

# 7

ఏ.ధుపతికి రమణికి బాగా స్నేహం కుదిరింది. రమణి మధుమతితో "మీరూ ఒక ట్యూటర్‌ను పెట్టుకొని ఇంటి వద్దనే ఇంగ్లీషు, తెలుగు నేర్చుకోండి" అని చెప్పింది.

"అదేం మాట నాకిప్పుడెందుకమ్మా చదువు? ఆడపిల్ల పల్లెటూళ్ళో మరీ అన్యాయమైపోతున్నదని పెళ్ళి చదువులకోసం బస్తీకి తీసుకు వచ్చాను. మా బంధువులలో ఆడపిల్ల కాలేజీలలో చదివి లక్ష రూపాయల కట్నం తీసుకొని పోతేకాని పెళ్ళి కావటంలేదు. మా అయనకి ఇష్టంలేకపోయినా నేనే బలవంతంగా బస్తీలో కాపురం పెట్టించాను.

"ఏది జరిగినా మన మంచికేనంటారు. మీకున్న అందము చలాకీతనము ఈ నగరాలలో ఎందరికుంది? దానికితోడు చదువు కూడా అబ్బిందంటే పూవుకు పరిమళం అబ్బినట్లుంటుంది బంగారానికి సువాసన వచ్చినట్లుంటుంది."

"ఏమిటోనండీ పల్లెటూరివాళ్ళం. మాకంతగా చదువులు, సంస్కారాలు తెలియవు."

"అట్లా అనకండి. అంతా పల్లెటూళ్ళలో పుట్టినవాళ్ళే. మా అమ్మమ్మలు తాతయ్యలూ ఎక్కడినుండి వచ్చారు? నేనంటే మావారిఉద్యోగంతోవైజాగ్, రాజమండ్రి,గుంటూరు, విజయవాడలు ట్రాన్సఫర్లమీద తిరిగాను. ఇంకా అయనవెంట హైద్రాబాద్ మద్రాస్ బెంగుళూరు మైసూరులు చూచాను."

మధుమతి రమణిని ఒక దేవతను చూచినట్లు చూస్తున్నది.

"ఇదిగో చూడండి మధుమతిగారూ నే చెప్పానని మరోలా అనుకోకండి. మీరు బాగా మారిపోవాలి. కోటేశ్వరరావుగారిని కూడా మార్చాలి."

"అంటే ?"

"అంటే చూడండీ మన మాటల్లో సంస్కారం ఉట్టిపడాలి. నడకలో నడతలో వేషంలో భాషలో నాగరికత ప్రతిబింబించాలి."

"ఏదో పల్లెటూళ్ళోవుండి వచ్చినదాన్ని నాకవన్నీ అంతగా తెలియవమ్మా. గొబ్బెమ్మలు ముగ్గులు, భోగిపళ్ళు నవరాత్రులు ఏవో ఇలాంటివే తెలుసు."

"ఫరవాలేదు. అవన్నీ ఏవీ తప్పుకాదు, కానీ అవి పాలిష్‌డ్‌గా వుండాలి. పేడను మనం చేత్తో తాకకూడదు. ఎవరన్నా గొబ్బెమ్మలు పెట్టుకొని పేరంటాలు చేసుకుంటూంటే ఉత్సవాలు జరుపుకుంటూంటే మనంవెళ్ళి అధ్యక్షత వహించవచ్చు. అక్కడ పల్లెసీమలు స్వర్గసీమలని, అమాయకమైన గ్రామీణ జీవనం ఎంతో నిరాడంబరంగా ఉంటుందని ఓచిన్న ఉపన్యాసం ముందే రాసుకొని చదివి రావచ్చు. ఐతే ఆ ప్రసంగం మరునాడు పత్రికలలో వచ్చే ట్టు జాగ్రత్తపడాలి. ఇక ఆచరణ అంటావా అలాంటి బాదర్తాలేవీ పెట్టుకోకూడదు."

మధుమతి నవ్వి "ఏమిటో ఇలాంటివన్నీ నాకు తెలియవు. మీరే నేర్పాలి" అన్నది.

ఇలాంటివెవరూ నేర్పక్కరలేదు. కొన్నాళ్ళంటే అవే అల వాటైపోతాయి. గుడ్డునుంచి బయటకువచ్చి రెక్కలు ఎదిగిన పిట్ట సహజంగానే ఎగిరినట్టు ఐ స్త్రీజీవితం అదే నేర్పుతుంది. నీళ్ళలోని చేపకు ఈత నేర్పవలసిన పనేముంది."

మధుమతి సంకోచించింది.

రమణి కొన్ని ఇంగ్లీషు మాగజైన్లుతెచ్చి మధుమతి ముందు పడేసింది.

"నాబొంద నాకు తెలుగే రాదు. ఈ ఇంగ్లీషు పేపర్లేం చదవగలను ?" అన్నది.

"చదవనక్కరలేదు ఊరికే పేజీలు తిప్పుతూ కుర్చీలో కూర్చుంటే చాలు."

"అప్పుడొక ప్రమాదం వస్తుంది. తెలియక పుస్తకం తలక్రిందులుగా పట్టుకొని కూర్చున్నాననుకోండి, వెంటనే పట్టుబడి పోతాను."

"ఫరవాలేదు. దానికో ట్రిక్కు వుంది. పుస్తకంలో బొమ్మ లుంటాయిగా. తలవున్న భాగం పుస్తకానికి పైవైపు కాళ్ళున్న భాగం పుస్తకానికి క్రిందివైపు. తెలిసిందా?"

"బాగుందండీ."

"మాటకు ముందు మనం మహిళాక్షేమం దృష్ట్యా మహిళా సంక్షేమం దృష్ట్యా అంటూండాలి."

"అంటే యేమిటి?"

"ఏమిటో ఆ అర్థం తెలియనక్కరలేదు. అంటూంటేచాలు. పురుషులు మనల్ని వంటింటి కుందేళ్ళలా మార్చారు. "నవ సమాజంలో నవసమాజంలో స్త్రీల హక్కుల గురించి పోరాడుదాం" అంటూ మనం మాట్లాడుతూ వుంకాలి."

"ఏమిటి ఆ హక్కులు?"

"హక్కులు, గిక్కులు అవన్నీ ఎవరూ అడగరు. వేదికల మీద ఉపన్యాసాలు ఉపన్యాసాలకోసమే. స్త్రీలపై పురుషుల దౌర్జన్యాన్ని ఎదిరించాలి. పురుషుని చేతిలో స్త్రీ బానిసకారాదు. రాముడు భార్యను, చూలాల్ని అడవికి తోలాడు, హరిశ్చంద్రుడు అంగట్లో అమ్మాడు, ధర్మరాజు జూదంలో పందెంగా పెట్టాడు. ఈ పురుష జాతినుంచి మనం విముక్తి పొందాలి. ఇదే మన కార్యక్రమాలకు ఉపన్యాసాలకు సంభాషణలకు సారాంశం కావాలి."

"మా ఊళ్ళో రత్తాలు మొగుడిని కర్రతో కొడితే వాడికాలు విరిగింది. ఎంకి మొగుడిని వదిలి సుబ్బడితో పారిపోయింది. మరి వీళ్ళను కూడా మనం సమర్థించాలా? ఇక్కడకూడా మొగవాళ్ళదే తప్పా?"

రమణి ఒక్కక్షణం సందిగ్ధంగా చూచి, "యేదో తప్పు ఉందే ఉంటుంది. రత్తాలు మొగుడు ఎవరితోనో తిరుగుతూంటాడు. ఎంకి మొగుడు తాగివచ్చి దానిని ప్రతిరోజూ చితక మోదుతున్నాడు. అందుకని వాళ్ళు అలా చేశారు. ఇదిగో ఇలా ఉండాలి మన సమర్థన."

మధుమతి బుర్ర ఊపింది.

"ఐతే నేను కోటేశ్వరరావుగారి పక్కలో పడుకోకూడదంటారా? మగవాళ్ళని ఎలా అణగద్రొక్కడం?"

రమణి నవ్వి, "అందుకే మీ పల్లెటూరి చాదస్తం పోలేదన్నాను. ఇవన్నీ ఉపన్యాసాలమ్మా. అలా చెబితేగాని చప్పట్లు కొట్టరు. ఇదంతా థియరీ ప్రాక్టికల్ రేపుచూపిస్తాను వస్తారా?"

"అంటే?"

"అంటే యేంలేదు. మీరు నావెంట రండి."

"అలాగే."

మర్నాడు సాయంత్రం రమణి తన వెంట మధుమతిని ఓ మీటింగుకు తీసుకొనిపోయింది. అదేదో స్థానికసంస్థ వార్షికోత్సవం. అందులో రమణి బహుమతి ప్రధానం చేయవలసివుంది. ఆ నాడు రమణి మామూలుకన్నా ఇంకా ఫ్యాషనబుల్‌గా అలంకరించుకుంది. స్లీవ్‌లెస్ జాకెట్ వేసుకొని చంకలు, చంకలలోని వెంట్రుకలు స్తనాల ఉపరిభాగాలూ ప్రదర్శన యోగ్యంగా ఉండేటట్లు అలంకరించుకుంది. మధుమతి సన్నగా నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నారు? అనడిగింది రమణి.

"ఏరేం లేదు మా ఆయన ఒకసారి ఇలా రవికె వేసుకొని పొట్టి ఫ్రాక్ తొడుక్కొని రోడ్డుమీద పోతున్న అమ్మాయిని చూచి యేమన్నారంటే?" "దేశంలో ఇంత పత్తి పండుతున్నదే బట్టలకు ధనవంతులకు కూడా ఎందుకింత కొరత వచ్చిందబ్బా?"

రమణి చిరుకోపంతో ముక్కు చిట్లించింది. మధుమతి రమణికి కోపం రాకుండా చేయాలనుకొని "ఆయనదంతా పల్లెటూరి చాదస్తం బొత్తిగా ఫ్యాషన్లు తెలియవు" అన్నది.

రమణి, "మీరుకూడా ఇలాంటి గుడ్డలు కుట్టించుకోవాలి. అప్పుడుగానీ నవసమాజం హర్షించదు. మెత్తటి గుడ్డలుదాల్చి, మెత్తగా మాట్లాడుతూ ఉండాలి" అన్నది.

"మెత్తగా మాట్లాడటం అంటే యేమిటి? నాకు రాదే?"

"దానిదేముంది? ఎదుటివాళ్ళ మనస్సుకు నొప్పికలగకుండా సున్నితమైన పదాలు ఉపయోగించడం. మనకెవరిమీదన్నా కోపమున్నదనుకో తిట్టకూడదు. కత్తికి తేనెపూసి దెబ్బకొట్టాలి. అంతే

కాదు మందుకూడా అదే కత్తికిరాసి దెబ్బకొట్టాలి. మన మాట తియ్యని గాయం చేయాలి. మన మాటే గాయాన్ని మాన్పించాలి, మచ్చ మాత్రం మాయకూడదు."

పల్లెటూరిదాన్ని నాకంత అనుభవం లేదమ్మా."

"అనుభవమేగా అది కలిసి తిరుగుతే వస్తుంది. ఐతే ప్రస్తుతానికి ఓ పని చేయండి. చాలా తక్కువగా మాట్లాడండి. చిరునవ్వుతో, రెండుచేతులూ జోడించి నమస్కారం మాత్రం పెడుతూ థ్యాంక్యూ థ్యాంక్యూ అని మాత్రం అంటూ వుండండి. రానప్పుడు ఇంగ్లీషులో మాట్లాడాలని ప్రయత్నించవద్దు."

మధుమతికి నాగరిక సమకాలిక సమాజ జీవనపు పెద్దబాలశిక్షలో మొదటి పాఠం బట్టీ పట్టించి తనవెంట మీటింగుకు తీసుకుపోయింది రమణి.

మీటింగు చాలా హుషారుగా నడిచింది. అంత పెద్దసభలో పాల్గొనడం మధుమతికి అదేకొత్త. రమణి బహుమతి ప్రధానం చేసింది. ఆ తరువాత సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. సభానంతరం రమణి మధుమతిని అక్కడి ముఖ్యులకు పరిచయం చేసింది.

"ఈమె శ్రీమతి మధుమతి. కర్లపాలెంలో లాండ్ లార్డ్ కోటేశ్వరరావుగారి సతీమణి. అందరూ మధుమతికి ఆప్యాయంగా నమస్కరించారు. మధుమతి అందరికీ నమస్కరిస్తూ "థాంక్యూ థాంక్యూ" అన్నది.

ఒకామె, "మీరు విజయవాడలో యేంచేస్తున్నారు?" అనడిగింది ఇంగ్లీషులో.

మధుమతి నవ్వి, "థాంక్యూ" అన్నది ఇది రమణి గ్రహించింది. ఆ ప్రశ్న వేసినామెను అవతలికి పిలిచి ఇలాంటి గొప్ప జమీందారీ వంశం వాళ్ళను మనం ఎక్కువ తక్కువ ప్రశ్నలు వేయకూడదు. వాళ్ళు గౌరవంగా థాంక్యూ అంటూంటారు" అన్నది

"నిజమే నేను పొరపాటున నోరుజారి ప్రశ్నించానే ఆ తరువాత బాధపడ్డాను" అన్నది.

చాలామంది మధుమతిని తమ ఇండ్లకు ఆహ్వానించారు. మధుమతికూడా మర్యాదకు వాళ్ళను ఆహ్వానించింది. వాళ్ళలో

కొందరు కూడబలుక్కొని, "రేపు ఆదివారం మీ ఇంటికి కాఫీకి వస్తాం" అన్నారు. మధుమతి "థ్యాంక్యూ" అన్నది.

మధుమతి, రమణి ఇంటికి వెళ్ళారు.

"మీరు చాలా అదృష్టవంతులు. త్వరలోనే ఎంతమంది స్నేహితులు ఏర్పడ్డారో చూడండి" అన్నది రమణి.

"అదృష్టం సంగతి దేవుడెరుగు. ముందు వచ్చేవాళ్ళని ఎలా ఆదరించాలో చెప్పండి. నాకేమీ తెలియదు. వాళ్ళు చూస్తే చాలా గొప్పవాళ్ళలా ఉన్నారు."

"మీరు కాదా యేమిటి? నిజం చెప్పాలంటే వాళ్ళంతా నెల జీతగాళ్ళ భార్యలు నిజమైన జమీందారిణి మీరొక్కరే. సరే దాని కేమి ఇల్లు ఎలా సర్దాలో పార్టీ ఎలా ఇవ్వాలో నేను చెప్తాను. రేపు నావెంట రండి."

"అలాగే అలాగే."

చూడండి మీకు ఆత్మ విశ్వాసంలేదు. అంతే ముందుదాన్ని పెంపొంది చుకోండి. మీ గొప్పతనాన్ని మీరు గుర్తుకు తెచ్చుకోండి. అదిగో వాకిట్లో జీపు శబ్దం అయ్యింది ఆయన వచ్చినట్లున్నారు" అంటూ రమణి లేచి వెళ్ళిపోయింది.

మధుమతి వెల్లకిలా పక్కమీద పడుకుంది. ఉష పద్యాలు చదువుతూ వుంది.

"మేడిపండు చూడ మేలిమై ఉండును
పొట్ట విచ్చిచూడ పురుగులుండు...."

మధుమతికి కోపం వచ్చింది.

ఎప్పుడూ ఈ తెలుగు పద్యాలేనా. వేలు ఖర్చుపెట్టి విజయవాడలో చదివిస్తున్నది ఇంగ్లీషు నేర్చుకోవడానికి. ఇంగ్లీషుపద్యం చదువు."

"రింగా రింగా రోజెస్. పాకెట్ ఫుల్ ఆఫ్ పోజెస్ హష్షా హష్షా ఆల్ ఫెల్ డౌన్."

మధుమతి కళ్ళముందు సినిమారీళ్ళు తిరుగుతున్నాయి. పొలంలో కోటయ్య డి.డి.టి. జొన్నమొవ్వును చంపే ఈగపురుగు పై చల్లుతున్న దృశ్యం. ....సామూహిక ఎలుకల నివారణ? తానూ లక్ష్మి ఉషా కోటయ్యతో కలిసి నవ్వుకుంటూ పాడుకుంటూ

బండిలో మంగళగిరి పోతున్నదృశ్యం—; నీవు దొంగవు. నీనగలను నీవే అమ్ముకొని పుట్టింటికి చేరవేస్తున్నావు" అంటున్న కొటమ్మ:- "వాళ్ళంతా నెలజీతగాళ్ళ భార్యలు. మీరే నిజమైన జమీందారిణీ"-; "మీకు లేనిదల్లా ఆత్మవిశ్వాసమే. దాన్ని పెంపొందించుకోవాలి"; పక్క గదిలో రమణిభర్త ఇంగ్లీషు మ్యూజిక్ రికార్డు పెట్టాకు అంటే తాగుతున్నాడని అర్థం. మధుమతి ఆలోచిస్తూ నిద్రపోయింది.

మరునాడు రమణి మధుమతి బజారుకు వెళ్ళారు. రోజ్‌వుడ్ డైనింగ్ టేబిల్ ఒక సోఫాసెట్ కప్పులు సాసర్లు మొదలైన వాటికి విడివిడిగా రమణి ఆర్డరిచ్చింది. "ఫర్నిచర్ అంతా సాయంత్రానికి మా ఇంటికి పంపండి బిల్లు పే చేస్తామ్" అన్నది రమణి.

"అలాగేనమ్మా" అన్నారు ప్రొప్రయిటర్లు వినయంగా. రమణి ఠీవిగా నడుచుకుంటూ సాగిపోయింది. మధుమతి చిత్రంగా చూస్తూ రమణిని అనుసరించింది.

"పర్సులో ఎంత డబ్బుంది?" రమణి అడిగింది.

"మూడొందలు" అన్నది గర్వంగా మధుమతి.

"సరే గ్యాస్ పొయ్యికి పనికొస్తుంది. బుక్ చేద్దాం పదండి" అని మధుమతిచేత గ్యాస్‌పొయ్యి బుక్ చేయించింది.

తరువాత ఇద్దరూ హోటల్‌కెళ్ళారు.

"కొత్తవస్తువులు కొంటున్న సందర్భంలో మీరు నాకు పార్టీఇవ్వాలి" అన్నది రమణి.

"తప్పకుండా తప్పకుండా"

"తప్పకుండా తప్పకుండా అనకూడదు. ష్యూర్ ష్యూర్ అనాలి.

"సూర్ సూర్"

కాదు. ష్యూర్ ష్యూర్"

"ఎలాగా ష్యూర్ ష్యూర్."

రమణి నవ్వింది. "మీరొక ఇంగ్లీషు టీచరును పెట్టుకోవాలి. మీ అమ్మాయితోపాటు మీరూ స్పెల్లింగు ప్రొనౌన్‌సియేషను కాన్వర్‌సేషను నేర్చుకోవాలి."

సర్వర్ బాసంది గులాబ్ జామ్ తెచ్చాడు. మధుమతి "నాకు పెసరట్టంటే ఇష్టం" అన్నది.

రమణి, "రెండు పెసరట్ రోస్ట్" అన్నది.

మధుమతి, "నాకు పెసరట్టు చాలు. రోస్టు తినలేనుఅన్నది.

రమణి "అలాగే" అన్నది చిరునవ్వు నవ్వుతూ.

"మరీ ఎక్కువ పదార్థాలు తినలేను తెప్పించుకుని వదిలేయడం ఎందుకు హేస్టు"

రమణి, "హేస్టు కాదు వేస్టు" అన్నది.

సర్వరు టిఫిన్ తెచ్చి ఇచ్చాడు.

"రోస్టు ఆమెకివ్వు" అన్నది మధుమతి.

"రెండూ రోస్టులేనమ్మా" అన్నాడు సర్వరు.

సర్వరు వెళ్ళాక, "రోస్టు అనేది ఒక టిఫిన్ కాదు. బాగా దోసెను కాల్చమని అర్థం" అని వివరించింది రమణి.

"నాకు తెలియదమ్మా. చూశావా ఎంత అవమానం తప్పిపోయిందో" అన్నది మధుమతి.

సర్వరు బిల్లు తెచ్చి ఇచ్చాడు.

మధుమతి రూపాయితీసి అందులో పెట్టింది. రమణి ప్రశ్నార్థకంగా చూసింది.

"బిల్లు పోగా మిగతాది ఇమ్మనండి" అన్నది మధుమతి.

"మనం వచ్చింది పోష్ హోటలు. ఇక్కడ పెసరట్టు ఖరీదు యాభై పైసలు. స్వీటు ఖరీదు యాభై పైసలు. మొత్తం మూడు రూపాయల ఎనభై పైసలు అయ్యింది."

"అదేమిటి, మా ఊళ్ళో అర్ధణా పెడితే పెసరట్టు, అల్లం చట్నీ ఇస్తాడు, అది దీనికంటే ఇంకా రుచిగా ఉంటుంది."

"నిజమే. ఆ చెట్టుకింది అర్ధణా పెసరట్టే హోటల్లో సర్వు చేస్తే యాభై పైసలు అవుతుంది."

మధుమతి ఐదురూపాయల నోటుతీసి "చిల్లర తెప్పించండి" అన్నది.

రమణి నవ్వి, "పోదాం పదండి. చిల్లర అడగకూడదు."

"అయ్యో, ఆ మిగిలిన డబ్బులో?"

"అది సర్వర్ తీసుకుంటాడు. దాన్ని టిప్ అంటారు."

"అదేమిటి, వాళ్ళకు జీతాలుండవా?"

"ఉంటాయి. కానీ అలా వదలడం స్టైలు. మీరు బాగా స్టైలు నేర్చుకోవాలి."

సాయంత్రానికి ఫర్నిచర్ వచ్చింది. పన్నెండు వందల అరవై రూపాయలకు బిల్లు వచ్చింది.

"ఇదిగో, బిల్లు వచ్చింది. పే చేయండి. పన్నెండు వందల అరవై.

"అంత మొత్తమా? ఎక్కడిది?"

"మీరు జమీందారిణులు. అలా అనకూడదు. డబ్బులేకుంటే బంగారం ఇలా ఇవ్వండి. బిల్లు పే చేసి, మిగిలింది రేపు ఆదివారం పార్టీకి ఖర్చుపెడదాం."

మధుమతికి ఏం మాట్లాడాలో తెలియక ఇంట్లోకి పోయింది.

ఆ మరునాడు కోటేశ్వరరావు వచ్చాడు. భర్త రాగానే మధుమతికి కొండంత ధైర్యం వచ్చింది.

"వచ్చావుటయ్యా! ఈ సమస్యని ఎట్లా పరిష్కరించాలో తెలియక నేను తికమక పడిపోతున్నాను. ఇదిగో యీ సామాన్లు చూడు" అని ఒక్కొక్కటే చూపించింది. కోటేశ్వరరావు ఏమీ మాట్లాడలేదు.

"ఇంత చక్కటి వస్తువులు తెప్పించి గదంతా సర్దితే, 'ఎక్కడినుంచి కొన్నావు? ఎంత ఖరీదైంది?' అని కూడా కనీసం అడగలేదే!"

"అదిగాదు మల్లమ్మా?"

"అది కాదు- ముందు మీరీ మాట వినండి. రమణిగారు దగ్గరుండి ఇవన్నీ కొనిపించారు. వీటి ఖరీదు మరీ అంత ఎక్కువ కాదనుకో. పన్నెండు వందల చిల్లర. అన్నట్లు నీకింకో విషయం చెప్పనా మనకు గ్యాసు పొయ్యి వచ్చింది. గ్యాసు మీద వంట కూడా నేర్చుకున్నాను."

"మల్లమ్మా, కర్మ పాలెంలో....."

"ఉష్, నా మాట వినండి. నా దగ్గరున్న డబ్బు గ్యాసుకు

పెట్టేశాను. మనమీ ఫర్నిచర్ బిల్లు మాత్రం పే చేయాలి. 'పే' అంటే డబ్బు కట్టడం."

"మల్లమ్మా! ముసలమ్మ ఆరోగ్యం యేమీ బాగాలేదు...."

మధుమతి మధ్యలోనే అందుకొని, "బాగా లేకుంటే బస్తీ నుంచి మందులు తీసుకెళ్ళు. ముందు మనమీ బిల్లు కట్టాలి ఇవ్వాళే. ఎంత తెచ్చావు?"

"నేను చెప్పేది కొంచెం వింటావా?" కోటయ్య కసురుకున్నాడు.

"ముసలమ్మకు బొత్తిగా బాగాలేదు. ఉషా ఉషా అని కలవరిస్తున్నది. దానిని వదిలి ఎప్పుడూ ఉండలేదు. అట్లా మమకారం పెంచుకున్నది. ఇప్పుడు పరిస్థితి మరీ విషమించింది నీవు మాట్లాడకుండా బయలుదేరాలి."

మధుమతి ఒక్క క్షణం మౌనం వహించింది.

"అసలుకన్నా వడ్డీ ముద్దుట. నామీద లేని ప్రేమ దానిమీద ఎందుకో! ఔనులే, నేను ఎంతైనా పరాయమ్మ కన్నదానిని. ఎట్లా ఉంటుంది? అదంటే తన కొడుకు కూతురుగా."

"మల్లమ్మా! మాటల కిది సమయంకాదు. అక్కడ ముసలిది చావుబ్రతుకులలో ఉంది. పట్టింపులవల్ల అంతా నష్టపోతారు."

"నిజమేలే.నీరు పల్లానికే పారుతుంది. ఇంత జరిగినా నువ్వు తల్లినే వెనకేసుకొస్తున్నావు. కావాలంటే ఉషను తీసుకొని వెళ్ళు. రేపు ఆదివారం నేను ఊళ్ళో పెద్ద పెద్దవాళ్ళని పార్టీకి పిలిచాను. అందరినీ రమ్మని నేను పల్లెకు పారిపోతే నాపరువు ఏమౌతుంది?"

కోటయ్యకు బాగా కోపం వచ్చింది. కళ్ళల్లో ఎర్రజీరలు కనపడ్డాయి. అయితే మల్లమ్మ కూడా తగ్గలేదు. ఆమె చెంపలు కెంపులైనాయి.

"వస్తావా? రావా?"

"రాను. కావాలంటే ఆమె మనుమరాలిని తీసుకొని పో."

"ఇంత పశుత్వమా?"

"పశువుల మధ్య పేడ పిసుక్కునే నాకు పశుత్వమే తెలుసు. వేరే యేం తెలుస్తుంది?"

కోటయ్య గరళ కంఠుడైనాడు. కోపాన్ని మింగలేదు, కక్కలేదు. గొంతులోనే దాచుకున్నాడు. ఉషను తీసుకొని వెళ్ళి పోయాడు.

ఆదివారంనాడు పార్టీ అనుకున్న ప్రకారం జరిగింది.వచ్చిన వాళ్ళంతా మధుమతి గొప్పతనాన్ని ప్రశంసించారు. మధుమతినీ, రమణిని అందరూ తమ తమ ఇండ్లకు ఆహ్వానించారు, రమణి మధుమతిని చాటుకు పిలిచి "బిల్లు ఇవ్వలేదని వాళ్ళు ఇప్పటికి రెండుసార్లు తిరిగి పోయారు" అన్నది.

మధుమతి "ప్రస్తుతానికి ఈ బంగారం అమ్మి బాకీ తీర్చండి. మా ఆయన ఊరి నుంచి డబ్బు తేవడం మర్చిపోయారు. నాకూ ఈ మోడల్ నచ్చలేదు. ఎటుతిరిగీ మామిడి పిందెల నెక్లెస్ చేయించాలనుకుంటున్నాను" అని చెప్పింది.

ఆరాత్రి బాగా పొద్దుపోయాక సూర్యం వచ్చాడు. వాడికళ్ళు యేడ్చి యేడ్చి కాయలు కాచినట్లు ఉన్నాయి.

"అమ్మ పోయింది వదినా! 'కోడలుపిల్ల యేదీ? యేదీ?' అంటూ ప్రాణం వదిలింది. నిన్ను అర్జంటుగా అన్నయ్య పిలుచుకొని రమ్మన్నాడు" అని చెప్పాడు వెక్కి వెక్కి యేడుస్తూ.

# 8

కాలం పరుగెత్తి పోయింది. కోటేశ్వరరావు ఇప్పుడు విజయవాడలో ఎరువుల వ్యాపారం ప్రారంభించాడు. చదువుకున్న వాడిని మేనేజరుగా పెట్టుకున్నాడు. అతని పేరు మునుస్వామి. మునుస్వామి బాగా తెలివైన ఘటం. మద్రాసుకు వెళ్ళి యెవరిని పట్టాలో, ఎట్లా వ్యాపారం సాగించాలో బాగా తెలుసు. కొంతకాలం పాటు కోటేశ్వరరావు ఇటు పొలాలూ, అటు వ్యాపారమూ కూడా తనే చూసుకున్నాడు. కానీ రెండూ కష్టమైపోతున్నది. ఆ సంవత్సరం భాస్వరం లోపించి వరిపైరు గిడసబారి పోయింది. హెక్టరుకు కనీసం యాభై కిలోల భాస్వరం దమ్ములో వేయాలి, నాటిన ముప్పైరోజులలోపలే ఈ పని చేయాలి. కానీ పాలేరులు అశ్రద్ధ చేశారు. తరువాత మేలుకొని హడావుడి పడ్డారుకానీ, మంచి దిగుబడి రాలేదు.

మధుమతి ఈనాడు విజయవాడలోని ప్రముఖులలో ఒకరై. బాగా ఉపన్యాసం చెప్పటం కూడా నేర్చుకుంది. తనలో ఇంత ప్రజ్ఞ దాగిఉందని తనకే తెలియదు. నగరంలో యే బెనిఫిట్ షో జరిగినా వాళ్ళు మధుమతి దగ్గరకు రావలసిందే. మధుమతి విరాళం టిక్కెట్లు కొనాల్సిందే. మధుమతి స్టేటస్ ఇప్పుడు బాగా పెరిగింది. ఆమెనంతా జమీందారుగారి భార్య అనే పిలుస్తుంటారు. అంతస్తుకు తగ్గట్టు మధుమతి ఒక బంగళాను అద్దెకు తీసుకుంది. సూర్యం కూడా యిప్పుడు మధుమతి దగ్గరే వుంటున్నాడు. సూర్యాన్ని కూడా ట్యుటోరియల్ కాలేజీలో చేర్పించారు. అయితే బస్తీకి రావటంవల్ల వాడికి చదువు అబ్బలేదుగానీ, సినిమాలు, షోకులు అబ్బాయి.

మధుమతి ఈ ఖర్చులను తట్టుకోవడం కోసం భర్తను పొలం అమ్మమని కోరింది. కోటేశ్వరరావుకి కోపం వచ్చింది.

"ఎందుకమ్మాలిట?" అని అడిగాడు.

"ఈ ఖర్చులకోసం."

"ఎందుకింత ఖర్చులు?"

"అదేమిటి డియర్! నువ్విట్లా అంటే యేం బాగుంటుంది? మనకిప్పుడు బస్తీలో జమీందారుగారి భార్య అని చాలా మంచి పేరు ఉంది. ఆ స్టేటస్ పోతే ఇంకేమైనా ఉందా?"

"చూడు మల్లమ్మా...."

"నన్నలా పిలవవద్దని లోగడ చెప్పాను. నా పేరు రాణీ మధుమతీదేవి."

"నువ్వు ఏ వూరికి రాణివే?"

"నీ హృదయానికి రాణిని. చాలుకదా. ఇంక పో. వెళ్ళి రెండెకరాల పొలం అమ్మి డబ్బు తీసుకురా."

"మల్లమ్మా, నువ్వేం చేస్తున్నావో నీకు తెలుసునా మల్లమ్మా?"

"ఆ, బాగా తెలుసు. నాతో కలెక్టరు భార్య, పోలీసాఫీసరు భార్య క్లబ్బులో కార్డ్సు ఆడతారు తెలుసునా? నేనింకా కర్లపాలెం మల్లమ్మ ననుకున్నావా? వెళ్ళి డబ్బు తీసుకురా."

"ఇంకొక్క కానీ కూడా ఇవ్వను. యేం చేస్తావో చేసుకో."

"మంచిది. పెనుమాక దగ్గర దిగుడిలో పసుపుతోట నా స్త్రీ ధనం ఉంది. దాని కెవరూ సంతకాలు పెట్టనక్కరలేదు. వెళ్ళి బేరం పెట్టు."

"మల్లమ్మా! నీకేమైనా వెర్రెత్తిందా? పోయిన పొలం మళ్ళీ వస్తుందా?"

"పోయిన పొలం మళ్ళీ రాదు. కానీ పోయిన స్టేటస్ మళ్ళీ వస్తుందా? ఇదంతా నా స్వార్థం కోసమే నన్నట్లు నీ వెందుకాలోచిస్తున్నావో నాకు అర్థంకావడంలేదు. నీ ఎరువుల వ్యాపారానికి నా పలుకుబడి మొత్తం పెట్టుబడి. ఈ గుడ్‌విల్‌తో, పెద్దల పరిచయంతో నీవు లక్షలు గడించవచ్చు."

మధుమతి తెలివికి కోటయ్య దిగ్భ్రాంతుడైనాడు. మల్లమ్మ యీనాడు బస్తీ మోజులో, రంగుల వలలో పడింది. కానీ దానికొక అందమయిన బురఖా కూడా కప్పింది. తాను బేరం పెట్టకపోతే, స్వయంగా పెనుమాక వెళ్ళి మధుమతి వచ్చినకాడికి తెగనమ్ముకొని రాగలదు. ఆ నష్టం కూడా ఎందుకు?

వెళ్ళి బేరం పెట్టాడు.

"ఎందుకమ్ముతున్నట్లు?" అక్కడి వాళ్ళంతా అడిగారు.

"నా కూతురిని, తమ్ముడిని బస్తీలో పెద్ద చదువుల్లో చేర్పించాం. పైగా బస్తీలో మేడ కట్టాలనే కోరిక కూడా వుంది. ఎరువుల వ్యాపారం సరేసరి. ఈ పెట్టుబడిని అటు మరలించాలని నా ఉద్దేశ్యం." కోటయ్య కల్పించి చెప్పిన సమాధానం బాగా అతికినట్లయింది. పొలం అమ్మి డబ్బు తెచ్చి విజయవాడలో బ్యాంకులో పెట్టాడు.

మధుమతికి నెల తప్పింది. అది విని కోటేశ్వరరావు సంతోషించాడు.

"బహుశా చచ్చిన మా అమ్మ నీ కడుపున పుట్టాలని అనుకున్నదో ఏమో" అన్నాడు.

కోటేశ్వరరావు మిఠాయి పంచాడు. సూర్యం అడగకుండానే డబ్బులిచ్చి వాడిని సినిమాకు పొమ్మన్నాడు. మధుమతి ఈ వార్తను

కమలాక్షితో చెప్పింది. కమలాక్షి లాయరు గోవిందరావుగారి రెండో భార్య. గోవిందరావు చాలా పలుకుబడిగల లాయరు. క్లబ్బుకు కమలాక్షి ప్రెసిడెంటు అయితే, మధుమతి సెక్రటరీ.

కమలాక్షి అది విని నవ్వింది.

"అయితే క్లబ్బు సభ్యులందరూ కలిసి శ్రీమంతం చేయించి గాజులు వేయించి, విందూ వినోదం చేసుకోవాలి" అన్నది.

కమలాక్షికి ఇలాంటి మత సంప్రదాయాల మీద విశ్వాసం లేదు. అలాంటిది ఆమె తనకు క్లబ్బు తరఫున శ్రీమంతం చేయిస్తానని అంటే ఇదేదో వ్యంగ్యంగా అన్నదని అనుకున్నది మధుమతి.

"మిసెస్ కమలాక్షీ! మీరు అంటున్నది తమాషాకా? నిజానికా?"

"ఓహో! ఐతే ప్రగతి మహిళా మండలి కార్యదర్శికి నిజంగానే శ్రీమంతం చేయించుకోవాలన్న కోరిక ఉన్నదన్న మాట."

"ఇందులో నే చేసిన తప్పేమిటి?"

"తప్పా, తప్పున్నరా! మగవాడికి పిల్లల్ని కని ఇవ్వడమే తప్పు. యుగయుగాలుగా పురుషుడు మనల్ని విలాసవస్తువుగా చేసి ఆడుకుంటున్నాడు. పశువును తాడుతో కట్టేసినట్లు, పురుషుడు స్త్రీని పసుపుతాడుతో పదుగురిముందూ పెళ్ళితంతులో కట్టేసి గుంజకు పోయి బానిసను చేసుకుంటున్నాడు. ఇది తప్పన్న స్మృతికర్త ఒక్కడూ లేడు. ఎందుకంటే వాళ్ళంతా కూడా మగవాళ్ళేగా. మగవాడి పశుత్వానికి స్త్రీ బలై పోతున్నది. పాశవికమైన అతని కామ వాంఛకు నలిగిపోతున్నది. 'అయ్యో, నా మొగుడికి నేను లొంగి పోయాను' అని చెప్పుకోవడానికి చిహ్నమా అన్నట్లు సిగ్గులేకుండా ఆడవాళ్ళు పొట్టేసుకొని వీధుల్లో తిరుగుతూఉంటారు. కార్యదర్శివి, పదిమందికీ మహిళా ప్రగతిని గురించి ఉపన్యసించవలసిన దానివి నీవు చేయవలసిన పని కాదిది."

మధుమతి సిగ్గుపడ్డది.

"అయితే నన్నిప్పు డేం చేయమంటారు?"

"అని ప్రత్యేకంగా అడగాలా యేం చేయాలో హాస్పటల్‌కి పో, వాళ్ళే చెపుతారు."

మధుమతి గుండె ఒకసారి ఝల్లుమంది. ఆమెలోని మాతృత్వం అవ్యక్తంగా మూల్గింది.

"మిస్టర్ కోటేశ్వరరావుగారు తన చచ్చిన తల్లే నా కడుపున పుడుతున్నదని అనుకుంటున్నాడు."

"అయితే ఇంకా మంచిది. మగవాడికి ఆ సంతృప్తి లేకుండా చేయడం, మనమలా చేస్తే దానికి వాడు బాధపడుతుంటే దాన్ని చూచి మనం ఆనందించడంలో ఎంత థ్రిల్ ఉంది!"

మధుమతి ఏమీ మాట్లాడలేదు.

"పోనీ మధుమతీ, ఇంకో రకంగా ఆలోచించు. ఈ శరీరం సుఖాన్ని అనుభవించడాని కోసం పుట్టింది. సుఖానుభవం స్త్రీకి, పురుషునికి సమానమే. కానీ అనుభవం పురుషునిది. అందుకు శిక్ష స్త్రీది అవుతున్నది. కడుపుతో ఉండటం, వేవిళ్ళు పడటం, నవ మాసాలు మొయ్యటం, డెలివరీ అయ్యిన తరువాత ఆ శిశువు మల మూత్రాలను భరించటం - ఇదంతా స్త్రీ నెత్తిమీద పడుతున్నది. ఈ సృష్టిని పుట్టించే ఒక శక్తి ఉన్నదో లేదో నాకు తెలియదు. ఉంటే తప్పకుండా అది మగవాడే అయివుండాలి. లేకుంటే సృష్టి నిర్మాణంలోనే ఇంత పక్షపాతం జరగదు."

మధుమతి కనుబొమ్మలు ముడిపడ్డాయి. తీవ్రంగా ఆలోచిస్తున్నది.

"దీనికింత ఆలోచన ఎందుకు- వెళ్ళి అబార్షన్ చేయించుకో."

మధుమతి వెళ్ళిపోయింది - కమలాక్షి దగ్గర సెలవు తీసుకొని.

కోటేశ్వరరావు వారం రోజులకు గానీ విజయవాడకు రాలేదు. అర్జంటుగా రావలసిందిగా పాలేరులు కర్లపాలెం నుంచి కబురు పెట్టారు. కోటేశ్వరరావు వెళ్ళి పొలాలు చూచాడు. పొలం అంతా ఎండిపోయినట్లుగా ఉంది.

"ఇదేమిట్రా?"

"యేం చెప్పం దొరా! తాటాకు తెగులు తగులుకొంది."

కోటేశ్వరరావు పరిశీలించి చూశాడు. నిజమే, హిస్పా తెగులు పట్టింది. ఈ పురుగు లేతపసుపురంగులో ఉంటుంది. పెరుగుతున్నకొద్దీ నీలం నలుపు రంగులోకి మారుతుంది. పైరు చివరినుండి మొదలుకు వస్తుంటాయి. ఆకులోని పచ్చని పదార్థాన్ని తింటూ పెరుగుతాయి.

"ఇదేందిరా రత్తయ్యా, ఇంత పురుగు పట్టింది?"

"దానమ్మ- నాయాల్ది దేవుడు అట్లా సృష్టించి పెట్టినాడు బాబూ. ఒక మగపురుగు, ఒక ఆడపురుగు కలిస్తే వారంరోజుల్లో హెక్టారు పొలంలో లక్షలకు పెరుగుతాయి. పురుగు పుట్రా అన్నీ ప్రాణంమీది ఆశతో బ్రతికి తన సంతతిని పెంచుకోవాలని ప్రయత్నిస్తుంటాయి. మనిషికి మాత్రమే బాబూ ఈ మాయరోగం- తోటి మనిషిని చంపాలని కోరిక."

కోటేశ్వరరావు వెంటనే బి. హెచ్. సి. పొడి పదిశాతం ముప్పై కిలోలు తెప్పించాడు. క్వినల్‌ఫాస్ వెయ్యిన్నర మిల్లీ లీటర్లు తెప్పించాడు. ఫెంత్రియాన్ కూడా వాడాడు. గుణం కనిపించింది. అయితే అనుకున్నదానికన్నా ఆలశ్యంగా, పురుగు మాడుముఖం పట్టింది.

"బాబూ! మనం తెచ్చిన మందు కల్తీది. లేకుంటే తాటాకు తెగులుకు ఇన్ని మందులెందుకండీ? మనిషి బ్రతుకులాగే మందులు కూడా కల్తీపై పోయినాయండీ."

కోటయ్య తగిన శ్రద్ధలన్నీ తీసుకున్నాడు.

"బాబూ! నే నో మాట చెపుతాను - మీరేం అనుకోకండి" అన్నాడు రత్తయ్య.

"యేమిట్రా అది?"

"యేం లేదండి. పట్నంలో వుంటూ పాలేర్లతోవ్యవసాయం చేయించటం లాభసాటి గాదండీ. పొలాలన్నీ కౌళ్ళ కిచ్చేయండి. పట్నంలో బిజినెస్ మీద మీరు కూకోవచ్చు. అప్పుడీ జంజాటం అంతా ఉండదు. మీరు ఇస్తామంటే, ముందే డబ్బు దోసిట్లోకి పోసి చేలోకి దిగుతారు కౌలుదార్లు."

కోటేశ్వరరావు యేమీ మాట్లాడలేదు.

"బాబూ! పడమటి పొలంలో వరి గిడసబారిపోయిందండీ. మళ్ళీ ఆముదాలున్నాయా, ఆ యేసేబుగాడు భాస్వరాన్ని నేలమీద చల్లి పోయినాడండీ. నేనుమొత్తుకుంటూనేఅన్నా "లోతుగా మందులేసి రారా అని. దొంగ వెధవ"

కోటేశ్వరరావు బాధ పడ్డాడు. ఆముదానికి హెక్టారుకు అరవై కిలోల భాస్వరం నత్రజని పొటాష్ వాడాలి భూమి మీద చల్లనే కూడదు. కనీసం పదిహేను సెంటీమీటర్ల లోతున వేయాలి. తాను రైతుల మీద వదిలితే వాళ్ళు కూలీవాళ్ళమీద వదిలితే వందల కొలది రూపాయల మందు ఇట్లా మట్టిపాలౌతున్నది.

"షల్లైనా ఇల్లాలైనా పొలమైనా గొడ్డయినా ఒకడి పెత్తసం మీదనే నడిచిపోతుండాలండీ లేకుంటే ఇదే రభస" రత్తయ్య నీతులు పల్లిస్తూ కుంటలోకి దిగి కాళ్లూ చేతులూ కడుక్కున్నాడు.

"చూడు నన్ను మాటిమాటికీ పిలవకండీ. నేను విజయవాడ, చెన్నపట్నం చుట్టు తిరగవలసి వస్తున్నది. మెల్లగా మీరే సర్దుకు పోతూ వుండండి. ఈ పొలాల మీద వచ్చి చచ్చేదేమీ లేదుగానీ కనీసం ఆ బిజినెస్సన్నా సరిగ్గా నడవనివ్వండి" కోటేశ్వరరావు తగిన కట్టుబాట్లన్నీ చేసి బస్తీకి వెళ్ళాడు. ఇంటికి పోయేసరికి సూర్యం, ఉషకు అన్నం పెడుతున్నాడు.

"మీ అమ్మేదే. మీటింగుకు పోయిందా ఏమిటి?"

"హస్పటల్ నుంచి ఇంకా రాలేదు డాడీ."

"హాస్పటలా? ఎందుకు?"

"ఏమో మూడురోజులైంది"

కోటేశ్వరరావు అడ్రస్ తెలుసుకొని హస్పటల్ కెళ్ళాడు. మధుమతి మంచం మీద పడుకొని వుంది. చాలా నీరసంగా ఉంది.

"ఏమైంది మధుమతీ" కోటేశ్వరరావు ఆదుర్దాగా ప్రశ్నించాడు.

మధుమతి బలహీనంగా నవ్వింది.

"ఎందుకు నిన్ను హస్పటల్లో చేర్పించారు?"

"ఎబార్షనైంది. నాలుగు రోజులు బెడ్ మీద నుంచి కదలవద్దన్నారు. లెటర్స్ ఏమన్నా వచ్చాయా?"

"తెలియదు"

"కనుక్కొండి. ప్రగతి మహిళా మండలి వార్షికోత్సవా నికి పెద్దవాళ్ళ దగ్గరి నుంచి గ్రీటింగ్స్ వచ్చి వుంటాయి. అవన్నీ సావనీర్ లో రావాలి. నాలుగు రోజులు నేను హస్పటల్లో ఉంటే అక్కడ పనంతా అస్తవ్యస్తం అయిపోతున్నది. క్లబ్బులో. మీరు కనపడలేదేమిటి? మద్రాసు పోయినారా?"

"లేదు పొలానికి హిస్సా తెగులు పడితేనూ వెళ్ళి మందులు వేసి వచ్చాను. ఐతే ఇంటికి ఎప్పుడు పంపిస్తారట?"

"రేపొద్దున డిస్చార్జి చేస్తారు. వెళ్ళి బిల్లుకట్టి రండి"

కోటయ్య వెళ్ళి లేడీ డాక్టర్ను కలుసుకున్నాడు.

"మీరింకా అదృష్టవంతులు కోటేశ్వరరావుగారూ తల్లి ప్రాణం దక్కింది. మధుమతీదేవిగారు ఏవో నాటు మందులు మింగి ప్రాణం మీదికి తెచ్చుకున్నారు. కొంచెం ఆలస్యమైతే మేం కూడా సేవ్ చేయలేక పోయేవాళ్ళం."

కోటేశ్వరరావుకి జరిగిందేమిటో అర్థమైపోయింది.

స్వయంగా మధుమతి మందులు మింగి ఎబార్షన్ చేసుకున్న దన్న మాట. కోటేశ్వరరావుకు కన్నులు చెమ్మగిల్లాయి. తన పట్టింట్లో తన తల్లి తిరుగుతుందనుకున్నాడు. లేదా ఓ కోడె దూడ పుడుతుందనుకున్నాడు. అలాంటిది మధుమతి ఎంత పనిచేసింది, ఉషనోట్లో సూర్యం అన్నం కలిపి పెడుతున్న దృశ్యం గుర్తుకు వచ్చింది.

"మనిషికి మాత్రమే బాబూ ఈ మాయ రోగం. తోటి మనిషిని చంపాలని కోరిక మనిషికిమాత్రమే బాబూ ఈ మాయ రోగం, తోటి మనిషిని చంపాలని కోరిక. రత్తయ్యమాటలు కోటే శ్వరరావు చెవుల్లో రింగుమంటున్నాయి. ఇంట్లో పిల్లలు ఎలా వున్నారని ఏం తింటున్నారనీ కూడా అడగలేదు. వార్షికోత్సవం గ్రీటింగ్స్ గురించి అడిగింది.

కోటయ్య ఓ విస్కీ బాటిల్ తీసుకుపోయి మొత్తంసీసా తాగి గట్టిగా కళ్లు మూసుకొని పడుకున్నాడు.

# 9

ప్రగతి మహిళామండలివారు మద్రాసు మహాబలిపురానికి ఎక్స్‌కర్షన్ పెట్టారు. కమలాక్షి భర్త లాయర్ గోవిందరావు స్వయంగా ఏర్పాట్లన్నీ చేసిపెట్టాడు.

"పాపం మీ ఆయనకి స్త్రీలంటే ఎంత అభిమానం.?" అన్నది మధుమతి.

"అభిమానమూ గాదు, గాడిదగుడ్డూ కాదు ఆడవాళ్ళంటే ఆయనకు మోజు. పూటకొక త్తితో సరసాలాడటం ఆయన హాబీ" అన్నది కమలాక్షి.

"మీకు కోపం రాలేదా ఆయన ప్రవర్తనకు"

"ఎందుకు? ఆయన సత్యవంతుడూ కాదు. నేను సతీ సావిత్రీ కాదు. ఐ హేట్ దీస్ సెంటిమెంటల్ ఫూల్స్. కామం అనేది ఒక శారీరక ధర్మం. ఆయనకవసరమైనపుడు ఆయన దానిని తీర్చుకునే అధికారం ఆయనకుంది. పైగా పండగనాడూ పాత పెళ్ళామేనా అన్నట్లు కళ ఆనందం వైవిధ్యంలో లభిస్తుంది. గాలీ, నీరూ, నిప్పూ లాగే సౌందర్యం కూడా ప్రకృతిలో ఎంతో ఉంది. దానిమీద యే ఒక్కడికీ అధికారం లేదు. అది ఉమ్మడి సొత్తు"

"ఇది స్త్రీకి, పురుషుడికీ ఇరువురికీ వర్తిస్తుందా?"

కమలాక్షి నవ్వి పురుషులేం రెండు కొమ్ములు పెట్టుకొని పుట్టలేదు. గోవిందరావు వైదేహితో తిరుగుతాడనీ, మిసెస్ జేమ్స్‌ను తన వెంట పూటీకి తీసుకెళ్ళాడనీ నాకు తెల్సు. అందుకు నేను జెలసీగా ఫీలవ్వవలసిన అవసరం కూడా లేదు. ఆయన కోరికలాయనవి. ఆయన సరదాలాయనవి. వాళ్ళ క్లబ్బులో పది మంది స్నేహితులు కలసి ఫ్రీ లా సొసైటీ స్థాపించారు. దానికి మిస్టర్ గోవిందరావు ఉపాధ్యక్షుడు. ఒక కాక్‌టెయిల్ పార్టీ యేర్పాటు చేసి ఆనాడు భార్యలను ఎక్స్ఛేంజ్ చేసుకున్నారు"

"మీరు వెళ్ళారా?"

"వెళ్ళాను. ఖర్మ ఆనాడు నా పాలిటికి ఓ యంగ్ లాయర్ సుధీర్ పడ్డాడు. మరీ వయసు తక్కువ. యేమీ చేతకాదు. అయితే

ఆ సుధీర్ భార్య ఓ ముసలివాడి పాల్బడ్డది. బలే థ్రిల్,తమాషాగా ఉందనుకో ఆ రాత్రి." కమలాక్షి విరగబడి నవ్వింది.

మధుమతి నవ్వు కలిపింది.

అంతా స్పెషల్ బస్‌లో మద్రాస్, మహాబలిపురం బయలు దేరారు. హెల్పర్స్‌గా మగవాళ్లను తీసుకురావలసిన బాధ్యత కమలాక్షి, మధుమతులమీద పడ్డది.

"మా ఆయనో పాత చింతకాయ పచ్చడి. ఆయన రాడు. వచ్చి ప్రయోజనమూ లేదు. మిస్టర్ గోవిందరావును తీసుకొని రండి" అన్నది మధుమతి.

"దానికేం ఎగురుకుంటూ వస్తాడు' ఇంతమంది ఆడవాళ్ళను చూస్తే ఆయనకు పండగ" అని నవ్వింది కమలాక్షి.

గోవిందరావు ఒకరోజు ముందే వెళ్ళి మద్రాసు, మహాబలి పురాలలో వీళ్లకు కావలసిన యేర్పాట్లు చేసేటట్లు నిశ్చయమైంది.

కోలాహలంగా బస్సు బయలుదేరింది.

గుంటూరు, చిలకలూరిపేట, మేదరమిట్ల, ఒంగోలు మీదుగా బస్సు సాగిపోయింది.

త్రోవలో వింతలూ విశేషాలు చూచుకుంటూ వెళ్ళాలనేది వాళ్ల సంకల్పం. నెల్లూరు చేరేసరికి సాయంకాలం అయ్యింది. ట్రంకు రోడ్డులో భోజనం చేశారు. కొందరు మైపాడు బీచ్ చూస్తామని పట్టుబట్టారు.

"మెరీనా చూడబోతూ మైపాడు ఎందుకే వెర్రిమొహాల్లారా" అన్నారు కొందరు.

"అసలే అక్కడ ప్రొటెక్షన్ తక్కువట" డ్రైవర్‌తప్ప వెంట ఇంకెవరూ లేరు. రేప్ చేసినా దిక్కులేదు. అన్నదొకామె.

"ఆ చీకట్లో ఎవరో మనల్ని రేప్ చేయాలి. మనం గిజగిజ లాడాలి. అప్పుడు చూడు ఎంత థ్రిల్ వుంటుందో అందుకే నేను మైపాడు పోవాలనడం"

అందరూ చప్పట్లు కొట్టారు. 'హిప్ హిప్ హుర్రే' అన్నారు. బండి మొత్తం నవ్వుల రథంగా మారిపోయింది.

"రాత్రికి మనకు నెల్లూరులో జర్నీ బ్రేక్. కావలసినవాళ్ళు బస్సులో వెళ్లి మైపాడు చూసిరండి" అన్నది కమలాక్షి టీమ్ లీడర్.

కొందరు బస్సులో మైపాడు పోయారు. ఆనాడు పున్నమి. సముద్రంలో చంద్రోదయం చూడాలని వాళ్ళకోరిక. మిగిలిన వాళ్ళు హైస్కూల్ వద్ద విశ్రాంతి తీసుకున్నారు. కొంతమంది రంగనాథస్వామి గుడిని చూసి వచ్చారు. మధుమతి కూడా వెళ్ళింది.

"దేవాలయం మీద బూతుబొమ్మ లెందుకు ?" ఒకతి ప్రశ్నించింది.

"ఎందుకంటే దేవాలయం చూడగానే మనకి మంచిగా కామ భావాలు కలగాలి" అని సమాధానం చెప్పింది కమలాక్షి.

అది విని అంతా నవ్వారు.

ఆ రాత్రి చాలా పొద్దుపోయే వరకూ అంతా చీట్లాడుకుంటూ సరదాగా గడిపారు. దాదాపు పదిగంటలకు బీచికి పోయినవాళ్ళు వచ్చారు.

"వెన్నెలా సముద్రమూ బాగానే ఉంది గానీ అక్కడ ఒక్క రేప్ సీన్ కూడా లేదే" అన్నది వెళ్ళొచ్చిన వాళ్లలో ఒకతె.

అందరికీ నిద్రలొస్తున్నాయి.

"అంతా బస్సులో సీట్లలో నిద్రపొండమ్మా. లేచేసరికల్లా మద్రాసులో ఉంటారు" అన్నాడు డ్రైవర్.

నిజమే టైమ్ వేస్ట్ ఎందుకు ?" అనుకున్నారు.

అంతా బస్సులో కునిపాట్లు పడసాగారు.

తెల్లవారు జాముకే బస్సు మద్రాసు చేరుకుంది. పెర్రీస్ వద్ద పెంగ్విన్ హోటల్లో గోవిందరావు ఒక పెద్ద హాలు బుక్ చేశాడు. అంతా విశ్రమించి సూర్యోదయానికి లేచి ఫలహారాలు ముగించుకొని నగరాన్ని చూడటానికి బయలుదేరారు. చైనాబజార్ మౌంట్ రోడ్డు మాంబళం. పార్థసారథిస్వామి గుడీ, వాహినీ స్టూడియో, అడయార్ మర్రిచెట్టు వరుసగా అన్నీ చూస్తున్నారు.

మర్రిచెట్టు చాలా పెద్దది. దాని వూడలే మళ్ళీ చెట్లుగా

వ్యాపించాయి."మధుమతిగారు బాగా అలిసిపోయినట్లున్నారే"గోవిం దరావు పలకరించాడు.

"నో నో. అలాంటిదేమీ లేదు. నాకు మాంచి హుషారుగా వుంది."

"హుషారుగా ఉన్నప్పుడేం చేయాలో తెలుసునా? ఇలాంటి చలిలో విస్కీ తాగి కోరికల రధాన్ని ఆకాశంలో పరుగెత్తించే సారథిని వెతుక్కోవాలి."

"సూర్యుడి రధానికి అనూరుడు అనే కుంటి సారథి ఉన్నా డని మా పల్లెటూళ్ళో చదివాను. అలాగే నా రథానికి ఓ మెతక డ్రైవర్ ఉన్నాడు"

"మనకు కావలసింది ట్రావెల్. కావాలంటే డ్రైవర్‌ను బండిని కూడా మార్చుకోవచ్చు.

"బండ్లు మార్చడంలో మీరు మంచి ఎక్స్‌పర్టులాగున్నారే."

ఔను నాకు లాస్ట్ ఇయర్ మోడల్ కారు నచ్చదు. ఎప్పటి కప్పుడు........"

మర్రి ఆకు మీదనుంచి ఓ గొంగళీ పురుగు మధుమతి మీద పడింది. మధుమతి కెవ్వున కేక వేసింది. గోవిందరావు మధుమతిని గట్టిగా పట్టుకొని క్రింద పడకుండా ఆపాడు.

"క్యాటర్ పిల్లర్ క్యాటర్ పిల్లర్" గోవింరావు మధుమ తికి అదేమిటో వివరించాడు. మధుమతి దాన్నేదో కొత్త జంతు వును చూసినట్లు చూసింది. గొంగళీ పురుగు నిర్మూలనం కోసం భర్తతోపాటు తానూ మల్లమ్మగా వున్నరోజుల్లో ఎన్నో మందులు చల్లుతూ ఉండేది. ముదిరిన నారుకు కోడు, దోమ ఆశిస్తూ ఉండేవి. అప్పుడు భర్త డెర్సిబాన్ ద్రావణం ఉపయోగించే వాడు. కాండం తొలచే తెల్ల కంకి పురుగులమీద సాయం వేళల్లో ఎండో సల్ఫాన్ ఫాస్ఫ మిడాన్ ఫసలోన్ వంటి మందులు వాడేవాడు. అప్పుడవేవో తెలిసేది కాదు. ఇప్పుడా మందుల పేర్లు కూడా తెలుసు. అలాం టిది ఈనాడు మధుమతికి క్యాటర్ పిల్లర్ ఒక డైనాసార్స్ లాంటి జంతువు. ప్రాచీన చారిత్రక అవశేషాన్ని చూచినట్లు చూస్తు న్నది మధుమతి. గోవిందరావు హాండ్ కర్చీఫ్‌తో మధుమతి

చెయ్యి తుడిచి అక్కడ సున్నితంగా ముద్దు పెట్టుకున్నాడు. మధుమతి థ్యాంక్సు చెప్పింది మర్యాదకు. కానీ ఆమె మనస్సులో గొంగళీపురుగేదో పాకినట్లు అనిపించింది. సాయంత్రానికి అంతా మెరీనా బీచ్ చేరారు. పగలంతా విశ్రాంతి లేకుండా నగరం చూడటంతో అందరూ బాగా అలసిపోయారు. పుండలు, ఐస్‌క్రీములు, క్యాండీస్; పైనాప్పుల్ స్లైసెస్ సరదాగా కొనుక్కొని సముద్ర తీరంలో వినోదిస్తున్నారు. ఇంతలో ఓ బిచ్చగత్తె మధుమతి దగ్గరికి వచ్చి, "అమ్మా పేదదాన్ని యేదైనా ఇచ్చి పుణ్యం కట్టుకోండి" అని అరవంలో అడిగింది.

"పోవమ్మా పో" అన్నది మధుమతి.

"వోహో మీరు తెలుగువాళ్ళా అమ్మా మాదీ తెలుగు దేశమే. అనాధను. తోటి ఆడదాన్ని యేదైనా సహాయం చెయ్యండి"

"ఈ గొంతెక్కడో విన్నట్లున్నది" అనుకుంటూ సముద్రం వైపు చూస్తున్న మధుమతి వెనుకకు తిరిగి చూసింది. పసిపాప నెత్తుకొని వికృతమైన మొహంతో మాసిన గుడ్డలతో వో బిచ్చగత్తె నిలబడి వుంది. ఆమె వైపు మధుమతి ప్రశ్నార్థకంగా చూస్తున్నది. అప్పటి వరకూ మామూలుగా అడుగుతున్న బిచ్చగత్తె మధుమతి మొహం చూడగానే ఒక్కసారి కొయ్యబారిపోయింది. హిస్టీరియా రోగికి మల్లే శరీరమంతా బిగుసుకుపోయింది. "అక్కా" అన్నది పెద్దగా.

"నీవు....నీవు...."

"నేనక్కా లక్ష్మిని. గుర్తించలేదా? ఔనులే. నేను గుర్తించబడే స్థితిలో లేను."

మధుమతి నిశ్చేష్టురాలైంది. సముద్ర తరంగాలు ఒడ్డుకు వచ్చి పెళా పెళా విరిగి లోపలికి వెళ్ళిపోతున్నాయి.

"ఐస్‌క్రీం ఐస్‌క్రీం" బండివాడి కేకలు.

"లక్ష్మి....నీవు....ఇక్కడ...." మల్లమ్మ నోటి వెంట మాటలు రావటం లేదు.... లక్ష్మి భోరున యేడుస్తూ మల్లమ్మకాళ్ళ మీద పడింది.

"నేను చేసిన దానికి ఫలితం నేనే అనుభవించాలక్కా. నా పాపాలకు ఫలితం ఈ పాపగా జన్మించింది. మద్రాసుకు వచ్చి నేను అంతస్తును ధనాన్ని రూపాన్ని, శీలాన్ని అన్నింటిని కోల్పో యాను. ఈనాడు నేనొక బిచ్చగత్తెను. పరమపద సోపాన పఠంలో నేను పెద్ద పాము నోట్లోపడ్డాను."

లక్ష్మి వెక్కి వెక్కి యేడుస్తున్నది. మధుమతి ఒక్క క్షణం తన అంతస్తును మర్చిపోయింది. మల్లమ్మగా మారి

"లక్ష్మీ యేం జరిగింది" అని ప్రశ్నించింది. పసిపాపను చేతిలోకి తీసుకుంది. అప్పుడు లక్ష్మి తన కథ ఇలా చెప్పింది.

ఆ కథ ఇది.

బుచ్చిబాబు లక్ష్మిని తనతో లేచిరమ్మన్నాడు.లక్ష్మి మొదట్లో భయపడ్డది. కానీ బుచ్చిబాబు లక్ష్మిని గడ్డివాము చాటున వడిలో పడుకోబెట్టుకొని-

"నిన్ను సినిమా తారను చేస్తాను యీ ఊళ్ళో ఉంటే మన వివాహం అసంభవం. నా తండ్రి వేరే సంబంధాలు చూస్తు న్నాడు. ఐస్త్రీ కెళ్లి గుళ్ళోపెళ్లి చేసుకొని కాపరం పెడదాం. మనకో బాబు పుడితే అప్పుడు పెద్దల కక్షలు కార్పణ్యాలు పోతాయ్. పైగా నీ సొగసు, వయసు, ఆటా పాటా అన్నింటికి తగిన ప్రదేశం చెన్న పట్టణమే. యే పేడా పట్టి పిసుక్కునే రైతుకో నిన్నిచ్చి చేస్తే నీ బ్రతుకు ఈ కర్లపాలెంలో అడవికాచిన వెన్నెల అవుతుంది. నీకిది పరిక్ష సమయం అటోఇటో యీ రాత్రి తేల్చుకో" అని గట్టిగా కౌగిలించుకున్నాడు.

లక్ష్మి మనస్సు బలహీనతలో ఉయ్యాల ఊగింది. ఇటు కర్లపాలెం పెంట కుప్పలు, అటు చెన్నపట్నం మేడలు పక్క పక్కనే ఆమె మనో నేత్రానికి కనపడ్డాయి. తెర మీది ఆమె అభి మాన తారలు అంజలి మొదలైన వాళ్ళు 'రా రమ్మని' పిలుస్తున్న ట్లైంది.

"సరే వస్తాను పద" అన్నది.

"నేనూ డబ్బు తెస్తున్నాను. నీవు నీ నగలతోసహా బయలు దేరు" అన్నాడు. ఆ రాత్రి లక్ష్మి బంగారంతో సహా ఇంటి నుంచి

బయట పడింది. మరునాడు విజయవాడలో రైలెక్కి మద్రాసు చేరు కున్నారు. బుచ్చిబాబు మాంబళంలో ఏో ఇల్లు తీసుకున్నాడు. రోజూ ముస్తాబు చేసుకొని బుచ్చిబాబు వెంట సినిమాలకు బీచికి వెళ్ళడం కొందరు ప్రొడ్యూసర్లను కలవడం హాయిగా విందు భోజనాలు చేయటం ఇదే ఆమె జీవితమైంది. ఇంత ఆనందకరమైన జీవితాన్ని వదులుకొని ఇన్నాళ్లూ ఆ కర్లపాలెంలో ఎలా మగ్గిపో యిందో తనకే ఆశ్చర్యమనిపించింది. కొందరు ప్రొడ్యూసర్లు లక్ష్మి పాట విన్నారు. టెస్టుపెట్టారు. కొత్త సినిమాలో ఛాన్సు ఇస్తా మన్నారు. ఓ ప్రొడ్యూసరు కొడుకు లక్ష్మిని తనతోపాటు మహా బలిపురం షికారుకు రమ్మన్నాడు. అందుకు బుచ్చిబాబు ఒప్పు కోలేదు. లక్ష్మి మళ్ళీ ఆలోచనలో పడ్డది. మద్రాసులో బుచ్చి బాబుకున్న పలుకుబడి తక్కువ. అతను తెచ్చినడబ్బు తన వంటి మీద నగలు అయిపోతె అప్పుడు తనగతేమౌతుందో తెలియదు. ఎప్పుడు పెళ్ళిమాట ఎత్తినా బుచ్చిబాబు మాట మారుస్తూ దాట వేస్తున్నాడు. పైగా బుహారీ హోటల్స్‌లో బిర్యానీలు- చికెన్ పలావులు ఆరగించటంలో టాక్సీలలో తిరగడంతో బుచ్చిబాబు తెచ్చిన డబ్బంతా అయిపోయింది. ప్రతిరోజూ ఎవరో ప్రొడ్యూ సరు లక్ష్మిని బుక్ చేసుకుంటున్నాడనే బుచ్చిబాబు వార్తలుతేవడమే గానీ అందులో నిజానిజాలేమీ తేలడంలేదు. కాగా అప్పుడే లక్ష్మి తెచ్చిన కాసులపేరు కడియాలు కరిగిపోయాయి.

"ఇదిగో శకుంతా ఫిలిమ్స్‌వారి 'రేపు నీదే' సినిమాలో నిన్ను హీరోయిన్‌గా బుక్ చేసుకున్నారు. నీకు ఇరవై వేలు యివ్వడానికి నిశ్చయమైంది" అని బుచ్చిబాబు చెప్పాడు.

బుచ్చిబాబుకు తెలియకుండా ప్రొడ్యూసర్ కొడుకుతో శకుంతా ఫిలిమ్స్ గురించి విచారించింది.

"అబ్బే అలాంటి పేరుగల సంస్థ ఈ ఊళ్ళో లేదే" అన్నాడు అతను. దాంతో బుచ్చిబాబు ఏదో నాటక మాడుతున్నాడని లక్ష్మికి తెలిసిపోయింది. ఆరాత్రి వివాహంగురించి గట్టిగా బుచ్చి బాబుపై వత్తిడి తెచ్చింది, బుచ్చిబాబుకు కోపంవచ్చి బెదిరించాడు "నీ విప్పుడు నా చేతిలో కీలుబొమ్మవు, కర్లపాలెంపోతే కాళ్ళు విరగగొడతారు. ఆత్మహత్యతప్ప నీకు వేరే గత్యంతరం లేదు.

అటువంటి పరిస్థితులలో నీవు నేను చెప్పినట్లువింటే ఈ మాత్రం సిద్దైనా దక్కుతుంది, వివాహం అంటూ బెదిరించావో రేపీపాటికి నీవు వీధిలో ముష్టెత్తుకోవాల్సి వస్తుంది జాగ్రత్త" అన్నాడు.

"మరీమాట నాకు ముందే ఎందుకు చెప్పలేదు. నేను నీ భార్యగా వచ్చానేగానీ ఉంపుడుగత్తెగా రాలేదు"అన్నది లక్ష్మి.

ఇదేమీ చలం నవలకాదు. సెక్సు సినిమా కాదు. జీవితం. నిప్పులాంటిది. తెలిసితాకినా తెలియక తాకినా కాలుతుంది. లేచి పోయిరావడంతో నీవు కళంకితమైనావు.అంటే కొంగులో నిప్పును కట్టుకున్నావు. రభసచేస్తే ఈ బ్రతుకు కూడా మిగలదు. లేచి పోయినదానికి పాతివ్రత్యమేమిటే? సతీత్వమేమిటి,"

"నీవింతటి నీచుడవని తెలిస్తే నే స్నీమొహాన ఉమ్మేసి ఉండేదాన్ని. నమ్మించి నా గొంతుకోశావు."

"పోవే పోకిరీ గుర్రమా నువ్వూ నీ లంజ వేషాలు కర్ణ పాలెంలో నేను చూడలేవా. నేను కో అంటే కోటిమంది కోటీ శ్వరులు తమ పిల్లల్ని తెచ్చివ్వటానికి సిద్ధంగాఉన్నారు. అలాంటిది నీతో నా పెళ్ళేమిటి?" అన్నాడు.

"వంచన. మోసం, దగా"

"నీవు మాత్రం తక్కువా? మొన్న ప్రొడ్యూసర్ పరం ధామయ్య కొడుకుతో మౌంట్ రోడ్డు హోటల్లో కనపడలేదా. తిరుగుళ్ళు నేర్చిందానికి పెళ్ళిచేసుకునే అధికార మెక్కడ"

"పరంధామయ్యకొడుకు సినిమా ఛాన్సు ఇప్పిస్తానన్నాడని అతనిమీదికి నీవే నన్ను ఎగదోశావు. ఇవ్వాళ నీవే నేను వాడితో తిరుగుతున్నానని అన్నావు మంచిది. రేపటినుంచి నిజంగానే తిరిగి చూపిస్తాను."

"అందుకే నీవు ఉంపుడుగత్తెగా తప్ప భార్యగా పని కిరావు అని నేనన్నది."

లక్ష్మి కసికొద్దీ బుచ్చిబాబు చెంప చెళ్ళు మనిపించింది. కోపంతో బుచ్చిబాబు పశువులా ప్రవర్తించాడు. లక్ష్మిని రేప్‌చేసి చావగొట్టి నగలు లాక్కొని పారిపోయాడు.

ఆ మరునాటినుంచి లక్ష్మి ప్రొడ్యూసర్ పరంధామయ్య కొడుకును నమ్ముకున్నది. అతనితోపాటు షికార్ల కెళ్ళింది సరదాలు

తీర్చింది. అయితే పరంధామయ్య కొడుకు లక్ష్మిని ఒక విలాస వస్తువుగా వాడుకున్నాడేగానీ అంతకన్నా గౌరవ మివ్వలేదు. ఈ లోపల లక్ష్మి గర్భవతైంది. దాంతో పరంధామయ్య కొడుక్కి లక్ష్మిమీద మోజు తీరిపోయింది. లక్ష్మి ఎబార్షన్ కోసం ప్రయత్నించింది గానీ అప్పటికే ఆలస్యమైందని డాక్టర్లు చెప్పారు.

ప్రాణంమీద తీపితో లక్ష్మి ఆత్మహత్యా ప్రయత్నం విరమించుకుంది, పరంధామయ్య కొడుకుతో పెళ్ళిమాట తెచ్చింది. అదివిని ప్రొడ్యూసర్ కొడుకు లక్ష్మిని ఒక చిన్న దోమనో, చీమనో, కీటకాన్నో చూచినట్లుచూచాడు. పెళ్ళి అనే పవిత్రమైన పదం ఉచ్చరించే అధికారం ఈ పురుగుకు లేదని అతని చూపుల భావం. ఇలా లక్ష్మి ప్రొడ్యూసర్ కొడుకు ఆశ్రయాన్నీ అభిమానాన్నికూడా కోల్పోయింది. గతిలేక బ్రతుకుతెరువుకోసం లక్ష్మి ఎక్స్ట్రావేషాలు వేయడం మొదలు పెట్టింది. హీరోయిన్ కావాలనుకున్న లక్ష్మికి ఎక్స్ట్రా వేషాలుకూడా దొరక్క పోవడంతో గతిలేక బ్రతుకుతెరువుకోసం మాంబళంనుంచి తేనాంపేటకు మారి పేరు మార్చుకొని వృత్తి మొదలుపెట్టింది. లక్ష్మి ఓ ఆడపిల్లను ప్రసవించింది. ఈ దశలో లక్ష్మి తంగవేలు చేతిలో పడింది.

తంగవేలు లక్ష్మి కూతురును చంపాలని ప్రయత్నించాడు. "అది బ్రతికితే నీకు తిండి ఉండదు. వృత్తి నడవదు" అన్నాడు. మాతృత్వం మమకారంతో లక్ష్మి తంగవేలు మాట తిరస్కరించింది. "అయితే చావు ముండా" అని తంగవేలు తమిళంలో రెండు తిట్టి పొట్టన్ను తన్ని పోయాడు. ఈ దశలో లక్ష్మి మశూచి బారిన పడింది. సహజసౌందర్యమంతా అప్పటికే కోల్పోయిన లక్ష్మి ఈ మశూచి పిశాచంవల్ల ఎముకల పోగుగా మిగిలింది.

"నీవింక వృత్తికి కూడా పనికిరావే" అని తంగవేలు లక్ష్మిని రంగయారు కమ్మాడు. ఇలా ఎన్నో చేతులుమారిన లక్ష్మి చివరకి రంగయారు సత్రంలోకి చేరింది.

రంగయారు మద్రాసులోని రౌడీలల్లోఒకడు. రాజకీయంగా కూడా పలుకుబడి ఉన్నవాడు. ఇతనికో అనాధ శరణాలయం

కూడా ఉంది. రంగయారు చేతి క్రింద మరికొంతమంది రౌడీ లుంటారు. వీళ్ళంతా బిచ్చగాళ్ళ ఏజంట్లు. పొద్దున్నే సత్రం నుంచి అనాథ శరణాలయం నుంచి బిచ్చగాళ్ళను లారీల్లోకి సరుకు నెక్కించుకున్నట్లు ఎక్కించుకొని తీసుకుపోయి నగరంలో ఆయా చోట్ల ఉదయమే వదిలివస్తారు. డస్ట్‌బిన్స్ ప్రక్కన యూరినల్స్ చాటున కోవెలల ముందు. హోటళ్ళ దగ్గర ఇలా ఉదయమే నగ రమంతా బిచ్చగాళ్ళ ప్రత్యక్షం.... కుంటి వాళ్ళు, గుడ్డి వాళ్ళు, బోదకాలువాళ్ళు, మూర్ఛల వాళ్ళు, రకరకాల బిచ్చగాళ్ళు. అంతే కాదు. వ్యాపారంకోసం రంగయారు కొత్తకొత్త బిచ్చగాళ్ళను సృష్టిస్తూ వుంటాడు. కొందరికి కాళ్ళను, చేతులను వెనక్కి మడచి కట్టి కుంటివాడుగా నటించమంటాడు. అయితే ఇది నటన అని తెలిసి నగరంలో వీళ్ళకు బిచ్చం వేయడం మానివేశారు. అందువల్ల రంగయారు మరీ నిజంగానే కొంతమంది అనాథలకు కాళ్ళూ చేతులు విరగ్గొట్టారు, కొందరికి గుడ్లు పీకేశారు. వీళ్ళంతా రంగయారుకు పెట్టుబడిలేని వ్యాపారపు ముడిసరుకులు. వీళ్ళంద రికీ రంగయారు పోషకుడు. సమాజంలో ఆశ్రజన రక్షకుడు. ఈ బిచ్చగాళ్ళ సంపాదనలో పోలీసులకు కొంతవాటా, ఏజంట్లకు కొంతవాటాపోగా మిగిలినది రంగయారుకు దక్కుతుంది. రంగ యారు వీరికి కూడూ నీడా రక్షణ కల్పిస్తాడు. తన బిచ్చగాళ్ళపై ఈగవాలకుండా రక్షించుకుంటాడు. పగలంతా బిచ్చమెత్తటం రాత్రి సత్రం భోజనం మరం నిద్ర. ఇదీ జీవితం.

"అక్కా ఇదీ నా కథ" అన్నది లక్ష్మి ఏడుస్తూ. మధుమతి స్థాణువై వింటున్నది. "ఇది నా కథే కాదక్కా మన కోస్తాప్రాం తాలనుంచి సినిమా వ్యామోహంతో చెన్నపట్టణం చేరిన చాలా మంది సుందరీమణుల సామాన్యగాథ ఇదే" అని లక్ష్మి మళ్ళీ ఏడ్చింది.

"ఏడవకు లక్ష్మీ నాతోపాటు విజయవాడ వచ్చెయ్"

"వద్దక్కా, నన్ను నగరం పొలిమేరలు దాటనివ్వరు. వచ్చినేను మళ్ళీ నా ముఖం ఘన ప్రాంతాలలో చూపించలేను." లక్ష్మి వెక్కి వెక్కి ఏడుస్తున్నది. దూరంగా కమలాక్షి తన స్నేహితురాళ్ళతో ఏబార్షన్‌వల్ల లాభాలు, నష్టాలు చర్చిస్తున్నది,

"ఎబార్షనెందుకు? అసలు పెళ్ళికాకముందే ఆపరేషన్ చేయించుకుంటే సరి. దానివల్ల సౌందర్యమూ దక్కుతుంది, అనుభవమూ మిగులుతుంది."

అదివిని అంతా ఫక్కున నవ్వారు.

"నిజమే నిజమే మన స్తనాలు పురుషుల కోసమే గాని పిల్లల కోసంకాదు" అన్నదొకామె.

"హిప్ హిప్ హుర్రే" అంటూ అంతా చప్పట్లుకొట్టి విరగ బడినవ్వారు. ఆ మాటఅన్న వన్నెల మిటారిని అందరూ కలిసి కౌగలించుకొని నలిపివేశారు.

"యూ సిల్లీ వదలండి" అన్నదామె.

అప్పటికే బాగా చీకటిపడింది. మధుమతి ఈ గొడవచూస్తూ మళ్ళీ లక్ష్మివైపు తిరిగింది. అయితే లక్ష్మి ఎప్పుడో అదృశ్య మైంది.

"లక్ష్మి లక్ష్మి" అని కేకవేసింది. తనకేక తనకే ప్రతి ధ్వనియై వినిపించింది. సముద్రం హోరెత్తుతున్నది. చంద్రుని వెన్నెలలో సుందరీమణులు తడిసిపోతున్నారు. కానీ మధుమతి హృదయసాగరంలో బడబాగ్ని రగిలిపోతున్నది.

"పదండే పోదాం" అంతా లేచారు."

తమ టూరిస్టువ్యాన్ ఎక్కారు. మధుమతి లక్ష్మికోసంఅన్ని దిక్కులూ చూపుల గాలంతో గాలిస్తూ ఉంది. కానీ ఫలితంశూన్యం బస్సు రెస్టారెంట్ హాలుకు చేరింది. అందరూ విందు భోజనాలు చేశారు.

"హాయ్ హాయ్ రోజంతా మజాగాగడిచింది. రేపు మహా బలిపురం"అన్నదొకామె.

"ఇదేమిటే మన మధుమతి మూగబోయిన వీణలా కూర్చు న్నది"అన్నది మరొకామె.

"సముద్రపు హోరుతో మెరీనా సౌరుతో మధుమతిమనసులో ఏ మన్మథుడో మెదిలినట్లున్నాడు" అని మరొకామెఅన్నది. అంతా మళ్ళీ చప్పట్లుకొట్టారు. కొందరు సిగరెట్లు తాగారు. కొందరు విస్కీ పట్టించారు. కొందరు నిద్ర కోసం ట్రాంక్విలైజర్స్ వాడారు.

"ఒకతె "ఒసే చంద్రికా భయంగా ఉంది కౌగలించుకొని పడుకోవే" అన్నది మధుమతి మనస్సునిండా గొంగళీ పురుగులు, హృదయంనిండా పిశాచంలా నల్లగా నర్తిస్తున్న లక్ష్మి రూపం మధుమతికి ఏ తెల్లవారు జామునో నిద్ర పట్టింది.

ఉదయం అంతాలేచి మహాబలిపురానికి తయారైనారు ముస్తాబై. నిద్రలేమిచే చింతనిప్పుల్లాంటి కళ్ళతో మధుమతి లేచి కూర్చున్నది.

"అదేమిటి అంత ఎక్కువగా తాగావా? కళ్ళు మండు తున్నాయి. పద మహాబలిపురానికి" అన్నదొక నెచ్చెలి.

"నేను రాలేను మీరు వెళ్ళండి. నాకు వంట్లో బాగా లేదు.

"అ బాగా లేకపోవడం మాకు ఉన్నదేనే మహాతల్లీ అది మదనజ్వరం మంచి సుందర మందిర దృశ్యాలు చూస్తుంటే విరహంవెర్రెత్తుకొస్తుంది. పదపద నీవు లేకుంటే ఇంక మజా ఏమిటి?" పైగా ఒక్కతివే ఇక్కడుంటే ఎవడైనా రేప్ చేస్తాడు పద. పద."

గత్యంతరంలేక మధుమతి బస్సెక్కింది.

మహాబలిపురం

సాగరతీరం.

రాతి రధాలు.

కొబ్బరి చెట్లు.

కొండ గుహలు.

అర్జునుని తపస్సు.

అన్నీ మధుమతి కళ్ళముందు తెరమీది బొమ్మల్లాగా కదిలిపోతు న్నాయి. కరిగిపోతున్నాయి.చెదిరిపోతున్నాయి. చెరిగిపోతున్నాయి. అకాశంలోఎండుమబ్బులలాగా మధుమతి భావాల ముక్కలు. ఎక్స్ కర్షన్ సాగుతూనేఉంది.మధుమతి శరీరం మాత్రం బస్సులో ఉంది.

# 10

మద్రాసులోని షాక్‌నుంచి తేరుకోవడానికి మధుమతికి కొంతకాలం పట్టింది. స్నేహితురాలిగా కాకపోయినా ప్రగతి మహిళామండలి కార్యదర్శిగా తాను లక్ష్మి ఎడల తన బాధ్యత

సరిగా నిర్వహించలేదేమో ననిపించింది. ఇంతలో రత్తయ్యవచ్చి కోటేశ్వరరావుకు ఒక విజయవార్త చెప్పాడు.ఆ సంవత్సరంజిల్లా లోని రైతులు అధికోత్పత్తి పోటీలోపాల్గొన్నారు.రత్తయ్య ముందు నుంచీ సస్యరక్షణచర్యలవిషయంలో జాగ్రత్తపడ్డాడు. అమ్మోనియా సల్ఫేటు ఎరువు పెట్టి నీళ్ళు కట్టాడు. అగ్రసాన్ మందు బోర్డో మిశ్రమం బి. హెచ్. సి. పొడి కెల్‌థేన్‌వంటి మందులు బాగా దట్టించాడు. కర్లపాలెంలోని మిగతా పొలాలలో పైరుకు లక్క తెగులు పట్టింది. ఆకులనుంచి రసాన్ని పీల్చే ముడతిపురుగుల బారినుండి రైతులు పంటను కాపాడుకోవటం చాలా కష్టమైంది. మొత్తంమీద రత్తయ్య విజయం సాధించాడు. కోటేశ్వరరావు పేరును జిల్లాలో నిలబెట్టాడు. అధికోత్పత్తికిగానూ రత్తయ్యకు ప్రథమ బహుమతి లభించింది. అదివిని కోటేశ్వరరావు కొంచెం ఊరట చెందాడు. "పొగాకు ఎట్లావుంది?" అని ప్రశ్నించాడు.

"మీ కెందుకు బాబూ తెల్లదొరలు గుంటూరు రానివ్వండి వాళ్ళచేత రైట్ అనిపించే బాధ్యత నాదీ" అన్నాడు రత్తయ్య. పొగాకు నాణ్యతలో నిర్ణయించటంకోసం విదేశాలనుంచి ప్రముఖులు గుంటూరు వస్తుంటారు. ప్రత్యేకంగా వారికి ఆతిథ్యాన్ని యేర్పాటుచేయడంకోసమై పొగాకు వ్యాపారస్థులు కొన్ని యేర్ కండీషన్డ్ భవనాలు కడతారు. గానా. పీనా. బజానా యేర్పాటు చేస్తారు. అడిగినదిచ్చి వాళ్ళను సంతృప్తి పరిచి తమ పొగాకు మంచిరేటు పలికించుకుంటారు. ఇది కోటాను కోట్ల రూపాయిల వ్యాపారం. దీనితోపాటు ఇంటర్నేషనల్ స్మగ్లింగ్ సాగుతూ ఉంటుంది. వీటికి రక్షణగా క్రిందనుంచి పైవరకూ అన్ని అంతస్థులలోనూ మనుషులుంటారు.కేంద్రంలోనిఉన్నతాధికారులువీళ్ళకు కాపు ఉంటారు. అందుకు ప్రతిఫలంగా వీళ్ళనుండి పై వాళ్ళకి సావనీర్ల రూపంలో విరాళాలు లక్షలమీద అందుతుంటాయి. ఇదంతా వో పెద్ద మాయలమాలోకం. కోటేశ్వరరావు విజయవాడ వచ్చి ఎరువుల డిపో పెట్టినప్పటినుంచీ ఈ క్రొత్త లోకంలోకి ప్రవేశించాడు. ఎవరిని పట్టాలి. ఎలా పట్టాలి అన్నీ తెలుసు కున్నాడు.

రత్తయ్య తెచ్చిన విజయవార్తలతో కోటేశ్వరరావు ఈ సారి సరికొత్త వ్యూహం రూపొందించుకొన్నాడు. తన పొలంతో పాటు చుట్టుపట్ల గల మరికొంతమంది సన్నకారు రైతుల పొలాలు కూడా తానే గుత్తకు తీసుకున్నాడు. మొత్తాన్ని సుశిక్షితులైన కొందరు అనుభవస్తుల సహకారంతో దున్నించి ముందునుంచి ఎరువులు బాగా గుప్పించాడు. ట్రాక్టరువంటి ఆధునిక పరికరాలు వాడుకలోకి తెచ్చాడు' ట్రాక్టర్ రావటంవల్ల మరికొన్ని కోసే మిషను నూర్పేమిషన్లను తీసుకొని రావడంవల్ల మంగళగిరిచుట్టు పక్కల రైతులలో సంచలనం బయలుదేరింది. కోటేశ్వరరావుతో పరిచయమున్నవాళ్ళంతా ఆయనకిడబ్బుకట్టి మిషన్లనుబాడుగకుతీసుకొనివాడుకున్నారు.దీనితో వందలాది సన్నకారు కూలీలనోట్లో మట్టి పడింది. వాళ్ళు యంత్రాలను ఉపయోగించడానికినిరసనగా సామూహిక సమ్మెచేశారు. కానీ వారి మొరవినే నాదుడే కనిపించలేదు. దానితో ట్రేడ్ యూనియన్ నాయకులు జోక్యం చేసుకున్నారు. కూలీ జనం దౌర్జన్యానికి తలపడ్డారు. కోటేశ్వరరావు కిరాయి మనుషులను పెట్టి వాళ్ళను కొట్టించాడు. దీనితో పెద్ద గొడవై పోయింది.

కోటేశ్వరరావు వెనక ఒక ముఠా, కూలీల వెనక మరో ముఠా తయారయ్యింది.

"నిన్నటిదాకా వీడూ మనలో ఒకడు నేడు బస్తీకిపోయేసరికి తనొక పెద్ద జమీందారు ననుకుంటున్నాడు" అని రైతులు సన్నకారు కూలీలు తిరగబడ్డారు.

ఈ గొడవనుంచి బయటపడడానికి కోటేశ్వరరావుకు చాలా సమయమూ ధనమూ పట్టాయి. మొత్తంమీద ఆ సంవత్సరం కూడా కోటేశ్వరరావు పొగాకు మంచి రంగులోతేలింది. అల్‌ఫ్రెడ్ అనేదొర కొనుగోలుకోసం గుంటూరు వచ్చాడు. ఆయనకి ప్రముఖ పొగాకు వర్తకులంతా సన్మానంచేశారు. సన్మానసభలో రాజయ్య అనే వర్తకుడు మాట్లాడుతూ,

"భారత దేశానికి స్వతంత్ర్యం రావడం నిజంగా చాలా విచారింపదగ్గ విషయం. బ్రిటిషు వాళ్ళ కాలంలో మేము

కడుపులో చల్ల కదలకుండా హాయిగా బ్రతికాం. నేను మొన్నటి దాకా జనస్పార్టీలోవుంది మహా ఘనత వహించిన తమ ప్రభుత్వాన్ని సేవించుకున్న విషయం తమకు తెలిసిన విషయమే. మీరు మా మీద దయవుంచి మా వ్యాపారానికి ఇతోధికంగా తోడ్పడాలని ఆశిస్తున్నాను" అంటూ కూర్చున్నాడు.

ఆల్ఫ్రెడ్ ఒక నవ్వు నవ్వాడు. అది తన భక్తులకు అభిమానంగా ఇచ్చిన కానుకవలెవుంది.

"మేము మిమ్మల్నివదిలి ఎక్కడికీ పోలేదు. మా హృదయాలన్నీ ఇక్కడేవున్నాయి. వ్యాపారంకోసం మేము వచ్చాము, దేశాన్ని ఎవరు పాలించినా మా వ్యాపారం మాత్రం నిర్విఘ్నంగా సాగుతూనే ఉంటుంది. భారతదేశం ప్రధానంగా వ్యవసాయిక దేశం, అయితే మన రైతులకు ఆధునిక విధానాలు తెలియవు. అదొక పెద్దలోపం. రెండవది మీరు ఆహారపు పంటలు పండించటం మానెయ్యాలి. పొగాకు పత్తి చెరుకు మిర్చివంటి వాణిజ్యపు పంటలకే ప్రాధాన్యమివ్వాలి. అప్పుడే దేశం సుసంపన్నమౌతుంది. కోటాను కోట్ల విలువగల విదేశీ మారకాలు సంపాదించగలుగుతారు అంతగాఅవసరమైతే ఆ ధనంతో బియ్యము గోధుమ మీరు దిగుమతి చేసుకోవచ్చు. అదేం పెద్ద కష్టంకాదు." అని చెప్పాడు.

అంతా చప్పట్లు కొట్టారు.

ఎయిర్ కండిషన్డు భవనంలో ఏర్పాటైన ఈ ప్రత్యేక సమావేశానికి పరిమితంగాని వాణిజ్య ప్రముఖులు వచ్చారు. అనంతరం విందు భోజనాలు జరిగాయి. అందరితోపాటూ కోటేశ్వరరావుగారు కూడా దొరగారి ఆరోగ్యార్థం విస్కీ సేవించాడు. ఆ తరువాత దొరగారి విలాసార్థం అందమైన అమ్మాయిల్ని తెచ్చారు. వారిలో నుంచి దొరగారు తనకు కావలసిన పిల్లను ఎన్నుకున్నాడు.

"మా తెల్ల వాళ్ళకు మీ నల్లతోలంటే వ్యామోహం మీ నల్ల వాళ్ళకు మా తెల్ల తోలంటే గౌరవం, తమాషాగా ఉంటుందిగదూ సృష్టి అన్నాడు దొర.

దానికి ప్రముఖులంతా పగలబడి నవ్వారు.

"ఓహో చాలా గొప్పగావుంది జోక్. చాలా బాగావుంది" అని ప్రశంసించారు.

"రేపు నేను విజయవాడవెళ్ళి అక్కడినుండి నేను బొంబే వెళుతున్నాను" అని చెప్పాడు దొర.

"విజయవాడ వస్తే మా అథిత్యం స్వీకరించండి" అని ప్రార్థించాడు కోటేశ్వరరావు. కోటేశ్వరరావు మాటలను అనువదించి చెప్పారు.

"తప్పకుండా వస్తాను" అన్నాడు అల్‌ఫ్రెడ్.

అల్‌ఫ్రెడ్ అన్నమాట నిలబెట్టుకున్నాడు.

మరునాడు విజయవాడవెళ్ళినప్పుడు కోటేశ్వరరావు ఆథిత్యం స్వీకరించాడు. మధుమతి దగ్గరవుండి దొరవారికి ఎన్నో సపర్యలు చేసింది.

"కోటేశ్వరరావ్ నీ పొగాకుకు మంచిరేటు వచ్చేటట్లు చూస్తాను" అన్నాడు దొర. దొర అన్నది మామూలు మాటకాదు అక్షరలక్షలు విలువచేసే మాట. కోటేశ్వరరావు ఆ మాటలో ఎన్ని అక్షరాలున్నాయో లెక్కవేసుకున్నాడు. ఇరవైరెండు అక్షరాలున్నాయి. అంటే ఆ సంవత్సరం కోటేశ్వరరావుకు లాభం ఇరవైరెండు లక్షలా.

"అమ్మో అమ్మో" కోటేశ్వరరావుకు తలతిరిగిపోతున్నది.

దొరగారితో మధుమతి బాగా ఇంగ్లీషు మాట్లాడగలుగుతున్నది. కోటేశ్వరరావుని పిలిచి అల్‌ఫ్రెడ్ తన ప్రయాణపు ఏర్పాట్లు చేయమన్నాడు. కోటేశ్వరరావు రైల్వే స్టేషన్‌కి ఫోన్ చేశాడు లాభంలేకపోయింది. స్వయంగా తానేవెళ్ళి ఓ ఫస్టుక్లాస్ టిక్కెట్టు బుక్‌చేశాడు. కోటేశ్వరరావు ఇంటికివచ్చేసరికి అల్‌ఫ్రెడ్ మధుమతిని గట్టిగా కౌగలించుకొనివున్నాడు. మధుమతి సున్నితంగా అల్‌ఫ్రెడ్ చెవిలో గుసగుసలు చెప్తతూ అతని జైని వేలికి చుట్టుకుంటున్నది. కోటేశ్వరరావు ఈ దృశ్యాన్ని చూచి సహించలేకపోయాడు. అతని శరీరంలో రక్తం వేడెక్కి ఉడికింది. కానీ ఏం చేయాలో తెలియక నిలబడిపోయాడు. కోటేశ్వరరావునుచూచి దొర సర్దుకున్నాడు.

"మరీ మీ దేశస్థులకు బొత్తిగా సంస్కారంలేదు. చూడు ఒంటరిగా ఉన్నప్పుడు ఎలా వస్తున్నాడో ?" అన్నాడు ఇంగ్లీషులో.

అది విని మధుమతి సిగ్గుపడి నవ్వింది. కోటేశ్వరరావులో నిద్రించివున్న కోటయ్య పైకి వచ్చాడు. అల్ఫ్రెడ్‌ను పెడీ పెడీ మని కొట్టాడు. కోటేశ్వరరావు నిజంగానే బలవంతుడు. అతని దెబ్బలకు అల్ఫ్రెడ్ నేలకరిచాడు. అల్ఫ్రెడ్ లేచి నిలబడ్డాడు. సూటుకంటుకున్న దుమ్మును దులుపుకున్నాడు. పైపు నోట్లో పెట్టుకొని సూట్‌కేస్ తీసుకొని బయటికి వెళ్ళిపోయాడు.

"చాలా తొందరపడ్డిపోయాం" అన్నది మధుమతి.

"ఔను ఇరువురం తొందరపడిపోయాం నా తొందరపాటుకు విలువ ఇరవై రెండులక్షలు. నీ తొందరపాటుకు విలువ నువ్వే నిర్ణయించుకో" అంటూ కోటయ్య పళ్ళు పట పట కొరికాడు. మధుమతి కోటయ్య దగ్గరికి వచ్చింది. కోటయ్య ఆమెను ఒక గొంగళీ పురుగును చూసినట్లు చూశాడు. కోటయ్య చూపులకు మధుమతి చిరాకుపడింది.

"మీ బడా వ్యాపారస్థులు చాలామంది చేస్తున్న పనే ఇది. మీ స్వంత విషయానికి వచ్చేసరికి మాత్రం మీకు కష్టమనిపించింది."

కోటేశ్వరరావు మధుమతివైపు విచిత్రంగా చూశాడు.

"మల్లమ్మా నువు చాలా గొప్పదానివై పోయావు. బస్తీకి వచ్చి ఆకాశం ఎత్తుకు ఎదిగావు." అన్నాడు ఇంకేమీ మాట్లాడలేదు. కోటేశ్వరరావు ఇంట్లోనుంచి బయటికి నడిచాడు. మధుమతి అలా గుమ్మంవైపు చూస్తూ నిలబడిపోయింది.

ఆ వెళ్ళడం వెళ్ళడం కోటేశ్వరరావు నేరుగా కర్లపాలెం వెళ్ళాడు.

"అయ్యా కోటేశ్వరరావుగారూ దండం పెడతా" అన్నాడొక రైతు.

"నరసయ్యా నన్నిక అట్లా పిలవకు నేను బెజవాడ కోటేశ్వరరావును కాదిప్పుడు కర్లపాలెం కోటయ్యను."

# 11

మధుమతి ఆలోచిస్తున్నది. మానవుని మన స్తత్వంలో కొన్ని విచిత్రాలున్నాయి. వాటిని నిశితంగా విశ్లేషించేస్తేతప్ప అందలి లోతుపాతులు చమత్కారాలు అర్థంకావు. మానవుడు ఒక విషయాన్ని వింటాడు, దాని ప్రభావం అతనిమీద కొంతవుంటుంది. కానీ అది పరోక్షంగావుంటుంది. అదే విషయాన్ని కళ్ళతో చూచినప్పుడు ఈ ప్రత్యక్ష దర్శనంవల్ల వచ్చినఫలితం చాలాఎక్కువగా ఉంటుంది. కోటేశ్వరరావు మంచివాడో చెడ్డవాడో తనకు తెలియదు. కర్లపాలెంలోని చాలామంది రైతులు చావడిలో మకామేసి ఆడవాళ్ళను పిలిపించుకోవడం తనకు తెలుసు. కోటేశ్వరరావు ఎప్పుడన్నా అలా చేశాడో యేమో? తెలీదు. కానీ కోటేశ్వరరావు తానే స్వయంగా పొగాకు దొరకు ఆతిథ్యం ఇచ్చి సేవచేయవలసిందిగా మధుమతిని నియమించాడు. గుంటూరులో చాలామంది అలాగే నియమిస్తారు. అలా నియమించినవాళ్ళు తమ భార్యల్ని ఎరగావాడి వ్యాపారం చేసుకోవడానికికూడా సిద్ధపడుతూవుంటారు. యీ విషయాలన్నీ కోటేశ్వరరావుకు తెలియకపోలేదు.

ఐతే తననెందుకు నియమించినట్లు? దీనికి సామాన్యంగా చెప్పుకోవడానికో వ్యాఖ్యానంవుంది. కోటయ్యకు ఇంగ్లీషురాదు కాబట్టి విదేశీయులతో ఎలా ప్రవర్తించాలో నేర్చుకోలేదుకాబట్టి అది బాగా బస్తీలో నేర్చుకున్న తనను యీ ఆతిథ్యానికి సారధ్యం వహించమని కోరడం సహజంగానేవుంది. ఇది వినడానికికూడా బాగానేవుంది.

ఐతే ఒంటరిగా మధుమతి ఆల్‌ఫ్రెడ్‌తో ఉన్నప్పుడు ఆల్‌ఫ్రెడ్ మధుమతితో సరసమాడడని నమ్మకమేమిటి అలా జరిగేందుకు అన్ని అవకాశాలూ వున్నాయి. ఆల్‌ఫ్రెడ్ అనుభవాన్నిపట్టి అది చాలా సంభవమనికూడా ఊహించవచ్చు. కాబట్టి కోటేశ్వరరావు తనకు తెలియకుండా యీపని చేశాడనడానికి వీల్లేదు. ఐతే దీనికి మరోలా సమాధానం చెప్పుకోవాలి. కోటేశ్వరరావుకు మధుమతి మీద అపారమైన విశ్వాసముంది. ఆల్‌ఫ్రెడ్‌కాదు దేవేం

్రుడు దిగివచ్చినా మధుమతి నేమీ చేయలేరు. యీ కారణంచేతనే కోటేశ్వరరావు మధుమతి కోరిన స్వేచ్ఛనంతా ఇస్తున్నాడు. ఇదొకరకమైన సమాధానం. ఐతే కోటేశ్వరరావు మధుమతిని గుంటూరులోని కొందరు వర్తకులు భార్యలను ఎరగావేయడానికి వాడుకున్నట్లే తననూ వాడుతున్నాడని అనుకోడానికి అవకాశం లేదా? ఉంది.

ఈ మాట కోటేశ్వరరావు స్పష్టంగా చెప్పాడా?

చెప్పలేదు.

ఎందువల్ల?

ఇలాంటి విషయాలు వాచ్యంగా ఎవరూ చెప్పరు. పరిస్థితులనుబట్టి అర్థంచేసుకుంటూపోతూవుండాలి. ఆల్‌ఫ్రెడ్‌లోని స్త్రీ వ్యసనాన్ని ఆధారంగాచేసుకొని పొగాకు రైతులు వ్యాపారంచేసుకోవడం తెలిసిన కోటేశ్వరరావు ఫ్రీలవ్ సొసైటీలో సభ్యురాలు చాలా మోడ్రన్ గర్ల్ అయిన తనను ఆల్‌ఫ్రెడ్‌ను సేవించమని చెప్పడంలో అర్థమేమిటి? యీ సేవ అనే మాటకు ఎంతవరకు అర్థం చెప్పుకోవాలి? ఎంతవరకైనా చెప్పుకోవచ్చు. ఎవడికి తోచినంత వాడు ఎవడి అవసరానికి వచ్చినంత వాడు.

మధుమతి తీవ్రంగా ఆలోచిస్తున్నది.

కోటేశ్వరరావు చూడకూడని దృశ్యం చూశాడు. అలాంటి దృశ్యంచూచే పరిస్థితి లేకపోలేదని కోటేశ్వరరావుకు తెలియక పోలేదు కానీ ఊహ వేరు వాస్తవం వేరు. ఊహించిన దానికన్నా విన్నది బలంగావుంటుంది. విన్నదానికన్నా కన్నది తీవ్రంగా వుంటుంది. ఇందులో ఇంకో రహస్యంవుంది. మధుమతి అవినీతి పరురాలు కాదని కోటేశ్వరరావు నమ్ముతూ ఉండవచ్చు, లేదా నమ్మినట్లు తనలో తాను నటించుకుంటూ వుండవచ్చు. కానీ ఆ విషయాన్ని ప్రత్యక్షంగా చూచినప్పుడు తానికతప్పించుకోలేని ఒక పరిస్థితి ఎదురౌతుంది. చూచిన విషయం మీద వెంటనే చర్య తీసుకోక తప్పదు. అది కొన్ని సంఘటనల పరంపరకు దారితీస్తుంది. ఆ దృష్ట్యా కోటేశ్వరరావు తనకిష్టంలేకపోయినా తనను వదిలేసి కర్నపాలెం పోయాడా?

సూర్యాన్ని కర్లపాలెం పంపించింది. తనకు వంట్లో బాగా లేదని అర్జంటుగా ఓసారి వచ్చిచూచి పొమ్మని కబురుపెట్టింది. సూర్యం మరునాడు తిరిగివచ్చాడు.

"వదినా ఇసుక నేలల్లోవేసిన వేరుశెనగ పంటకు వేరు పురుగుపట్టిందిట. ఇది ఎస్టా క్లోరీన్, లిండేన్, ఆల్డ్రిన్ అనే మూడు మందులు విజయవాడనుంచి అర్జంటుగా పంపించమని నాతో చెప్పాడు. వీటికి అక్కడ గిరాకీ ఎక్కువగావుందట. "వదినె అర్జంటుగా రమ్మన్నదన్నాయ్" అన్నాను అన్నయ్య విని విననట్లు ఊరుకున్నాడు. ఇప్పుడు విద్యానందం అన్నయ్య చేతికింద పని చేస్తున్నాడు. అర్జంటుగా మునుస్వామిదగ్గరికిపోయి యీ మందులు యేర్పాటుచేయమన్నాడు. "వదినెతో యేం చెప్పమంటావు" అని మళ్ళీ అడిగాను.

"చూద్దాంలే. వెళ్ళు." అన్నాడాదిన.

మధుమతి కళ్ళు ఎర్రబడ్డాయి. ఆమె రక్తంలో అంతర్నిహితంగావున్న అహంకారమూ నిర్లక్ష్యమూ బయటకు ఉప్పొంగాయి. "యేమిటీ కోటేశ్వరరావు గొప్ప? తనకన్నా అందగాడు కాదు. ఆస్తికలవాడుకాదు. తాను స్త్రీ ధనంకింద తెచ్చుకున్న పొలంతోనే కోటేశ్వరరావుకు అదృష్టం తిరిగింది. ఇప్పుడు తాను విజయవాడలో పెద్ద జమీందారిణి. తనకు ఎందరో ఉన్నతోద్యోగుల భార్యలు స్నేహితురాళ్ళు.

తన స్టేటస్ యేమిటి?

కోటేశ్వరరావు స్టేటస్ యేమిటి?

మధుమతి మనస్సే ఒక క్షీరసాగరమయ్యింది. అందులోనే ఒకవైపు దేవతలు ఒకవైపు అసురులు నిలబడి చిలుకుతున్నారు. కౌస్తుభమణి, ఐరావతం, ఉచ్చైశ్రవము చందమామ, లక్ష్మీదేవి, కీర్తిప్రతిష్ఠలు విహారాలు సామాజిక గౌరవము జమీందారిణి.... హాలాహలం పుట్టింది. మధుమతి దీనిని మ్రింగలేకపోతున్నది నిద్రపట్టటంలేదు. ట్రాంక్విలైజర్స్ తీసుకుంటున్నది. బయట సభలు, సన్మానాలు. ఆటోగ్రాఫులు చప్పట్లు, ఊరేగింపులు ముగిశాక ఇంటికివచ్చి చూస్తే అశాంతి. చిత్తక్షోభ. యీ బాధను మరిచి

పోవడంకోసం ఓ చుక్క చప్పరిస్తుంది. చప్పరిస్తున్నకొద్దీ ఇంకా బాధ మంటా....

ఆ సంవత్సరం కోటేశ్వరరావు వ్యాపారం దెబ్బతిన్నది. కారణమేమో తెలియదుకానీ ఆయన పొగాకుకు గిరాకీలేకుండా పోయింది.

"బారన్లు కూల్చేస్తాను బేళ్ళు తగలేస్తాను పొలాలు నాశన మైనా ఫరవాలేదు కానీ నేనీ తెల్లతోలుమీద ప్రతీకారం తీర్చుకుం టాను" అన్నాడు కోటేశ్వరరావు.

గుంటూరు వ్యాపారస్తులలో మంచివాళ్ళెంతమందివున్నారో వెధవలూ అంతేమంది వున్నారు. ఊరికే యేమీ లేనిచోటనే ఉప్పు నిప్పూ పుట్టిస్తుంటారు. ఇలాంటిది జరిగితే ఇంక చెప్పేదేముంది? కోటేశ్వరరావంటె గిట్టనివాళ్ళు కథలకింద అల్లారు అది తీగ తొడిగి. మారాకువేసి శాఖోప శాఖలై కాయలు కాచి పండ్లు పండింది, "కోటేశ్వరరావు తాగి దొరఇంట్లో పనిచేసే ఆంగ్లో ఇండియన్ ఆడదాన్ని ముద్దుపెట్టుకోపోయాట్ట దానికి దొరకుకోపం వచ్చి నాలుగు తన్నాడట" ఇదొక కథ.

"దొరకు కోటేశ్వరరావు మధుమతిని ఎప్పుడో ఇచ్చేశాడట అయితే అప్పుడప్పుడూ కోటేశ్వరరావు మళ్ళీ తాను వాడుకుంటూ వుండేవాడట దొరను మరిగిన మధుమతి కోటేశ్వరరావు రమ్మంటే రావడం మానేసిందిట. దాంతో కోపంవచ్చి కోటేశ్వరరావు మధు మతిని కొట్టాడట అదివిని దొర కోటేశ్వరరావుని కొట్టాడట" ఇదొక కథ.

"కోటేశ్వరరావు దొర కలిసి దొంగ బంగారం వ్యాపారం చేస్తూంటారట. స్మగ్లింలో పంపిణీలు చాలక వాటాలు కుదరక ఇద్దరూ కొట్టుకున్నారట. దాంతో దొర పగబట్టి కోటేశ్వరరావు వ్యాపారం నాశనం చేస్తున్నాడట" ఇదొక కథ.

"కోటేశ్వరరావు దగ్గర మునుస్వామి అని ఓ గుమాస్తా ఉన్నాడట, వాడూ పాలేరు రత్తయ్య కలిసి అంతా దోచేస్తున్నారట. అప్పులవాళ్ళు మీద పడితే భరించలేక కోటేశ్వరరావు ఆత్మహత్య చేసుకోబోయాడట. ఎవరో చూచి తప్పించారట" అలా ఇలా....

మధుమతి వస్తుందేమోనని కోటయ్య ఎదురు చూచినమాట వాస్తవమే. కానీ ఆమె రాకపోయేసరికి అతనిలో వున్న మగతనం మేలుకున్నది. పనులమీద విజయవాడ వెళ్ళినా పనిచూసుకొని మళ్ళీ బస్టాండుకు వచ్చేవాడే కానీ సత్యనారాయణపురం ఎటువుందో తిరిగి చూడలేదు.

ఒకనాడు ఉష ట్యుటోరియల్ కాలేజీ లోంచి బయటికి వస్తున్నది. దూరంగా కోటేశ్వరరావు పోతూ కనిపించాడు. "డాడీ" అంటూ ఉష పరుగెత్తింది. కోటేశ్వరరావు ఉషను గట్టిగా కాగిలించుకున్నాడు. అతని కన్నుల వెంట జాలువారిన నీరు ఉష తలను తడిపివేశాయి. రోడ్డుమీది వాళ్ళంతా చూస్తున్నారు.

"పద నాన్నా ఇంటికెళదాం"

"వద్దమ్మా నాకు పనివుంది. హోటలుకెళదాం పద"

హోటల్‌కెళ్ళి సర్వర్‌కేవో ఆర్డరిచ్చాడు. ఉష కబుర్లు చెపుతుంటే అలా తన్మయంతో కోటయ్య వింటున్నాడు. ఉష బాగా చిక్కిపోయింది. కన్నులు గుంటలు పడ్డాయి కోటమ్మకు ఉష అంటే ప్రాణం. కోటమ్మ పోయిన దరిమిలా ఉషలో చెప్పలేని బెంగ ఏ మూలనో దాక్కుంది. దానికి తోడు, తండ్రి కనపడక పోవడంతో ఉష బాగా దిగులు పడిపోయింది.

"నేను చాలాసార్లు కర్లపాలెం వెళతానని గోలచేశాను నాన్నా అయితే నన్నెవరూ తీసుకుపోలేదు. సూర్యం బాబాయికూడా"

"అలాగా అమ్మా" కోటయ్య కన్నీటి బిందువు నీళ్ళ గ్లాసులో పడింది. "వచ్చేయాలిసిందమ్మా"

"ఇప్పుడైనా నీవు అకస్మాత్తుగా కనపడబట్టిగానీ లేకపోతే నాకేమిటో రోజూ పిచ్చిగా ఉంటుంది నాన్నా"

"ఔనమ్మా నేనేదో ఎరువుల పనిమీదపోతూ అనుకోకుండా ఇటు వచ్చాను." అబద్ధమాడాడు. తాను ఉష కోసం చెట్టు క్రింద కొన్ని గంటలునుంచి ఎదురుచూస్తున్న సంగతి చెప్పలేదు.

"నాకు నీతో వచ్చేయాలనుంది నాన్నా."

"వచ్చేయమ్మా. ఇలాగే వచ్చేయ్."

"వస్తే అమ్మేమౌతుందో!"

"ఏంకాదు, దానికి కమలాక్షులు వనజాక్షులు చాలామంది వున్నారు."

"అమ్మో రాలేను. రాకుండా ఉండనూలేను."

మరో క్షీరసాగర మథనం-

"పోనీలేమ్మా ఇంటికెళ్ళు. చూడు నేను నిన్ను చూచినట్లు నీవు ఇంట్లో అనకూడదు. ఒట్టు."

"ఒట్టు."

కోటేశ్వరరావు ఉషను ఇంటి సందువైపు రోడ్డుమీద వదిలి పెట్టి వెళ్ళిపోయాడు. ఉష వెనక్కి వెనక్కి తిరిగిచూస్తూ వెక్కి వెక్కి ఏడుస్తూ ఇంటికిపోయింది.

"ఎందుకేడుస్తున్నావు." మధుమతి ఇంగ్లీషులో ప్రశ్నించింది.

"ఎందుకంటే డాడీ........"

"ఏం డాడీ గుర్తుకు వచ్చారా?"

"ఔను ఔను. మా క్లాస్‌మేటుకు బర్త్‌డే అయితే వాళ్ళడాడీ గౌను కొనిచ్చారు. నా బర్త్‌డేకి ఎవ్వరూ రాలేదు."

"ఏడవకు. నీ స్నేహితురాలు కాదుకదా, విజయవాడలో ఎవ్వరూ చేసుకోనంత ఘనంగా నీబర్త్‌డే చేయిస్తాను. అటు పాప్ మ్యూజిక్కు ఇటు బాలమురళీకృష్ణ, రెండూ పెట్టిస్తాను."

"అన్నీ పెట్టించగలవు. అందరూ వస్తారు. కానీ నాన్న మాత్రంరాడు. ఎందుకు రాడో తెలియదు. ఆయనరాని లోటు వీళ్ళు ఎందరు వస్తే మాత్రం తీరుతుందమ్మా. అందరూ వచ్చినాతీరదు."

మధుమతి నిశ్చేష్టురాలైంది. ఒక్కొక్క మాటా మధుమతి చెంపమీద ఫెడీఫెడీమని దెబ్బకొడుతున్నట్లైంది. మళ్ళీ క్షీరసాగర మథనం.

మధుమతి కమలాక్షి ఇంటికిపోయింది. అప్పటికి కమలాక్షి లాయరు గోవిందరావు ఏదో చర్చిస్తూ విరగబడి నవ్వుతున్నారు.

"రండిరండి సహయానికి వచ్చారు" అన్నాడు గోవిందరావు.

"ఏమిటి అదోలావున్నారు?" కమలాక్షి ప్రశ్నించింది.

"ఏదో మనసు బాగోలేక"

"అలాంటి మాటలుమన డిక్షనరీలోంచి తొలగించివేయాలి. గౌతమబుద్ధుడుకూడా మనసు బాగోలేక సన్యసించాడు. మనసులు ఎవరికీ బాగావుండవు. మనము బాగుచేసుకోవడం కోసమే ఈ కార్యక్రమాలన్నీ నడుపుకుంటున్నాం."

లోపలినుండి బోయ్ మూడు గ్లాసులు, ఐస్, ఓ సీసాతెచ్చి టేబిల్‌మీద పెట్టాడు.

"సోడా తెప్పించమంటారా?" గోవిందరావు ప్రశ్నించాడు.

"థాంక్స్. అక్కరలేదు" అన్నది మధుమతి.

గోవిందరావు మూడుగ్లాసులలోనూ ఐస్‌వేసి నిండునింపి, "మధుమతి మనస్సు బాగయ్యే నిమిత్తం" అని ఇంగ్లీషులో అని పట్టించాడు.

మధుమతి చప్పరిస్తున్నది.

కమలాక్షి మొదలుపెట్టింది.

"మేమిప్పుడో టాపిక్ సీరియస్‌గా చర్చిస్తున్నాం. మన అలివేలుమంగ లేమా అనే వెంకటసుబ్బయ్య భార్య. ఆవిడకు కాల్చి తగలేసేంత అస్తివుంది. వడ్డీలమీద వడ్డీలు పెరిగి ఇంకా భూమి ఎక్కువైంది. త్వరలో భూసంస్కరణలు రాబోతున్నాయని హాట్‌లైన్స్ నుంచి రహస్య సమాచారాలు ముందే ప్రముఖుల కందాయి? దాంతో ఆవిడకు గంగవెర్రులెత్తింది. అగ్నిసాక్షిగా వివాహమాడినవాళ్ళు లాయరుముందు విడాకులుపుచ్చుకుంటున్నారు? ఇరువురూ రెండు ఇళ్ళలో ఉంటారు. రెండు ఆస్తులు. రెండు ఎకౌంట్సు అఫ్‌కోర్స్ వెంకటసుబ్బయ్య ఎవరూ చూడకుండా అప్పుడప్పుడూ మాత్రం రాత్రిపూట అలివేలుమంగ దగ్గరికి వచ్చి పోతుంటాడు."

"అలివేలుమంగకు కడుపొస్తే?" గోవిందరావు ప్రశ్నించాడు

"అప్పుడది సమస్యే. విడాకులు పుచ్చుకున్నది మొగుడు చచ్చినదానితో సమానం. విడాకుల మంగకు కడుపు వచ్చిందని విడ్డూరంగా చెప్పుకుంటారు. దీనికి రెండు పరిష్కారాలున్నాయి. ఒకటి ఏబార్షన్, రెండు ఆపరేషన్."

"ఆపరేషనే మంచిది. ఏమంటావు మధుమతీ" గోవిందరావు తూగుతూ అంటున్నాడు.

"అదే మంచిది. అందుకే నేనూ అదే చేయించుకున్నాను. మొగుడుండీ అనధికారికంగా నేను విడాకులు పుచ్చుకున్నదానితో సమానం" అన్నది మధుమతి కళ్ళు తేలుస్తూ.

"ఏం వచ్చింది. మీ ఆయనకి మాయరోగం? గోవిందరావు ప్రశ్నించాడు.

మధుమతి ఈజీచెయిర్‌లో చేరగిలబడి కళ్ళుమూసుకున్నది. కమలాక్షికి కిక్ ఎక్కింది దాంతో ధోరణి పెరిగింది.

యేముంది గోవిందుడూ అందరికీ తెలిసిన ముచ్చటే. మన మధుమతి బ్యూటీ కంటెస్టులో ప్రైజ్ తెచ్చుకున్నది. ఈమెఫోటో పేపర్లలో పడింది అప్పటినుండి ఎందరో ఈమె వెంటపడ్డారు కోటేశ్వరరావుకి జెలసీ అదిభరించలేక యేడుచుకుంటూ పోయినాడు ఇంతే వెరీసింపుల్. కదూ"

మధుమతి మత్తుతో మాట్లాడలేదు.

"ఇది మాట్లాడడం లేదే" గోవిందరావు అన్నాడు.

"స్పృహ తప్పిపోయినట్లుంది గాడిదకి. ఇది జమీందారిణి కాదు గాడిదగుడ్డు కాదు. పొలాలమ్ముకొని టస్సీలో జల్సాచేస్తున్న రంకుముండ. కూతురి చదువు కేవలం దీనికో నెపం. బ్రోతల్ హౌస్ ఓపన్‌చేస్తే యే మొగుడైనా ఎట్లా వప్పుకుంటాడు."

"ఇంకా నాలుగురోజులుపోతే కూతురిచేతకూడా పెట్టిస్తుంధా దుకాణం."

"ఆ అదొక చిన్న చెరుకుగడలా ఉంది. చూస్తుండగానే ఎదిగిపోతున్నది."

"అయ్యో అయ్యో అది ఎదిగేటప్పటికి నేను ముసలివాడినై పోతానో యేమో?" గోవిందరావు నిట్టూరుస్తున్నాడు.

"చాల్లే నోరు మూసుకోరా గోవిందుడూ! నీకు తల్లులూ కావాలి. కూతుళ్ళుకూడా కావాలి."

"వింటున్నానురా. నాకన్నీ వినపడుతూనే ఉన్నాయి"అన్నది మధుమతి. అన్నాననే అనుకున్నది మధుమతి. ఆవిడ పెదవులు కదిలాయి. కాని మాటలు బయటికి రాలేదు. తూలుతూలేచి బయటికి వచ్చి ఓ టాక్సీని పిలిచి ఇంటికిపోయింది. అప్పటికి బాగా పొద్దు పోయింది. సూర్యంవచ్చి తలుపు తీశాడు.

ఉష నిద్రపోయింది వదినా నేను చదువుకుంటున్నాను."

మధుమతి పక్కమీద జారగిలపడింది. ఆమెకు సగం కలా సగం ఇలగా వుంది.

"ఆకలిగా వుందిరా"

సూర్యం భోజనంతెచ్చి మధుమతి పక్కమీద పెట్టాడు. మధుమతి కొంచెంతిని సయించక చెయి కడుక్కున్నది. ఆమె శరీరమంతా మండుతున్నది. ప్రతి రక్తనాళమూ విద్యుత్తును ప్రవహిస్తున్నది. కళ్ళు తిరుగుతున్నాయి. సూర్యంవచ్చి కంచం!గ్లాసు తీసుకొని వెళ్ళిపోయాడు. చేతులు కడుక్కుని ఎంగిలిపడ్డ బ్లాంకెట్ తీసి వేరే ఉలెన్ బ్లాంకెట్ తీసిఇచ్చాడు. మధుమతి సూర్యం రెండు చేతులూపట్టుకున్నది."ఇదిగో నన్నుగురించి అంతా యేమేమో అనుకుంటున్నారు "అనుకోనీ"

"రైట్ మంచిమాట చెప్పావ్. నాకు మాత్రం గౌరవంగా బ్రతకాలని వుండదా? నాకూ కోరికలు లేవా? ఈ అనేవాళ్ళంతా దేవతలా?"

మధుమతి కళ్ళకు సూర్యం కోటయ్యలా కనపడుతున్నాడు. మధుమతి సూర్యాన్ని గట్టిగా కౌగలించుకుంది.. నలిపివేసింది. మధుమతి శరీరం భగ్గున మండుతున్నది. ఆవిరులు పొంగుతున్నాయి. సూర్యం పెదవిని గట్టిగా కొరికింది పెదవి పగిలి రక్తం చిమ్మింది.

"వదినా! అమ్మా! అమ్మా!" పెద్దగా అరిచాడు.

అమ్మా అన్న అరుపు మధుమతి మస్తిష్కంలో కొన్నివేల డెసీబెల్స్ ధ్వనిని సృష్టించింది. మధుమతి హిమాలయ పర్వతమైంది. వేడీ మత్తూ దిగిపోయాయి.

"అమ్మ తను సూర్యానిక అమ్మ-కోటమ్మ—"

సూర్యం గదిలోంచి వెళ్ళిపోయాడు. మధుమతి తలను మంచానికి కొట్టుకొని యేడిచింది.

బయట గాలివాన.

ఉరుములు మెరుపులు మిన్నువిరిగి మీదపడ్డట్టు. గోవిందరావు ముద్దు పెట్టుకుంటున్నాడు. గొంగళిపురుగు పాకినట్లు దృశ్యం.

కుండపోతగా నీళ్ళు కిటికీలు కొట్టుకుంటున్నాయి.

కమలాక్షి వనజాక్షి ఫ్రీ లవ్ గురించి సాగిస్తున్న చర్చలు.

హేవలాక్ హెల్లీస్. వాత్స్యాయన కామసూత్రాలు.

బయట ఎవరో మనుషులు తలుపులు బాదుతున్నట్లు వాన జల్లు ధనా ధనా కొడుతున్నది.

"దొర దయతలిస్తే లక్షల వ్యాపారం ఆయన అతిథ్యం జాగ్రత్తగా చూడు."

"మాకు మీదేశస్తులంటే ఎంతో ప్రేమ" చెవిలో సన్నగా దొర గుస గుస.

ఆకాశం ఫెళఫెళ ఉరిమింది. ఎక్కడో పిడుగు పడింది. ఉష ఉలిక్కిపడింది.

జమీందారిణీ కాదు గాదిదగుడ్డూ కాదు. పొలాలమ్ముకొని బస్తీలో జల్సాచేస్తున్న రంకుముండ. కూతుర్నీ ఈ వృత్తిలోనే పెడుతుంది. అదీ చెరకుగడలా యెదిగింది." నవ్వులు. అన్నిదిశలా నవ్వులు. అందరినోటా నవ్వులు. వికటాట్టహాసాలు.

విజయవాడ విరగబడి నవ్వుతున్నది.

కర్లపాలెం పగలబడి నవ్వుతున్నది.

తన ప్రతిష్టా సభలు, సన్మానాలు అంతా మిథ్య. ఫాల్స్ ప్రిస్టేజ్. తనచాటున సమాజం తనను గురించి అనుకుంటున్నదే నగ్నసత్యం.

"వదినా ! అమ్మా ! అమ్మా ! సూర్యం కేక. ఆకాశంవిరిగి పడ్డట్టు. భూకంపం వచ్చినట్లు ధ్వనులు. మధుమతి స్పృహతప్పి పడిపోయింది.

# 12

కర్లపాలెంనుంచి వార్తలు వచ్చాయి. కోటేశ్వరరావు ఆర్థికంగా బాగా చితికిపోయాడు. ఎరువుల దుకాణం ఎత్తేశాడు. నిత్యానందంక్రింద తానే గుమాస్తాగా చేరాడు.

ఆరోజు రాత్రి వచ్చింది మామూలు తుఫానుకాదు. ఓ జల ప్రళయంవంటిది. పంటపొలాలన్నీ బంజరు భూములుగా మారి

పోయాయి. సుక్షేత్రాలమీద మట్టి మేటపడింది. ఎందరో రైతులు దివాలాతీశారు. ప్రభుత్వం సబ్సిడీ ఇచ్చినా దున్నుకోలేని దుస్థితి. కోటీశ్వరరావు కోటయ్య అయినాడు. కోటయ్య కోటిగాడు అయినాడు. ఇప్పుడు తానేరైతు తానే పాలేరు.

సూర్యం బస్తీచదువు మానుకొని చేదోడుగా అన్న దగ్గరికె వెళ్ళిపోయాడు. మధుమతి మిగిలిన పొలాలుకూడా అమ్ముదామని బేరం పెట్టిందిగానీ పాతికవేల పొలం పదివేలకిస్తానన్నా ఎవ్వడూ రావడంలేదు. "అర్జంటుగా ఓ పదివేలు కావాలి." మధుమతి కమలాక్షిని ఫురానాగా అడిగింది.

కమలాక్షి మధుమతివైపు విచిత్రంగాచూచి ఓనవ్వునవ్వింది. "సారీ మేడమ్ బస్తీలో అన్నీ దొరుకుతాయి అందం అధికారం ఇళ్ళు, మేడలు, మిద్దెలు, సన్మానాలు, చప్పట్లు. అయితే ఇవన్నీ మనం డబ్బుపెట్టి కొనుక్కోవాలి డబ్బంటే అరచేతిలోవైకుంఠం"

ఈ ఉపన్యాసాలు నాకూతెలుసు. అర్జంటుగా ఓ పదివేలు ఇవ్వండి. లేదా ఇప్పించండి."

"ఏమీ అనుకోవద్దు. జమీందారిణి అప్పుచేసిందంటే అది చాలా అవమానం. అన్నట్లు శామ్సన్ అండ్ దలైలా వచ్చింది. బిబ్లికల్ పిక్చర్ చూసితీరాలి టిక్కెట్లు బుక్ చేయించమంటారా?"

"సినిమాను గురించి ఆలోచించే చిత్తశాంతి నాకులేదు. ముందు డబ్బుకావాలి."

కమలాక్షి సీరియస్‌గాచూసి, అలా అయితే ఓ పని చేద్దాం. మీ జమీందారీలో ఓ చిన్నపీస్ మార్ట్‌గేజ్‌చేద్దాం పదివేలేమిటి పాతికవేలిప్పిస్తాను ఓ. కే.?"

"నాకు జమీందారీ అంటూ యేమీలేదు ఉన్నపొలం అంతా అమ్మేశాను. ఇక పోతే జవహరీ ఇంతకుముందే మార్ట్‌గేజ్ చేయబడివుంది."

అదివినగానే కమలాక్షిముఖంలో రంగులు మారిపోయాయి. తనకెదురుగా ఓ మనిషి వున్నసంగతే మరచిపోనట్లు నటించి ఫోన్ తీసుకొని ఎవరెవరితోనో మాట్లాడటం మొదలుపెట్టింది. మధుమతి సహనంతో నిరీక్షిస్తున్నది.

కమలాక్షి ఒకనంబరు తరువాత ఒక నంబరు డయల్‌చేస్తూ తనపని తాను చేసుకుంటూ వెళ్ళిపోతున్నది.

మధుమతి చాలాసేపు నిర్విణ్ణురాలై కూర్చున్నది.

"ఇక నే వెళ్ళనా?" అన్నది కొంతసేపటికి.

"ఓహ్ మీరింకా ఇక్కడే వున్నారా? విష్‌యూ బెస్ట్‌అఫ్ లక్" అంటూ విలాసంగా ఓ మాగజైన్ చేతిలోకి తీసుకుంది.

కమలాక్షి తనచెంపమీద ఛెళ్ళుమని కొట్టినట్లుఅనిపించింది. మధుమతి కళ్ళలో నీళ్ళుతిరిగాయి. కోపంతో ఆమె ముక్కుపుటాలు అదిరాయి, కమాలాక్షిపేర బ్యాంకులో ఎంత అకౌంటువుందో మధుమతికి తెలియకపోలేదు. ఆమె పేరుమీదనేకాక అసోసియేషన్ పేరుమీద కూడా కొంతడబ్బుంది. కమలాక్షి ఇవ్వదలిస్తే ఇవ్వ వచ్చు. కానీ....

"దాను అడగడానికి వచ్చేసరికివిష్ణుమూర్తే వామనుడైనాడు. కమలాక్షి అప్పులు చేసే వాళ్ళతో స్నేహం చేయదు.

ప్రగతి మహిళామండలి సభ్యులెవరూ కూడా చేయరూ. జమిందారిణిగా ఉన్నంతవరకే మధుమతికి గౌరవం. డబ్బులేని మరునాడు మధుమతి విజయవాడ వీధిలో ఒక మల్లమ్మ.

మధుమతి యింటికి వచ్చింది.

ఎదురుగా ఫ్రిజ్ గ్రైండర్ ఎలక్ట్రిక్ స్టవ్ గీజర్. మిగతా ఫర్నిచర్ ఆమెనొకసారి వెక్కిరించాయి. ఎదురుగా ఉన్న పెంకు టింట్లో పార్వతమ్మగారు పాట పాడుకుంటున్నారు.

"కస్తూరి రంగ రంగా....

కావేటి రంగ రంగా...."

పార్వతమ్మ ధనవంతురాలు కాదు. ఆవిడకి సోషల్ స్టేటస్ లేదు. ఏ క్లబ్బులోనూ సభ్యురాలు కాదు. కాక్‌టెయిల్ పార్టీపేరు మీద తాగడమూ, ఫ్రీ లౌ సొసైటీ పేరు మీద వ్యభిచరించడమూ ఆమె ఎన్నడూ విని ఉండలేదు. ఆర్థికంగా ఆమె ఉన్నతపరిస్థితిలో లేదు. వాళ్ళ పిల్లలు వీధి బడిలో చదువుతున్నారు. బియ్యానికి పప్పుకు ఆమె పక్కింటికి అప్పు వెళుతూ వుంటుందికూడా. ఆమె భర్త ప్లీడరు గుమాస్తా. పెద్ద సంపాదనాపరుడు గాదు, అందగాడు

కాదు, మేధావి కాదు. కానీ పార్వతమ్మ ముఖంలో ఎప్పుడూ చిరునవ్వు చెరదలేదు, ఆమె చాలా సార్లు శ్రావణ శుక్రవారాలకు మధుమతిని పేరంటానికి పిలిచింది. కానీ తన స్టేటస్‌కు తక్కువని తాను మాను కున్నది. రాదని తెలిసి ఆ తర్వాత పార్వతమ్మ కూడా తనను పిలవడం మానేసింది. ఒకరోజు మొగుడు కోపంతో కొడితే పార్వ తమ్మ కన్నీళ్ళు పెట్టుకోవడం ఆ బజార్లో అందరికీ తెలుసు.

కానీ పార్వతమ్మ లేచిపోలేదు. విడాకులు కోరలేదు. ఆ తరువాత తాను చేసిన తప్పుకు పశ్చాత్తాపపడి పార్వతమ్మ మొగుడు ఆమె కాళ్ళపై పడి ఓ చీర కొనిచ్చాడని బజార్లో అంతా చెప్పుకున్నారు,

"ఇదిగో మా అయన పండక్కు కొనిచ్చిన చీర" అని పార్వతమ్మ ఆ చీర కట్టుకొని వీధిలో అందరికీ చూపించుకొని మురిసిపోయింది. పార్వతమ్మకు కష్టాలు పెరుగుతున్నకొద్దీ సహనం పెరుగుతున్నది, సంతృప్తి పెరుగుతున్నది.

దీనికి కీలకం ఏమిటి?

అదేమిటో పార్వతమ్మను అడిగి మధుమతికి తెలుసుకో వలసిన అవసరం లేదు.

తనకు తెలుసు. కర్ణ పాలెంలో ఉండేటప్పుడు గొబ్బెమ్మలు పెట్టుకొని గుమ్మడి పూలకోసం జట్లు జట్లుగా స్నేహితురాండ్రతో కలిసి తాను వెళ్ళే రోజుల్లో ఉండిన ఆనందంలో నూరవ వంతు ఈనాడు లేదు.

"శ్రీరామచంద్రు డపుడు
పట్టాభిషిక్తుడై కొలువుండగా...."

అమాయకంగా నిద్రపోతున్న ఉష ముంగురులను మధుమతి సర్దింది. మధుమతి వెళ్ళి పక్కమీద పడుకుంది. ఆమెకు నిదుర పట్టడంలేదు. వళ్ళంతా భారంగా ఉంది. మధుమతి ఎల్. ఎస్. డి. ని అలవాటు చేసుకుంది. అది లేకుండా ఇప్పుడు నిదుర రావటంలేదు. సిరి అబ్బలేదుగానీ, చీడ అబ్బింది అనుకున్నదీ మధుమతి. ఓ టాబ్లెట్ మింగింది. ఆమె రక్తనాళాల్లోని ప్రవాహ వేగం మారింది. వళ్ళంతా గాలిలో తేలిపోతున్నట్లుగా ఉంది.

మధుమతి కళ్ళు మూసుకొని పడుకున్నది. 'కమలాక్షి తిరుగుబోతు' అన్నది అస్పష్టంగా. 'ఈ గాపిద కు సంస్కారమేమిటి?' అన్నది. అంతశ్చైతన్యంలో ఆమెలో ఉన్న భావాలు ఇప్పుడు స్వేచ్ఛగా పడగ విప్పి బయటికి వస్తున్నాయి. 'ఈ గోవిందరావుకు అందరూ పెళ్ళాలే. పెళ్ళ భూతం అయినా పీడికి తృప్తిలేదు, అందుకే ఆ కమలాక్షి పీడి రాగం బాగా కుదురుస్తున్నది. దానికి ఊరంతా మొగుళ్లే. ఆ ముండకు బ్యాంకులో లక్షరూపాయలు క్యాష్ ఉంది. పడవేలు ఏం పెద్దలెక్కా?' మధుమతి మత్తుగా పడుకుంది.

"నేను పొలాలమ్ముకుని బస్తీలో జల్సా చేస్తున్న రంకుముండనా. జమీందారిణిని కానా? మీ బ్రతుకులు నాకు తెలియవా? సర్వెంటు జాన్‌తో సరసాలాడే వనజాక్షి, లైసుమిల్లు ప్రొప్రయిటరుకు పక్కలేసిన రంభ కమలాక్షి పీళ్ళంతా పతివ్రతలురోయ్. నేను రంకుముండను." మధుమతి నిద్రపోయింది.

* * *

మత్తుగా అలా చాలాకాలం సాగిపోయింది.

ఉష నిజంగా చెరుకుగడలాగే పెరిగి పెద్దది అయింది. విజయవాడలోని అందాలలో ఉష కూడా ఒకటి. ఆమెను మద్రాసుకు తీసుకుపోయి సినిమాలలో చేర్పిస్తానని ఓ ప్రొడ్యూసరు మధుమతిని కోరాడు. అతడు లోగడ రెండు సినిమాలు తీశాడు. అందులో ఒకటి నూరు రోజులు ఆడింది కూడా. అయితే మధుమతికి మాత్రం నమ్మకం కలుగలేదు. ఆమె అంతరాంతరాలలో లక్ష్మి స్మృతి అలా నిర్లిప్తంగా నిలిచే ఉంది.

ఉష ఆ సాయంత్రం బాగా పొద్దుపోయి ఇంటికి వచ్చింది. "జేమ్స్ సాయంత్రం క్లాసులు తీసుకున్నారు మమ్మీ."

"ఎందుకు అబద్ధం చెపుతావు. జేమ్స్ ఇప్పటిదాకా మాతో మీటింగులో ఉన్నాడు."

ఉష వణికిపోయింది.

"అర్థమయ్యింది. ఏదో దాయాలని ప్రయత్నిస్తున్నావు. ఎవడే వాడు?"

"వాడెవడమ్మా?"

"ఎవడా? నిన్ను షికార్లకు తిప్పినవాడు. నన్నిక బుకాయించకు. నేను నీ అమ్మనే. నాకీ టీనేజర్ల సంగతి బాగా తెలుసు."

"ఏం లేదమ్మా-నేనూ, గోపతి కలిసి సినిమాకు వెళ్ళాము. చెపితే ఏమన్నా అంటావేమోనని."

"మంచిది. వెళ్ళి డ్రస్ మార్చుకొని కాఫీ తెచ్చుకో."

ఉష లోపలికి వెళ్ళింది.

మధుమతి ఉష పుస్తకాలు పరిశీలించింది.

అందులో అట్టలమాటున ఓ సెక్సు పుస్తకం ఉంది. దాని అట్టమీద "ప్రియమైన ఉషకు. (టు. మైడియర్ ఉష)" అని ఉంది. మధుమతి కళ్ళనుండి చింతనిప్పులు రాలాయి. ఉషను చిన్న చిన్న ముక్కలుగా కోయాలని అనుకున్నది. కానీ ఒక్క క్షణం పస్తాయించింది. తనకున్న ఒకే ఒక ఆధారం ఉష. దానినే దూరం చేసుకుంటే తన బ్రతుకేమౌతుంది? లంతే లక్ష్మిలా భయపడి పారిపోతుంది. వయసులో ఉంది. ఏ వయసుకా బుద్ధులు. తను, కమలాక్షి, వనజాక్షి, రమణి పెళ్ళైన పిల్లలుండి రంకుముండలు కాలేదా? ఓహో కమలాక్షి జోస్యం ఫలించింది. దాని విషవాక్కు నిజమైంది. ఉష నిజంగానే చెరుకు గడ అయ్యింది, నమిలి పారేసిన పిప్పి కావడానికి, దానినిండా ఈగలు మూసరడానికీ ఇంకా అట్టేకాలం పట్టదు. "అమ్మా ఉషా, ఏమ్మా ఉషా." మధుమతి ఏడుస్తున్నది. వానిటీ బ్యాగులోంచి అద్దంతీసి కన్నీళ్ళు తుడుచుకొని పౌడరు అద్దుకున్నది. ముఖం ముడతలు పడుతున్నది. జుట్టు నెరసిపోతున్నది. తానిప్పు డొక వృద్ధనారి- తనకు ఏ పక్షవాతమో రావడానికి ఇంకా ఎంతోకాలం పట్టదు. అప్పుడు తన గతేమిటి? ఏ యువకుడితోనో వెళ్ళిపోయే ఈ కూతురు తనను చూస్తుందా? భర్తకు దూరమయ్యింది. సమాజంలో మిథ్యాప్రతిష్టతో బ్రతుకుతున్నది. పొలాలు హరించుకుపోయాయి. ఇంటి అద్దె కట్టే స్థితి కూడా లేదు. డబ్బులేని తనను సెక్రటరీగా కూడా తీసేశారు. దొంగ సమాజం. దగా సమాజం. డబ్బు సమాజం. ఫాల్స్ సొసైటీ. తన గతి తన కూతురుకు పట్టకూడదు. ఉషను ఈ నాగరికత నుంచి, ఈ సంస్కారాలనుంచీ దూరంగా తీసుకొని

పోవాలి. తనకు ఏ ఫారిన్ రిటర్న్డ్ విస్కీ రంగడో అక్కర లేదు. బుద్ధిమంతుడై పొలాలు చూసుకునే రైతైతే చాలు. ఉషను నిజంగా సుఖపెడతాడు. పెనుమాక పరశురామయ్య కొడుకు అందంగా ఉంటాడు కూడా.

ఉష వచ్చింది.

"ఉషా. నీకు పెళ్ళి సంబంధం ఆలోచిస్తున్నాను. పెనుమాకలో పరశురామయ్య అని ఒక రైతున్నాడు. ఆయన కొడుకు బుద్ధిమంతుడు."

"అమ్మా. నా కిప్పుడప్పుడే పెళ్లి వద్దు."

"ఏ మొహం. ఆడపిల్లలకు సంబంధాలు వచ్చినప్పుడు చేసుకోకపోతే తరువాత ఎన్ని అగచాట్లు పడాలో నీకేం తెలుస్తుంది?"

"మెడిసన్ పూర్తికాకుండా నేను పెళ్ళిచేసుకోను. అంతే కాదు, నేను ఒక డాక్టర్‌నే చేసుకుంటాను. ఇరువురం కలిసి గుంటూరులో ప్రాక్టీసు పెడతాం."

"ఉషా, నీ ఊహలు ఉజ్వలంగానే ఉన్నాయి. కానీ వాస్తవం చాలా చేదుగా వుంటుంది. సెక్సు పుస్తకాలు చదవమని నీకిచ్చి షికార్లకు తిప్పేవాడు జీవితభాగస్వామి అవుతాడని నీవు నమ్మవద్దు. ఈ లోకంలో తెల్లనివన్నీ పాలుకావు తల్లీ. మెరిసే దంతా బంగారం కాదు. నేను తెలిసి చేసిన తప్పే నువు తెలియక ఏం చేయవద్దు."

"రాజా సంగతి నీకెలా తెలిసింది?"

"ఓహో, వాడి పేరు రాజాయా? ఎవరబ్బాయి?"

"తెలియదు."

"ఎక్కడుంటాడు?"

"తెలియదు."

"ఏం చేస్తుంటాడు?"

"డాక్టరీ పాసైనాడని చెప్పాడు. త్వరలో గవర్నరుపేటలో ప్రాక్టీసు పెట్టాలనుకుంటున్నాడు."

"ఎన్నాళ్ళనుంచీ సాగుతుంది ఈ వ్యవహారం?"

ఉష మౌనం.

"ఎక్కడ కలుస్తుంటారు?"

నిశ్శబ్దం.

మధుమతి కోపంతో వూగిపోయింది. ఉష చెంప ఛెళ్ళు మంది.

"అమ్మా" అని పెద్దగా కేకవేసింది ఉష.

"ఉషా! కమలాక్షి అన్నంత పనీ అయ్యిందమ్మా. నీవు అప్పుడే చెరుకు గడవై నావు. నేను బస్తీకి వచ్చింది నీచేత వృత్తి పెట్టించి వేశ్యామాతగా బ్రతికేందుకా?" మధుమతి ఏడుస్తున్నది. ఆమెలోని ఆవేశం కట్టలు తెంచుకొని ప్రవహిస్తున్నది. ఆవెకు దిక్కూ దరీ తోచటంలేదు.

"నాకింకేం దారి భగవంతుడా?"

ఉష ఇంకో మధుమతి కాకూడదు.

మరో లక్ష్మిని కానివ్వను.

మధుమతి ఉష భుజాలమీద చేయి వేసింది చేతులు చల్లబడ్డాయి. మధుమతికి ఒక భాగం పనిచేయడంలేదు. ఒక కాలు, ఒక చేయి పక్షవాతం. నగరమంతా తనను చూచి పరిహసిస్తున్నది. "ఆ కుంటిముండ...." అంటున్నారంతా. ఇక తన జీవితం గడిచేదెట్లా? ఒకనాటి అందాలరాణి జమీందారిణి ఈనాడు పక్షవాతపు మల్లమ్మ. "అయ్యో, అయ్యో" మధుమతి యేడుస్తున్నది. తాను నాశనమయ్యింది. కూతురు నాశనమయ్యింది. సంసారాన్ని చేజేతులా తానే ఇలా చేసుకున్నది.

"ఉషా ఉషా" పిలుస్తున్నది. గొంతెత్తి పిలుస్తున్నది.

కానీ మాట పడిపోయింది. నోరు పెగలడంలేదు.

"ఉషా" పెదవులు ఆడుతున్నాయి.

* * *

మధుమతి లేచి పక్కమీద కూర్చున్నది. ఆమె శరీర మంతా చెమట పట్టింది. గుండె రైలు ఇంజనులా కొట్టుకుంటు న్నది. ఉష వైపు చూచింది. ఉష గుండెల మీద మెట్రిక్ పరీక్ష పుస్తకం పెట్టుకొని నిద్రపోతున్నది.

"ఇదేమిటి. ఉష డాక్టరు కాలేదా? ఆ రాజా ఎవరు?"

మధుమతి తన శరీరాన్ని గిల్లి చూచుకున్నది.

తనకేమీ పక్షవాతం లేదు.

"ఇదంతా కలా?"

"ఎంత భయంకరమైన కల."

"మల్లమ్మా, ఇది కలకాదు. ఇల. జరుగబోయే భవిష్య వాణి" అని చెప్పింది అంతరాత్మ.

మధుమతి భయంతో కళ్ళు మూసుకున్నది.

రాజా ఉషను మోసగించాడు.

ఉష గర్భవతి అయ్యింది.

రాజా పారిపోయాడు.

ఉష ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నిస్తున్నది.

మధుమతి చూచి రక్షించింది.

ఎబార్షన్ చేయించాలని ప్రయత్నించింది.

"వద్దమ్మా, నే నీ శిశు హత్య చేయలేను. పెళ్ళికాకుండా తల్లి నైనానన్న కళంకం వచ్చినాసరే. నా కీ పాప కావాలి."

"పాప కాదే రాక్షసీ, అది నీ పాపం."

"ఫరవాలేదు. మహాభారతానికి కారకురాలు కుంతీదేవి కన్యగానే గర్భవతి కాలేదా? అందువల్ల ఆమె ఘనతకేం లోపం వచ్చింది?"

"డెవిల్ కోట్స్ స్క్రిప్చర్స్ - నీ పాపానికి పురాణాలూ. కావ్యాలలోంచి కొటేషన్లా. నోరు ముయ్యి."

మధుమతి తలలో లావా పర్వతం బ్రద్దలయ్యింది.

మధుమతి కళ్ళు తెరిచింది.

ఎదురుగా నిశ్శబ్దంగా అమాయికంగా ఉష నిద్రపోతున్నది.

ఏం పీడకలలు.

యేం భయంకరమైన ఊహలు."

"ఉషను తీసుకొని నేనిక కర్లపాలెం పోతాను" అనుకొన్నది మధుమతి.

"నీవు పోతావుసరే, ఆయన రానివ్వద్దూ?" అంతరాత్మ ప్రశ్నించింది.

"రానిస్తాడు. తప్పక రానిస్తాడు.ఆయన నన్ను క్షమిస్తాడు."

# 13

మధుమతి ఫర్నిచర్ అమ్మివేసి అప్పులు తీర్చింది. పార్వతమ్మ పక్కవాటాలో చిన్న ఇంట్లోకి మారింది. కర్నూలు పోవాలన్న ఆమె ఊహకు బలం చాలలేదు. ధైర్యం రాలేదు. ఒకటి రెండుసార్లు తెలిసిన వాళ్ళతో కోటయ్యకు కబురు పంపించింది. కానీ ప్రత్యుత్తరం శూన్యం. విడిపడిన ఈ సంసారం కలుస్తుందన్న ఆశ ఇక మధుమతికి పోయింది. అయితే ఇక జరుగవలసిన దేమిటి? మధుమతి కోసం ఇప్పుడెవ్వరూ ఫోన్లు చేయుడంలేదు. కార్లు రావడంలేదు. "మా మీటింగుకు అధ్యక్షత వహించ"మని వచ్చి ఎవ్వరూ పిలువడంలేదు.

ఉష మెట్రిక్ పరీక్షలు వ్రాసింది. రిజల్ట్సు వచ్చాయి. ఫస్టు క్లాసులో పాసయ్యింది. మధుమతి కన్నులు ఆనందంతోనూ, విషాదంతోనూ చెమర్చాయి.

"వదినెగారూ. ఉష పరీక్షలో ఫస్టున పాసయ్యింది." మధుమతి సంతోషంగా పార్వతమ్మతో చెప్పింది. పార్వతమ్మ ఆనందపడింది. కొంచెంసేపట్లోనే బెల్లము. మొరమొరాలు కొబ్బరిముక్కలు కలిపి స్వీట్ చేసి పట్టుకొచ్చింది.

"యేదమ్మా మా కోడలికి మిఠాయి తినిపిస్తాను" అంటూ పార్వతమ్మ వచ్చింది. కొంచెం మధుమతి చేతిలో పెట్టింది. మధుమతి దానిని నోటిలో వేసుకుంది. ఎంత తీయగా ఉంది. జాంగ్రీ, గులాబ్‌జామూన్, రసగుల్లా, బాదుషా, కలాకండ్‌లకన్న తనకు వాణిజ్య సంఘాలవాళ్ళు, మహిళా మండలి సభ్యులు ఇచ్చిన ఘనమైన విందులకన్నా ఈ మొరమొరాలు ఎంత బాగున్నాయి!

మధుమతి పార్వతమ్మను ఆదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టింది. ఆమెతో చాలాసేపు ఇష్టాగోష్టి జరిపింది. నిజానికి పార్వతమ్మ పెద్ద మాటకారి కాదు. ఆమె సంభాషణలో విశేషమైన

ఆకర్షణ యేమీలేదు. అందులో మత్తులేదు. గ్లమర్ లేదు. తళుకు బెళుకులు లేవు. ప్రగతి మహిళా మండలి సభ్యురాండ్ర ప్రసంగాలలోని శ్లేషలు, శబ్దాలంకారాలు లేవు. పార్వతమ్మ సంభాషణ పాతచింతకాయ పచ్చడిలా ఉంది. కానీ పలావుల కర్తినూనె తో జబ్బుపడి లేచిన నోటికి పాతచింతకాయ పచ్చడే అమృత ప్రాయంగా వుంటుంది. అది సిద్ధౌషధం. తాను వండుకునే కూరల గురించి, రాబోయే పంటగల గురించి పార్వతమ్మ మాట్లాడింది,

"నిన్న పావుకిలో బెండకాయలు తెచ్చాను. పోపులో వేసి ఓ రెండు మజ్జిగ పులుసులో వేశాను. పూర్వం బెండకాయలు తరుగుతూ ఉంటే, పులుసు ఉడుకుతూ వుంటే గది మొత్తం ఘుమఘుమలాడిపోతూ వుండేది. ఈ మందులు వచ్చాక ఒక్క కూరకూ రుచిలేదు. చెరుకుగడ తీయగా వుండదు, చింతకాయ పుల్లగనూ వుండదు."అని పార్వతమ్మ నవ్వింది.

"జనం పెరిగారు. అందుకని ఉత్పత్తీ పెరగాలి."

"నిజమే. అందుకు లక్షల ఎకరాల బంజరులను సాగులోకి తేవాలి. అంతేగానీ, ఉన్న భూమినే పిండితే పిండితే యేమౌతుంది? బంగారు గుడ్లుపెట్టే బాతు పొట్టకోసిన కథ అవుతుంది."

పార్వతమ్మ అమాయకురాలు, ఆమెకు కళాశాల విద్య లేదు. కానీ ఆమె చెప్పిన సత్యం ఈనాడు వ్యవసాయ విశ్వవిద్యాలయాల్లో డాక్టరేట్ పట్టాలు పుచ్చుకున్న మేధావులు చెప్పిన మాట.

"తిండికి గింజలులేవుగానీ,పొగాకుట పొగాకు! ఈ పొగాకు, పత్తి, మిర్చి అమ్ముకొని విదేశాల్లో డబ్బు సంపాదిస్తారట ఆకలైతే ఆ రూపాయలు మింగుతారా? ఆ డబ్బుపెట్టి బర్మా బియ్యం కొనుక్కుంటారట. ఇదేం ఖర్మ. మన పొలాలు పాడు చేసుకొని పొగాకు పండించి ఆ డబ్బుతో బర్మా బియ్యాన్ని కొనుక్కోవడం. వాళ్ళు అమ్మరనుకో అప్పుడు మనం పొగాకును భోంచేయవలసి వస్తుందని మా ఆయన అన్నారు"

మధుమతి నివ్వెరబోయింది, "ఆమె మాట్లాడుతున్నవి సామాన్యమైన మాటలు కావు. ఒక సామాన్య గృహిణి ఇంతటిఅసా

ధారణ శాస్త్ర ప్రజ్ఞను అర్థిక సిద్ధాంత పాండిత్యాన్ని యెలా ప్రదర్శించ గలుగుతున్నది?" ఆ తరువాత చాలాసేపు పార్వతమ్మ పెళ్ళిళ్ళ గురించి, సంబంధాల గురించి స్త్రీల వివాహ సమస్యల గురించీ పచ్చాపాటీ మాట్లాడింది. ఉషకు త్వరగా పెళ్ళి చేయమని సలహా చెప్పింది.

"మెడిసన్ చేయించి పెళ్ళి చేయాలనే వో కోరిక ఉండేది" అన్నది మధుమతి.

"అప్పుడు పెళ్ళి మనం చేయనక్కరలేదమ్మా, వాళ్ళే చేసుకుంటారు. కాకపోతే చిక్కేమిటంటే: వాళ్ళు చేసుకున్న పెళ్లిళ్ళు స్థిరంగా వుంటాయన్న నమ్మకం తక్కువ. ఏదో వయసులోని ఆవేశం కొద్దీ చేసుకుంటారు. తరువాత బ్రతికినంత కాలం పశ్చాత్తాప పడుతుంటారు, పెద్దవాళ్ళలాగా. మంచీ చెడూ అన్ని వైపుల నుంచీ ఆలోచించి చేసుకునే ప్రజ్ఞా, వోపికా వాళ్లకు ఉండదు," పోనీ పొత్తు కుదరకపోతే విడాకులు తీసుకోవచ్చు కదా। అంటున్నారిప్పుడు చూరులో ఎలుక వుందని ఎవడో చూరుకే నిప్పంటించాడట. ఉన్న సమస్యలుపోయి ఉపరి సమస్యలు వస్తాయి? అవి ఇంకా భయంకరంగా ఉంటాయి. విడాకులు పుచ్చుకున్న దాన్ని మరొకడు భార్యగా స్వీకరిస్తాడా స్వీకరించినా ఈవిడలాటి వాడే వస్తాడు గానీ వో మామూలు వ్యక్తి నిండు మనస్సుతో ఆదరిస్తాడా? పిల్లలు పుట్టినాక విడాకులు తీసుకున్నారనుకో ఆ పిల్లల గతేమవుతుంది. వాళ్ళకు సహజమైన తలిదండ్రుల ప్రేమ కరువవుతుంది. దాంతో వాళ్ళు దొంగలు, తాగుబోతులుగా మారతారు. సినిమా హాళ్ళ వద్ద జేబులు కత్తిరిస్తారు. టిక్కెట్లు బ్లాకులో అమ్ముకొని బ్రతుకుతుంటారు. అందుకే సంసారాలు సర్దుకొని పోతూండాలి. మా ఆయన కోపంతో రెండు తంతాడు. నేను నోరు మూసుకుంటాను. నాకెప్పుడన్నా కోపంవచ్చి నాలుగు తిట్టాననుకో అప్పుడు మీ అన్నగారు నోరు మూసుకొని వంట చేస్తారు" పార్వతమ్మ ఫక్కున నవ్వింది ఆ నవ్వు నిర్మలంగా వుంది.

మధుమతి కూడా నవ్వింది.

కానీ ఆ నవ్వు పేలవంగా ఉంది.

"చాలా మాట్లాడేసేస్తున్నాను వదినగారూ. ఆయన వచ్చేవేళ అయ్యింది. వెళ్ళి కాఫీ పెట్టాలి. అసలే అలసిపోయి వస్తారు. తుంపు గుడ్డ దగ్గర నుంచీ నేను అందిస్తేతప్ప ఆయనకు చేత కాదు." అంటూ పార్వతమ్మ వెళ్ళిపోయింది.

మధుమతి ఆలోచనలో పడింది. పార్వతమ్మ తనను ఉద్దే శించి ఏమీ అనలేదు. అయినా ఆ మాటలన్నీ మధుమతికి శూలాం లాగానాటుకున్నాయి ప్రగతి క్లబ్బులో వనజాక్షి, వైదేహి తనతో ఇంగ్లండులో జరిగిన క్రికెట్ పోటీ గురించి, ఆమ్‌స్టర్ డామ్‌లో జరిగిన టెన్నిస్ గురించి, న్యూయార్క్‌లో జరిగిన ప్రపంచ శ్రీ సౌందర్యం పోటీ గురించి చర్చిస్తూ ఉండేవారు. ప్రముఖ సినీ తారల రహస్య ప్రణయ వృత్తాంతాల గురించి మాట్లాడేవాళ్ళు. ఒక్కనాడూ. ఒక్కరూ పార్వతమ్మలా జీవన సమస్యల మహా వృక్షాల వ్రేళ్ల వద్దకు పోయి ఆలోచించలేదు. అంతా ఎగ్జిబిషన్ షో, పాంప్, గ్లామర్, గైటీ....

మధుమతి మత్తుమందు మింగి నిద్రపోయింది.

రోజులు బలహీనంగా గడుస్తున్నాయి. ఎవ్వరికోసమూ ఆగకుండా కాలం చక్రం తిరిగిపోతున్నది. మధుమతి ఇప్పుడుచాలా సింపుల్‌గా జీవితం గడుపుతున్నది. ఆమెలో ఈనాడు వెనుకటి పట్టుదలలు, పంతాలు లేవు. అజ్ఞానమూ. అహంకారమూ లేదు. లోకం యొక్క వెలుగునీడల్ని చూచింది. బ్రతుకంటే యేమిటో అనుభవించి తెలుసుకున్నది. అనుభవం రాకముందు తప్పుచేయ డం మానవ సహజం వచ్చాక కూడా చేసేవాడు మూర్ఖుడు.

మధుమతి ఒకనాడు ప్రకాశం రోడ్డు లోంచి పోతుండగా సూర్యం పోతూ కనిపించాడు. అతని చేతిలో బత్తాయి పండ్లు న్నాయి.

"సూర్యం" మధుమతి కేక వేసింది.

సూర్యం వెనక్కి తిరిగి చూశాడు.

"వదినా"

"ఎప్పుడొచ్చావు ?"

"వచ్చి వారం రోజులయ్యింది. అన్నయ్యకు ప్రమాదంగా ఉండి. హస్పటల్లో చేర్పించారు."

మధుమతి కళ్లు అదిరాయి.

"నాకు తెలియదే. చెప్పలేదే!"

"ఔను అన్నయ్య వద్దన్నాడు"

"ఎక్కడ ?"

"నాతో రా వదినా"

ఇరువురూ హస్పటల్ లోపలికి పోయారు.

'ఇప్పుడెవరూ లోపలికి పోకూడదు. సాయంత్రం నాలుగు నుంచి శీర్రి అవర్స్" అన్నాడు గేట్ కీపర్.

అప్పుడు సూర్యం తన పాస్ వదినకచ్చి "నీవువెళ్లు వదినా, మర్యే హాలు అని చెప్పు" అని బత్తాయిపండ్లు కూడా ఇచ్చి తను బయట కూర్చున్నాడు. మధుమతి కాళ్లు వణుకుతున్నాయి. ఆమె గుండె యెందుకో అజ్ఞాతంగా వేగం పుంజుకున్నది.

మధుమతి హాలులోపలికి వెళ్లింది. కోటేశ్వరరావు ప్రశాంతంగా కళ్ళు మూసుకొని ఉన్నాడు. అది కామన్ వార్డు. మామూలు రోగులతోపాటు కోటయ్య బెడ్ కూడా ఉంది.

మధుమతి కోటయ్యను చూచింది. కొండవాగు పర్వతానికి తట్టుకొని ఆగిపోయి పక్కకు తిరిగి ప్రవాహ వేగాన్ని పుంజుకొని కొండచివరినుంచి జలపాతంగా దొర్లినట్టు మధుమతి, లోపల అవ్యక్తంగా యెంతోకాలం నుంచీ దాగిన సుషుప్త దుఃఖం ఒక్కసారి పొంగి ప్రవహించింది.

నర్సు గబగబ పరుగెత్తుకుంటూ వచ్చింది.

"ఇక్కడ యేడవకూడదు" అని మధుమతిని నివారించింది.

మధుమతి ప్రయత్నపూర్వకంగా దుఃఖాన్ని నివారించుకుంది

"పెద్ద డాక్టరమ్మ వస్తున్నారు. అంతా వరండాలోకి పొండి" కేక వేసింది హెడ్ నర్సు. రోగులనంటి పెట్టుకున్న బంధువులంతా బయటికి నడిచారు. పెద్ద డాక్టరమ్మ రౌండ్సుకు వచ్చింది.

"హలో మధుమతీ మీరిక్కడున్నారేమిటి." అన్నది డాక్టరమ్మ. బయటకు వెళుతున్న మధుమతిని పలకరిస్తూ.

"గుడ్ మార్నింగ్ డాక్టర్. మా ఆయనకి ఆరోగ్యం బాగా లేక ఇక్కడ చేర్పించారు కదా"

"యెవరు?"

"కోటేశ్వరరావుగారు" అని మధుమతి వేలితో చూపింది.

డాక్టరమ్మ ఆశ్చర్యంగా కనురెప్పలు యెగురవేసి "ఎవరు" కోటయ్యా?"

"ఔను. కోటయ్యే నేను కోటయ్య భార్య మల్లమ్మను.

డాక్టరు విచిత్రంగా నవ్వింది.

"అదేమిటి వీరిని కామన్‌వార్డులో చేర్పించారు?"

"డబ్బులేక డాక్టర్. నేనిప్పుడు జమీందారిణిని కాను. ఓ మామూలు రైతుకూలీ భార్యను."

డాక్టరమ్మ ఇంకేమీ మాట్లాడలేదు."

మధుమతివంక ఓసారిచూచి తలవంచుకుని వెళ్ళిపోయింది.

డాక్టరమ్మ వెళ్ళాక బంధువులంతా వచ్చారు. మధుమతి బత్తాయిపళ్ళు వలుస్తూ కూర్చున్నది. ఆమెకళ్ళు శూన్యాకాశాన్ని చూస్తున్నాయి. అలా ఎంతసేపు కూర్చుందో ఆమెకే తెలియదు.

"రసం క్రిందకారిపోతున్నది ఇంకేం వలుస్తావు."

మధుమతి తృళ్ళి పడింది. ఈ లోకంలోకి వచ్చింది.

కోటయ్య తనవైపు చూస్తున్నాడు.

"ఎంతసేపయిందయ్యా నీవు నిద్రలేచి?"

"ఇప్పుడే ఎంతసేపయింది నీవు వచ్చి,"

"ఇప్పుడే కాసేపయ్యింది."

ఆ తరువాత ఎవరేం మాట్లాడాలో తెలియక ఆగిపోయారు. కోటయ్య ఆలోచిస్తున్నాడు. బస్తీకి వచ్చాక మధుమతి తనను నీవు అనడం మానేసి మీరు అనడం మొదలుపెట్టింది. డార్లింగ్స్ అని, హబ్బీ అని అంటూండేది. ఇన్నాళ్ళకు ఇన్నేళ్ళకు మళ్ళీ "నీవు"

"మీరు"—లో ఎంతదూరం.

"నీవు"—ఎంత సాన్నిహిత్యం.

"ఉష బాగుందా ?" కోటయ్య సంభాషణ మొదలుపెట్టాడు.

"ఊఁ పరీక్ష ఫస్టుక్లాసులో పాసయ్యింది."

"సూర్యం ఏడీ ?"

"బయట కూర్చున్నాడు."

"కారులో కూర్చున్నాడా ?"

మధుమతి ఒక్కక్షణం ఆగి "కారు కొనడం, అమ్మేయడం వెంటనే జరిగిపోయింది. ఫర్నిచర్ కూడా అమ్మేశాను. బంగళా మార్చి పార్వతమ్మగారి ఇంటిపక్కన పెంకుటింట్లో ఉంటున్నాను."

కోటయ్య మధుమతి వైపు సూటిగా చూశాడు.

"నాకు ఇవన్నీ తెలియవు."

"అవును తెలుసుకునే అవకాశం కూడా లేదు."

"కమలాక్షివాళ్ళు బాగున్నారా ?"

మధుమతికి ఆ మాటలలో ఏదో వ్యంగ్యం కనిపించింది.

"నాకూ ఆ క్లబ్బులకు సంబంధం తీరిపోయింది. నేను నా పదవులన్నిటికి రాజీనామా చేశాను. ఆ మధ్య కమలాక్షి డైవోర్సు యిచ్చిందని, సక్సేనాతో వేరే కాపురం పెట్టిందని ఏవేవో వార్తలు వచ్చాయి.

కోటయ్య ప్రశాంతంగా వింటున్నాడు.

"నీలో ఎందుకింత మార్పువచ్చినట్లు ?" కోటయ్య ప్రశ్నించాడ.

"మార్పు వచ్చిందో రాలేదో నాకు తెలియదు కానీ మార్పు అనేది సృష్టిలోని ఒక సహజ పరిణామం. సృష్టి ఎప్పుడు ఒకే రకంగా వుండదు. అలాగే మనిషి మనసుకూడా అనుభవాలను బట్టి, అది పరిణామం చెందిపోతూ వుంటుంది. కొందరుజీవితంలో ముందే మేలుకుంటారు. కొందరికి ఆ అవకాశం ఉండదు. స్వయంగా అనుభవించిగానీ తెలుసుకోలేరు."

కోటయ్య నిశ్శబ్దంగా వింటున్నాడు.

అతని కనుల వెంట ఎందుకో తెలియకుండా ఒక్కసారి నీళ్ళు తిరిగాయి.

"నీకు సూర్యంతో కబురుపెట్టాలని ఓసారి అనిపించింది. కానీ వచ్చేతీరిక వుండదని అనుకొని నా ప్రయత్నం విరమించు కున్నాను."

"చచ్చిన పామును చంప నక్కరలేదు. ఈ హడావిడి, విశ్రాంతిలేని జీవితం. అర్థంలేని వ్యామోహాలు నాకై నేను కల్పించుకున్నవే. కాబట్టి వదిలి చుకోవడంకూడా పెద్ద కష్టం కాదు."

"భోంచేశావా ?"

"ఇంకాలేదు. సూర్యం ఎక్కడ తింటున్నాడు ?"

"ఇక్కడే షెడ్‌లో ఉంటున్నాడు. ఇదిగో ఈ పండు తీసుకో" అని కోటయ్య తనకు ఇంతకుముందే మధుమతి వలిచి చేతికిచ్చిన పండును తిరిగి ఆమెకిచ్చాడు. మధుమతి వద్దనలేదు. ఒక్కొక్క తొనని విడదీసి అప్యాయంగా తిన్నది. ఆ పండులో ఏదో అమృతం ఉన్నట్లు ఉంది. ఏ బత్తాయి పండ్లకూ ఎన్నడూ తానెరుగని కొత్తరుచి అందులో కనపడింది.

"నీవిక ఇంటికి వెళ్ళు. ఉష నీకోసం ఎదురుచూస్తూ ఉంటుంది."

మధుమతి నర్సు దగ్గిరకి వెళ్ళి ప్రత్యేకంగా మాట్లాడింది.

"యేం భయపడనక్కరలేదమ్మా ఆ క్రిటికల్ పిరియడ్ గడిచిపోయింది. ఆయన కోలుకుంటున్నారు. అయితే వారిక బరువులు మోయకూడదు. పొలం పనులకు పనికిరాదు.

మధుమతి ఒక్క క్షణం నిర్ఘాంతపోయింది, మళ్ళీ తేరుకున్నది. మాట్లాడకుండా బయటికి నడచింది. అయితే ఆమె మనస్సు ఇప్పుడెందుకో తేలికగాఉంది, వస్తున్నప్పుడునెత్తిమీద ఏదో కొండ బరువు ఉండేది. ఇప్పుడు ప్రశాంతంగా ప్రసన్నంగాఉంది. ఆయన పొలంపనులకు పనికిరాడన్న బాధకూడా ఆమెకు లేదు. మనిషి దక్కితే చాలుననిపించింది. మానవజీవితం చాలా విచిత్రమైనది. ఒక వస్తువుగానీ, వ్యక్తిగానీ దగ్గరగా ఉన్నప్పుడు ఆ విలువ తెలియదు. అయాచితంగా దొరికితే అంతకన్నా తెలియదు. దూరమైనకొద్దీ విలువతెలుస్తుంది. ఊపిరాడనికొద్దీ తేలికగా దొరికే ఈ

ప్రాణవాయువే సృష్టిలోని సమస్త వస్తువులకన్నా మిక్కిలి ఖరీదైన ద్రవ్యం అవుతుంది. గాలి- నీరు- వెలుతురు- పొలము- కోటయ్య.

మధుమతి ఆ సాయంత్రం నాలుగు గంటలకి సూర్యాన్నీ కూతురిని వెంటతీసుకొని మళ్ళీ హాస్పటల్‌కి వచ్చింది.

ఉష తండ్రిని చూసింది. కోటయ్య ఉషను చూశాడు.

ఆ సన్నివేశాన్ని వర్ణించటం చాలా సుదీర్ఘమవుతుంది. కాబట్టి అర్ధ్రమైన ఆ దృశ్యాన్ని పాఠకుల ఊహాకే రచయిత వదిలివేస్తున్నాడు.

ఆ మరునాటినుంచి మధుమతి పగలు రాత్రీ భర్తకు సేవ చేసి కోటయ్యను మళ్ళీ మనిషిగా చేసుకోగలిగింది.

మధుమతీ" కోటయ్య ఒకనాడు హాస్పటల్ బెడ్‌మీదనుంచి పిలిచాడు.

"నన్నలా పిలవ వద్దయ్యా నన్ను మల్లమ్మా అను."

"సరే- మల్లమ్మా నాకు ఇందాక వో తమాషా ఊహ వచ్చింది."

"యేమిటి?"

"యేంలేదు. నాకు సినిమాలల్లో వచ్చే వో సీను గుర్తుకు వచ్చింది."

"యేమిటాసీను?"

"యేం లేదు- కోటయ్య హాస్పటల్లో బెడ్‌మీద ఉన్నాడు. అతని కళ్ళకి కట్టుకట్టారు? వో నర్సు రాత్రింబవళ్ళు సేవ చేస్తున్నది. ఆమె శ్రద్ధనూ త్యాగాన్నీ చూచి కోటయ్య ముగ్ధుడైనాడు.

"నర్స్ నామీద ఎందుకింత అభిమానం? నేను నీకేం ప్రత్యుపకారం చేయగలను?" అన్నాడు.

"అది నా ఉద్యోగ ధర్మం" అన్నది నర్స్.

"నర్స్ చేసిన సేవకు ఆమెకు కొంతభూమి ఇచ్చి ఋణం తీర్చుకోవాలనుకున్నాడు. కానీ మంచిభూమి అంతా అప్పటికి తాను అమ్మివేసిన విషయం గుర్తుకువచ్చింది. తానేమీ ఇవ్వలేక పోతున్నందుకు బాధపడుతున్నాడు.

కోటయ్యకు కళ్ళకి కట్లు విప్పారు. అయితే కోటయ్య మొదటిసారి నర్సునే చూడాలనుకున్నాడు.

"నర్స్ వచ్చారా?" అని అడిగాడు.

"లేదు ఇవ్వాళ ఆమె లీవు మీద ఉన్నది" అన్నది హెడ్ నర్స్.

"కోటయ్య కళ్ళు మూసుకున్నాడు.

కోటయ్య నిద్రపోయాడు.

ఒకరాత్రప్పుడు కోటయ్యకు మెలకువ వచ్చింది. అంతా నిశ్శబ్దం. టంగ్, టంగ్ మంటూ గడియారం గంటలు వినపడు తున్నాయి. కోటయ్య కాళ్ళమీద ఎవరో తల ఆనించి నిద్ర పోతున్నారు. ఆ స్పర్శ కోటయ్యకు తెలుసు. ఆమె నర్స్ తన కోసం నిద్రలేకుండా అలా సేవ చేసీచేసీ ఏ రాత్రివేళనో కునికి పాట్లలో తన కాళ్ళవద్ద తల ఆనించుకొని పడుకున్నదన్నమాట.

కోటయ్య కళ్ళు తెరిచాడు.

"నర్స్ నిన్నే మొదటిసారి చూడాలని ఇప్పటిదాకా కళ్ళు మూసుకున్నాను" అంటూ ఆమెవైపు చూచాడు.

ఆశ్చర్యం. ఇంతకాలం తనను నీడగా అంటిపెట్టుకొని సేవచేసిన నర్స్, నర్స్ కాదు మల్లమ్మ.

కోటయ్య ఆశ్చర్యపోయాడు...."

"ఎలా ఉంది ఈ ఊహ మల్లమ్మా?"

మల్లమ్మ ఫక్కున నవ్వింది.

నవ్వుతూ యేడిచింది—

యేడుస్తూనే కోటయ్య కాళ్ళకు నిజంగానే తల ఆనించు కొని పరవశించింది.

కోటయ్య నవ్వబోయాడు.

హెడ్ నర్స్ వచ్చింది.

"యేమిటీనవ్వులు. గుండెజబ్బువాళ్ళునవ్వకూడదుతెలుసా?"

# 14

"కాలం కరిగిపోతున్నది. ప్రకృతి పారిపోతున్నది. నవ తను అన్వేషిస్తూ మానవత దిక్కులేకుండా పోతున్నది. తన సుఖం కోసం మానవుడు నిర్మించుకున్న యంత్రం మానవుడికి మొగుడై నెత్తికెక్కి కూర్చున్నది. మానవుడి ఆరోగ్యానికి కాదు మందులు ఈనాడు మందులే మానవుడిని మజ్జిగ అన్నంలో ఊర గాయ ముక్కలా నంజుకొని తింటున్నవి."

ఈ భావాలన్నీ కోటయ్యకు వచ్చాయి. ఇదే పదజాలంతో ఇంత సున్నితంగా రాకపోయినా ఈ అర్థమూ భావమూ మటుకు అతనికి స్ఫురించింది. కోటయ్య, మల్లమ్మ, ఉష, సూర్యం ఎడ్లబండిలో మంగళగిరినుండి కర్లపాలెం వస్తున్నారు. మల్లమ్మ ఆలోచనల వలయాలలో నిన్నటి స్మృతి....

"టాక్సీలో తీసుకొనిపోతాను" అని మల్లమ్మ డాక్టరుతో చెప్పింది.

"వద్దమ్మా కొద్ది రోజులు ఇక్కడే కదలకుండా మీ ఇంట్లో ఉంచండి" అని సలహాఇచ్చింది. అందువల్ల మల్లమ్మ కోటయ్యను ముందుగా తన పెంకుటింటికితెచ్చింది. మల్లమ్మకు అయాచితంగా పార్వతమ్మ దగ్గరనుంచి లభించిన సహాయం ఆమెను ముగ్ధ రాలినిచేసింది.

"మీకునేను ఋణపడిపోతున్నాను" అన్నది మల్లమ్మ పార్వతమ్మతో.

"ఇదేమీ భాగ్యమూ కాదు. బంగారమూ కాదు. కేవలం మాట సహాయం. మనిషై పుట్టాక తోటి మనిషిని ఆ మాత్రం ఆదుకోకపోతే ఎందుకీ నరజన్మ? కాకులు, చీమలు, ఈగలు, చేపలు, చివరికి గొంగళీ పురుగులు కూడా గుంపులు గుంపులుగా కలసి సమష్టిగా బ్రతుకుతుంటాయి. అలా బ్రతకలేని వాడు ఒక్క మానవుడే. అంటే మనిషి గొంగళి పురుగుకన్నా అధ్వాన్నమన్న మాట.

మల్లమ్మకు గొంగళిపురుగు అనగానే అడయారు మర్రి చెట్టు క్రింద సంఘటన గుర్తుకు వచ్చింది. ఈ నవసమాజం లో గొంగళీపురుగు గొంగళీపురుగు పాకితే దురద పుడుతుంది. దానికి మందు రాస్తే ఒక సుఖం, ఒక ఆనందం. గొంగళీపురుగు పాకక పోతే ఈ ఆనందం వచ్చేది కాదు. కాబట్టి ఈ నాగరికతా సుఖం గొంగళీపురుగు పాకుడు ఆనందం.

కోటేశ్వరరావుకు నయమైన తరువాత విజయవాడకు 'గుడ్ బై' కొట్టి మల్లమ్మ మంగళగిరి బయలుదేరింది. వెళ్ళేటప్పుడు తాను వెళుతున్నట్లు మల్లమ్మ ఎవరికీ చెప్పలేదు. ఒకప్పుడు ఆమెకు వందలమంది ఫ్రెండ్స్ ఉండేవాళ్ళు. వేలమంది ఆమెను అభినందిస్తూ ఆటోగ్రాఫులు తీసుకుంటూ ఉండేవారు. ఈనాడు మల్లమ్మ వెళ్ళేటప్పుడు తాను వెళుతున్నట్లు చెప్పవలసిన వ్యక్తి లెవరూ కనిపించలేదు. కేవలం ఇరువురికి మాత్రం చెప్పింది. మొదటిది పార్వతమ్మకు. రెండవది వాళ్ళ వాకిట్లో రాత్రిపూట పడుకునే కుక్కకు. అది ఎక్కడో ఆహారం సేకరించుకొని వచ్చి రాత్రి మల్లమ్మగారి అరుగుమీద పడుకుంటుంది - ఎద్దుల బండి సాగిపోతున్నది.

మల్లమ్మ ఇంకా ఆలోచిస్తూనే ఉంది..........

బండివాడు వర్షాభావాన్ని గురించి, తుఫానువల్ల నిరుప యోగమైన భూములను గురించి, పెరుగుతున్న ధరలను గురించి అడక్కుండానే చెపుతూ ఎడ్లను తోలుతున్నాడు.

"హేయ్ హెహేయ్"

"ఎద్దులకు మేతకూడా లేదు. ఏం కాలం? ఈ మంగళ గిరిలో ఫాక్టరీలు పెడితారట. అప్పుడు జనం బస్తీల నుంచి వస్తా రట. వాళ్లకు ఇళ్ల స్థలాలు కావాలి పంటలు పండని పొలాల్ని ప్లాటులు చేసి అమ్ముకుంటే బోలెడు లాభం రైతులకి.

హేయ్. హెహేయ్"

మల్లమ్మ పరధ్యానంగా వింటున్నది.

దూరాన మోట బావుల దగ్గర ఏతాము క్రిందికి వెళ్ళి నీటిని తెచ్చి బయట పోస్తూ నిర్విరామంగా శ్రమిస్తున్నది. కానీ భూమి రసమయి కావడంలేదు. నీళ్ళు చాలడం లేదు. ఆకాశంలో వల యాలు వలయాలుగా కొంగలు, పింజలు పింజలుగా నీరులేని తెల్ల మేఘాల తుంపురులు. వేపచెట్టు క్రింద పడుకున్న బక్క- చిక్కిన గేదె. చెట్టు మీద దప్పికతో అరుస్తున్న వానకోయిల. కప్పలు నిశ్శబ్దంగా పడుకున్న గోదురు కప్పలు. నిర్విరా మంగా తుమ్మచెట్టు మీద అరుస్తున్న కాకి.

మల్లమ్మ భావ వలయాల లాగా ప్రకృతి
మల్లమ్మకు మళ్ళీ లక్ష్మి గుర్తుకు వచ్చింది.

తాము నవ్వుకుంటూ తుళ్ళుకుంటూ టూరింగు సినిమాలు చూడడానికి వెళ్ళిన మధురమైన రోజులు. అమాయకమైన కాలం స్వచ్ఛమైనన సహజమైన నిసర్గ సుందరమైన........

ఆ రోజులు మళ్ళీ రావు.

మల్లమ్మ ఇంటికి వచ్చింది. పాలేరు రత్తయ్య ముందు భాగంలో ఉంటూ ఇన్నాళ్ళూ ఇల్లు కాపలా కాస్తున్నాడు.

మల్లమ్మ ఇంట్లోకి పోయింది. ఎప్పుడూ ధన ధాన్యాలతో అలాజాలంగా ఎన్నో తరాలుగా ఉన్న లోగిలి ఇప్పుడు నిశ్శబ్దంగా వుంది.

ఇల్లంతా బూజుపట్టి వుంది.

మధ్య గదిలోకి వెళ్ళింది మల్లమ్మ. ఎక్కడ చూచినా పందికొక్కులు త్రవ్వి పోసిన మట్టి రాసులు.
దేవుడి పటం దగ్గరకు వెళ్ళింది.

దుమ్ముపట్టి అమ్మవారి ముఖం కనపడలేదు. చీరతో తుడుస్తూ మల్లమ్మ అన్నది. "నేను వచ్చేశానమ్మా. మధుమతినై మళ్ళీ మల్లమ్మనై వచ్చేశాను. ఎందుకు వచ్చానో నీకు తెలుసుగా. బస్తీలో నేనొక ఎగ్జిబిట్‌ను, షో రూమ్ ముందున్న పాలరాతి

బొమ్మను. నాతో బ్లూ ఫిల్ములు తీయాలనుకున్నారు. బ్రోతల్స్ నడపాలనుకున్నారు. అయితే వీటికి అక్కడ అందమైన పేర్లు సున్నితమైన మేలి ముసుగులు ఉంటాయి. పతనమైనా ఇమడలేక వచ్చేశాను"

అ ఇంటిని మళ్ళీ వాసయోగ్యంగా మార్చడానికి చాలా కాలమే పట్టింది. రత్తయ్య కోటయ్యను పొలానికి సాయంత్రం తీసుకు వెళతానన్నాడు. మల్లమ్మ పొలాలు ఎప్పుడో పోయాయి. కోటయ్య మంచి పొలాలు కూడా కరిగిపోయాయి. మిగిలింది ఈ చెక్క మాత్రమే.

సాయంత్రం కోటయ్య రత్తయ్యతో పొలానికి బయలుదేరాడు, మల్లమ్మ కూడా అనుసరించింది. నడుచుకుంటూ పొలానికి వెళ్ళారు. మల్లమ్మ కర్లపాలెంలో జరిగిన ఒక మహత్తర పరివర్తన చూచింది. పూర్వం పెంకుటిళ్ళున్న చోట డాబాలు వెలిశాయి. హోటళ్ళు, టెర్లిన్ చీరల దుకాణమ్లూ ఇంకొక సారాయి అంగడీ వచ్చాయి. ఈ మూడింటికీ ఉన్న గిరాకీ ఊళ్ళో ఇంకి దేనికీలేదు. తుఫాన్ దెబ్బతో నిత్యా నందం ఎరువుల దుకాణంకూడా పడుకున్నది.

అంతేకాదు ప్రజలలో పూర్వం ప్రేమ, స్నేహ భావం ఎక్కువగా ఉండేవి. కులాలతో మతాలతో ప్రవర్తిలేకుండా అంతా అన్నా, అక్కా, బాబాయ్, మామా అని వరసలుపెట్టి పిలుచుకుంటూ కలిసిమెలిసి ఉండేవారు. ఇప్పుడదిలేదు. అంటీ అంటని బస్తీజీవితపు ప్రభావానికి ఈ గ్రామంకూడా లోనయ్యింది. ఇప్పుడంతా రాజకీయాలమ గురించి ఎన్నికలమ గురించి మాట్లాడుకుంటున్నారు. కొట్లాడుకుంటున్నారు, పల్లెటూళ్ళలో యేవస్తువూ మిగల్చటంలేదు. అన్నీ తెల్లవారేసరికి బస్తీకి చేరతాయి. తమలపాకులు, అరిటాకులు, పెరుగు, పాలు, పూలు, యేం కావాలన్నా మళ్ళీ బస్తీనుంచే తెప్పించుకోవాలి.

ఈమధ్య కర్లపాలేనికి వో బస్సు పడింది. అది పొద్దునా, సాయంత్రం కర్లపాలెం తాకుతూ గతుకుల డొంకనుంచి మంగళగిరిపోతుంది. గ్రామ ప్రజలు రోడ్లకోసం, బస్సులకోసం అందోళన చేస్తున్నారు. దళారీనాయకులు రోడ్లు తెప్పిస్తామని ప్రజలనుంచి డబ్బులు గుంజుతున్నారు.

కోటయ్య, మల్లమ్మ పొలానికి చేరారు.

అన్ని పొలాలూ బాగా దెబ్బతిన్నాయి. అవిపొలాలవలె లేవు ఎండు బీళ్ళవలె ఉన్నాయి. మరుభూములనలెకనపడుతున్నాయి. కోటయ్య తనకు మిగిలిన చివరి ముక్క దగ్గరికివచ్చి నిలబడ్డాడు.

"ఇదేమిటి ?" అన్నాడు కోటయ్య నివ్వెరపోతూ.

"ఔనుబాబూ తుఫానువచ్చి నప్పటినుంచి ఇట్లాగే అధ్వాన్నమైపోయింది. మీరు చూచారుగా కొంత భాగం చవుడుపట్టి పోయింది. బాగుచేయించాలని ఎన్నో ప్రయత్నాలు చేశాను. కానీ లాభంలేకపోయిందండీ. నిత్యానందం గారికి మీ పేరుచెప్పి వో పదికట్టలు నత్రజని మందులుకూడా తెచ్చివాడాను. అవేవో దొంగ మందులండీ బాగు పడాల్సిందిపోయి, పొలం ఇంకా బీడుగా మారింది. అంతా కల్తీయే"

"ఈ సంగతి నాతో ఎందుకు చెప్పలేదు ?"

"చెపుదామనే బస్తీ వచ్చినానండి. గుండెపోటుతో మీరు హాస్పటల్లో ఉన్నారని తెల్సి చెప్పకుండా తిరిగివచ్చినాను. అయితే మొన్న వో సర్కారు ఆఫీసరు పొలాలు చూడటానికి వచ్చినాడండి. ఆయనకు అందరూ పొలాలుచూపి సలహాలు అడిగారండీ పొగాకు వేయడంవల్ల భూములు పాడైపోయాయని ఆయన వారితో చెప్పాడండి.

"మన భూమీ చూచారా ?"

"చూపించి నానండి. చెప్పారు"

"యేం చెప్పారు ?"

"భూమి పాడైపోయింది. ట్రాక్టరు కూడా దిగదని అయన గారు చెప్పినారండి"

మల్లమ్మ గట్టుమీద నిలబడి ఎండిపోయిన పొలాన్ని చూస్తున్నది, పృథ్విలో ప్రతిబింబం చూచుకుంటూ ! !

స మా ప్తం

